ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి

# శ్రీ ఎన్. టి. రామారావు ప్రసంగాలు

(జనవరి 1983 నుంచి మే 1984 వరకు)

ప్రచురణ

సమాచార, పౌర సంబంధ శాఖ
ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం
హైదరాబాదు

## ఇందులో ...

# భవిష్యత్తుకు వెలుగు బాట

మహోత్తుంగ జలధి తరంగాల్లా ఉత్సాహంతో ఉప్పొంగుతున్న ఈ జనసందోహాన్ని చూస్తుంటే నాలో ఆవేశం తొణికిసలాడుతూంది. పుట్టి ఏడాది అయినా నిండని మా 'తెలుగుదేశం' ఇంత త్వరలోనే అధికారంలోకి రావడం ప్రపంచ చరిత్రలోనే అపూర్వం. ఒక్క తెలుగువాళ్లే అసంభవాన్ని సంభవం చేయగలరని, తెలుగు పౌరుషం దావాగ్నిలా, బడబాగ్నిలా ప్రజ్వలించి అక్రమాలను, అన్యాయాలను దహించగలదని రుజువు చేశారు. అందుకు తెలుగుబిడ్డగా నేను గర్విస్తున్నాను. నాకు నా జాతి చైతన్యంమీద, పరాక్రమంమీద అచంచలమైన నమ్మకముంది. నా అన్నలు, తమ్ముళ్లు, చెల్లెళ్లు ఆగ్రహిస్తే వాళ్ల హృదయాల్లోంచి లావా ప్రవాహాలు వెలికి చిమ్ముతాయని నాకు తెలుసు. తెలుగు శౌర్యం విజృంభిస్తే ఎంత శక్తివంతమైన అక్రమ శక్తి ఐనా నేల కరుస్తుందని లక్షలాది ప్రజలు ఆచరణలో నిరూపించారు. అందుచేతనే మీ ముందు వినమ్రుడనై ఇది మీ విజయం—ఆరుకోట్ల తెలుగు వీర ప్రజానీకం సాధించిన అద్భుతమైన, అపూర్వమైన విజయమని మనవి చేస్తున్నాను. ఈ మహత్తర చారిత్రాత్మక విజయంలో నా పాత్ర ఎంత? మహా సముద్రంలో నీటి బిందువంత మాత్రమే. కాబట్టి తెలుగుదేశం గెలుపు తెలుగు ప్రజలందరి గెలుపని ప్రకటిస్తున్నాను.

ఈ ఎన్నికల్లో జనబలం అన్నింటినీ జయించింది. తెలుగుజాతి ఆత్మాభిమానం అంగడి సరకు కాదని, తెలుగువాడు మూడోకన్ను తెరిస్తే అధర్మం, అక్రమం, అన్యాయం కాలి బూడిదై పోతాయని మన రాష్ట్రంలో విజృంభించిన జన చైతన్య ఝుంఝూ ప్రభంజనం చాటిచెప్పింది. దాని ముందు కొండలుకూడా బెండులా ఎగిరిపోతాయని రుజువైంది. మీరిచ్చిన ప్రోత్సాహ తరంగాల మీదనే నా ప్రచార జైత్రయాత్ర అవిఘ్నంగా, అప్రతిహతంగా సాగిపోయింది.

నా పట్ల ప్రజలు ప్రదర్శించిన వాత్సల్యానికి, చేకూర్చిన ఈ అద్భుత విజయానికి ఎలా, ఏమని కృతజ్ఞత చెప్పాలో నాకు తోచడంలేదు. నిజానికి మీ ప్రేమానురాగాల గురించి వర్ణించడానికి మాటలు చాలవు. మీ ఋణాన్ని తీర్చుకోవడానికి నాకు ఒక జన్మ చాలదు. మళ్లీ జన్మంటూ ఉంటే తెలుగుతల్లికి తనయుడనై పుట్టి మీ సేవలో నా జీవితాన్ని చరితార్థం చేసుకోవాలని ఉంది. నాలోని ప్రతి అణువుసూ ప్రతి రక్తపు బొట్టునూ మీ కోసం ధారబోయాలని ఉంది. ఈ ఎన్నికల రణరంగంలో నన్ను అభిమానించి, విజయోస్తు అని ఆశీర్వదించి, రక్త తిలకం తీర్చి మంగళహారతులు పట్టిన తెలుగు మహిళలకు ప్రత్యేకించి అభినందనలు అర్పిస్తున్నాను. ఇక తెలుగు వాడినీ, వేడినీ ప్రతిబింబించే ఉడుకు నెత్తురు ఉప్పొంగే నవయువతరం గురించి ఏం చెప్పాలి? వాళ్లు వీరభద్రుల్లా విక్రమించారు. తెలుగుదేశం విజయసాధనలో అగ్రగాములయ్యారు. అలాంటి నా తమ్ముళ్లకు నేను చెప్పేదొకటే. ఇది మీ భవిష్యత్తుకు మీరు వేసుకున్న వెలుగుబాట. పోతే చిన్నారి పొన్నారి చిట్టిబాలురున్నారు. వాళ్లకు ఓట్లులేవు. అయినా శ్రీరాముని సేతుబంధనంలో ఉడత సహాయంలా ఈ బుడతలు చేసిన కృషికి నేను ముగ్ధుణ్ణయ్యాను. రేపటి వేకువ విరిసే ఈ లేత గులాబీ మొగ్గలను ప్రేమాభిమానాలతో ఆశీర్వదిస్తున్నాను.

'తెలుగుదేశం' ఎన్నికల ప్రణాళికలో రాష్ట్ర అభివృద్ధికి అనేక అంశాల కార్యక్రమం ఉంది. రాష్ట్ర ప్రజానీకం నామీద, తెలుగుదేశం మీద ఎన్నో ఆశలు పెట్టుకున్నారని నాకు తెలుసు. ప్రణాళికలోని వివిధ అంశాలను, వాటి ప్రాముఖ్యాన్నిబట్టి క్రమంగా అమలు జరుపుతాము. ఈ విషయంలో ఏరుదాటి తెప్ప తగలేసే తప్పుడుపని చేయబోమని హామీ ఇస్తున్నాను. ప్రధానంగా సమాజంలో అట్టడుగున ఉన్న బడుగు వర్గాల అభివృద్ధికి మా శాయశక్తులా కృషి చేస్తాము. త్రాగేందుకు మంచి నీళ్లకు సైతం నోచుకోని ఊళ్లున్నాయి. తలదాచుకోను తావులేని నిర్భాగ్య జీవులున్నారు. రెక్కాడినా డొక్కాడని శ్రమజీవులు లెక్కకు మిక్కిలిగా ఉన్నారు. వాళ్లను వెంటనే ఆదుకోవాలి. ఆ సమస్యలను పరిష్కరించాలి. గాంధీజీ గ్రామ స్వరాజ్యంగురించి కలలు గన్నారు. అదే రామరాజ్యం

అన్నారు. తెలుగుదేశం గ్రామాభ్యుదయం కోసం నిర్విరామంగా పాటు పడుతుంది. బడిపిల్లలకు ఉచిత మధ్యాహ్న భోజన పథకం, రెండు రూపాయలకు కిలో బియ్యం పేద ప్రజలకు అమ్మించడం, సక్రమంగా అమలు జరుపుతాము. వ్యవసాయం, పరిశ్రమలు, సమతూకంలో, సత్వరాభివృద్ధికి కృషి చేస్తాము. రాష్ట్రంలో వెనుకబడిన, కరువు కాటకాలకు నిలయమైన ప్రాంతాల అభివృద్ధికి ప్రత్యేక శ్రద్ధ తీసుకుంటాము. ఏ రూపంలోనూ ప్రాంతీయ సంకుచిత తత్వాలకు ఆస్కారం లేకుండా ఆంధ్రప్రదేశ్ సమగ్ర అభివృద్ధికి దీక్ష వహిస్తాము.

ఈ కార్యక్రమం అనుకున్నట్లు ఆచరణలోకి రావాలంటే పాలనా వ్యవహారాలు సక్రమంగా సజావుగా సాగాలి. ప్రభుత్వ యంత్రాంగం సమర్థవంతంగా పనిచేయాలి. ఉద్యోగులు ప్రజా పీడకులు కాకుండా, వాళ్ల ఉప్పు తింటున్న సేవకులుగా భావించుకోవాలి. కాని దురదృష్టవశాత్తు మన పాలనా వ్యవస్థ అలాలేదు. అధికారదర్పం, పనిలో జాప్యం, లంచగొండితనం వగైరా నానారకాలైన జాడ్యాలకు అది కేంద్రమైంది. ముప్పై అయిదేళ్లుగా పొరలు పొరలుగా పేరుకొని ఘనీభవించిన కాలుష్యాన్ని ప్రక్షాళనం చేయవలసి ఉంది. అయితే ఇది అనుకున్నంత తేలిక వ్యవహారం కాదని నాకూ మీకు కూడా తెలుసు. తెలుగునాట ప్రవహించే సమస్త పవిత్ర నదీ జలాలన్నింటితో కడిగినా ప్రక్షాళనం కావంతటి కశ్మలం పేరుకొనివుంది. ఇది 'తెలుగుదేశం'కు సంక్రమించిన వారసత్వం. కాబట్టి ఒక్కరోజులో ఈ పాలనా వ్యవస్థను మార్చడం అయ్యే పని కాదు. అయితే ప్రజల సహకారంతో, నిజాయితీపరులైన అధికారుల అండతోను ఈ కృషిలో జయప్రదం కాగలమన్న ఆత్మవిశ్వాసం నాకు ఉంది. మన అధికారుల్లో సమర్థులూ, నిజాయితీగా విధి నిర్వహణ చేసేవాళ్లూ ఉన్నారు. కాని గతంలో యిలాంటివాళ్లకు ప్రోత్సాహం లభించకపోగా నీతి నిజాయితీలకు కక్ష, కార్పణ్యాలే బహుమతులై మిగిలాయి. తెలుగుదేశం పాలనలో అన్ని విధాలా ప్రోత్సాహం ఉంటుంది. అలాగే అవినీతికి అలవాటుపడిన ఉద్యోగులక్కూడా ఈ సందర్భంలో ఒక హెచ్చరిక చేయదలచుకున్నాను. గతంలో ఏ అనివార్య రాజకీయ కారణాలవల్లనో, ఇతర కక్కుర్తి వల్లనో అక్రమాలకూ, అధికార దుర్వినియోగానికి పాల్పడినవాళ్లు

ఇప్పుడైనా పశ్చాత్తాపం చెంది, తమ పద్ధతులు మార్చుకుంటే మంచిది. లేకపోతే అలాటివాళ్ల విషయంలో నిర్దాక్షిణ్యంగా వ్యవహరించి తీరుతాము. వాళ్ల మీద కఠిన చర్యలు తీసుకుంటాము. ఈ విషయంలో మమ్మ ఏ శక్తీ అడ్డలేదు. కవాళ్లను ఏ శక్తీ రక్షించలేదని కూడా తెలియ జేస్తున్నాను. అన్ని శాఖల ప్రభుత్వ ఉద్యోగులు మాతో సహకరించి తెలుగునాడు సర్వతోముఖ వికాసానికి కృషి చేయాలని విజ్ఞప్తి చేస్తు న్నాను. ఉద్యోగుల సాధకబాధకాలను మా ప్రభుత్వం సానుభూతితో పరిశీలిస్తుంది. ముఖ్యంగా చాలీచాలని జీతాలతో బాధపడేవాళ్లకు తగిన సహాయం చేస్తుంది. అదే సమయంలో విధ్యుక్తధర్మ నిర్వహణలో నిజాయితీగా, సమర్థంగా పని చేయాలని కోరుతుంది. అనేక రంగాల్లో అనుభవజ్ఞులూ, మేధావులూ మన రాష్ట్రంలో ఉన్నారు. వాళ్లందరి సహకారాన్ని మేము సవినయంగా అర్థిస్తున్నాము.

రాను రాను మన రాష్ట్రంలో శాంతిభద్రతలు క్షీణిస్తున్నాయని, ప్రజల మాన, ధన ప్రాణాలకు, స్త్రీల శీలానికి రక్షణ లేకుండా పోయిందని అందరికీ తెలుసు. మన సమాజంలో అరాచక, హింసా, దౌర్జన్య శక్తులు వికటతాండవం చేస్తున్నాయి. ఈ విషయంలో మా ప్రభుత్వం గట్టి చర్యలు తీసుకుంటుంది. బందిపోట్లనూ, గూండాలను సమస్త సంఘ వ్యతిరేకులను నిర్దాక్షిణ్యంగా అణచివేసే విషయంలో అధికారులు తీసుకునే చొరవను అభినందిస్తుంది. పోలీసు శాఖలో ఉత్సాహవంతులు, సమర్థులూ, సాహసికులూ, నీతిపరులయిన వాళ్లున్నారు. అలాంటివాళ్లనూ మా ప్రభుత్వం అభిమానిస్తుంది. ఆదరిస్తుంది. ప్రజలను రక్షించవలసిన ఈ శాఖలో ఉన్న అవినీతిని నిర్మూలించేందుకు, పోలీసుల జీవితాలను బాగుపరిచేందుకు ప్రయత్నిస్తాము. పోలీసులను ప్రజలు నిజంగా తమ రక్షకులు అనుకునేట్లు ఆ శాఖను తీర్చిదిద్దాలన్నది మా సంకల్పం. అందుకు సహకరించవలసిందిగా ఆ శాఖ ఉద్యోగులందరినీ కోరుతున్నాను.

మన తెలుగునాడు వ్యవసాయ ప్రధానమైంది. అయినా రైతాంగం గిట్టుబాటు ధరలేక తగినంత పెట్టుబడిలేక నానా యిబ్బందులూ పడు తూంది. తెలుగుదేశం వ్యవసాయాభివృద్ధికి, దానితోపాటు సత్వర పారి శ్రామికాభివృద్ధికి పాటుపడుతుంది. మా ఎన్నికల ప్రణాళికలో ఈ

రంగాలలో తీసుకోవలసిన చర్యల గురించి పేర్కొన్న అన్ని అంశాలను అమలు జరుపుతామని మనవిచేస్తున్నాను. రాష్ట్రాభివృద్ధికి అవసరమైన అన్ని వనరులూ మనకున్నాయి. వాటిని నిర్ణీత పథకం ప్రకారం పట్టుదలతో అమలు జరపడం ద్వారా పెరిగిపోతున్న నిరుద్యోగాన్ని అరికట్టవలసి వుంది. ఇలాంటివే ఇంకెన్నో జటిల సమస్యలు మనముందున్నాయి. వాటన్నింటినీ ఓర్పుతో నేర్పుతో పరిష్కరించుకోవలసి వుంది. ఈ సందర్భంలో తెలుగుదేశంను అనూహ్యమైన మెజారిటీతో గెలిపించిన తెలుగు ప్రజలందరికీ నాదో విన్నపం. ఈ విజయానికి మీరే కర్తలు. అలాగే అభివృద్ధి కార్యక్రమాలలో కూడా మీవంతు పాత్ర పూర్తిగా నిర్వహించాలి. ఇది మీ ప్రభుత్వం. మీ సేవకు మనసా వాచా కర్మణా అంకితమైన ప్రభుత్వం. ఈ నూతన ప్రభుత్వాన్ని ప్రతిష్ఠించడంలో ప్రజలు చూపిన శ్రద్ధాసక్తులు, పౌరవ నిర్మాణాత్మక కార్యకలాపాలలో సైతం చూపించాలని, తెలుగునాడును వెలుగునాడుగా తీర్చిదిద్దే మహాయజ్ఞంలో అందరూ భాగస్వాములు కావాలని అర్థిస్తున్నాను. మీరు కేవలం ప్రేక్షకులుగా వుంటే చాలదని మనవిచేస్తున్నాను.

ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రజలే సర్వానికీ అధినేతలు. కాని ఇప్పుడు అది మనదేశంలో తలక్రిందులుగా వుంది. సామాన్యుడు ఓటుకాలంలోనే మాన్యుడవుతున్నాడు. ఆ తర్వాత ప్రజలగోడు వినిపించుకునే దిక్కేలేదు. ప్రజాస్వామ్యం ఈ మూడున్నర దశాబ్దాల్లో మేడిపండులా, కరి మింగిన వెలగపండులా తయారైంది. తెలుగుదేశం ప్రజాస్వామ్యాన్ని ఒక విశిష్ట జీవన విధానంగా, చారిత్రక పరిణామక్రమంలో మానవజాతి అశేష త్యాగాలుచేసి సాధించుకున్న వరంగా భావిస్తుంది. వ్యక్తి స్వేచ్ఛకు సమిష్టి సౌభాగ్యానికి అంతకుమించిన మంచి సాధనంలేదు. కాబట్టి ప్రజాస్వామ్యాన్ని కంటికి రెప్పలా కాపాడటం పవిత్ర కర్తవ్యంగా మేము భావిస్తున్నాము. ప్రజాస్వామ్యం ఆరోగ్యంగా పటిష్టంగా ఉండాలంటే ప్రతిపక్షం కూడా సంఘటితంగా సమర్థంగా వుండి తీరాలి. మేము ప్రతిపక్షాన్ని గౌరవిస్తాం. వాళ్లు ఇచ్చే సూచనలను శ్రద్ధగా పరిశీలిస్తాం. సముచితమైన హేతుబద్ధమైన విమర్శలను ఆహ్వానిస్తాము. మా తప్పులు నిర్దిష్టంగా చూపితే సరిదిద్దుకుంటాం. ఎన్నికల్లోనేకాదు, ప్రజాసేవలో కూడా ప్రతిపక్ష మిత్రులు

లను పోటీపడమని కోరుతున్నాను. ప్రతిపక్షం నిర్మాణాత్మకంగా వ్యవహరించి పార్లమెంటరీ ప్రజాస్వామ్య వ్యవస్థ సుస్థిరంగా, శోభాయమానంగా వర్ధిల్లేట్లు కృషి చేయాలని కోరుతున్నాము. మా పార్టీకి శాసనసభలో అత్యధిక సంఖ్యాబలం ఉన్నా ప్రతిపక్షాలపట్ల ఏమాత్రం చిన్నచూపు చూడమని ఆ విషయం ఆచరణలో నిరూపిస్తామని హామీ యిస్తున్నాము. అంతేగాదు మా పార్టీ హేయమైన పార్టీ ఫిరాయింపులను ప్రోత్సహించదు. ఆ విధంగా ప్రతిపక్షాన్ని బలహీనపరచి ప్రజాస్వామ్యాన్ని, ప్రహసనంగా మార్చే పాపానికి ఒడిగట్టదు. కాబట్టి ఈ విషయంలో మా ప్రతిపక్ష మిత్రపక్షాలు నిశ్చింతగా ఉండవచ్చు. శాసనసభలను అలక్ష్యంచేసి చక్క బెట్టుకోవాల్సిన వేరే స్వప్రయోజనాలు మాకు ఏమీలేవు. అందుచేత ప్రజాసమస్యల పరిష్కారాన్ని గురించి చర్చించటానికి సరైన ఏకైక వేదికగా శాసనసభను తెలుగుదేశం భావిస్తుంది. ప్రతిపక్షంకూడా అదేవిధంగా వ్యవహరిస్తుందని ఆశిస్తుంది.

ప్రజాస్వామ్య సమాజంలో పత్రికలకు విశేష ప్రాముఖ్యం ఉంది. అందువల్ల పత్రికల స్వేచ్ఛ విషయంలో తెలుగుదేశం ప్రభుత్వం ఏవిధమైన జోక్యం కల్పించుకోదు. ఎంతటి నిశిత విమర్శలనైనా సంతోషంగా స్వీకరిస్తుంది. ఆ విమర్శల్లో వాస్తవముంటే గుర్తించి లోపాలను సరిదిద్దుకుంటుంది. నిర్హేతుకమైన ఆరోపణలైతే, ఆ విషయం జనం ముందుంచుతుంది. ప్రజాస్వామ్య సౌధానికిగల నాలుగు మూల స్తంభాలలో ఒకటైన పత్రికా ప్రపంచంపట్ల మా ప్రభుత్వ వైఖరి యిది. ప్రజా హృదయాలను అద్దంలా ప్రతిఫలించే పత్రికలపట్ల ప్రజాసేవకు దీక్ష వహించిన యే ప్రభుత్వమూ భయపడవలసిన అవసరం లేదు.

మా పార్టీని, ప్రభుత్వాన్ని పొగిడినా, తెగడినా అన్ని పత్రికలపట్ల సమాన దృష్టితోనే వ్యవహరిస్తాము. పత్రికా స్వేచ్ఛను హరించడానికి అపఖ్యాతికరమైన బిల్లులను ఎట్టి పరిస్థితులలోనూ తెలుగుదేశం ప్రవేశపెట్టదని అసందిగ్ధంగా ప్రకటిస్తున్నాను. మా ప్రభుత్వ విధానాలలోని ఆచరణలోని మంచి చెడ్డలను నిర్మాణాత్మకంగా విమర్శించమని, ప్రజలకు యదార్థ పరిస్థితులను తెలియజేయమని పత్రికలకు విజ్ఞప్తి చేస్తున్నాను.

అలాగే రాజ్యాంగం గ్యారంటీ చేసిన పౌరుల ప్రాథమిక హక్కులను పరి రక్షించడంలో ఎలాంటి అక్రమాలు జరగకుండా జాగ్రత్త వహిస్తామని కూడా స్పష్టం చేస్తున్నాను.

వ్యక్తుల స్వార్థ ప్రయోజనాలకోసం, పార్టీమీద, ప్రభుత్వంమీద ఏవిధమైన వత్తిడి చేయవద్దని పార్టీ ప్రముఖులకూ, కార్యకర్తలకూ విజ్ఞప్తి చేస్తున్నాను. 'తెలుగుదేశం' శాసనసభ్యులు ఈ విషయంలో జాగ్రత్తగా వుండాలని ప్రజల సమిష్టి ప్రయోజనాలకు పాటుపడాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

'తెలుగుదేశం' ప్రాదుర్భావం గురించి, దాని ముందున్న బరువైన బాధ్యతల గురించి నా మనస్సులోని భావాలను మీకు వివరించాను. ఇక మీదట కూడా ఈ ప్రజారథాన్ని మీరే లాగాలి. తెలుగుజాతిని నయనానంద కరమైన నందనవనంగా తీర్చిదిద్దేందుకు ప్రజలే ఉద్యమించాలి. అప్పుడే మన ఆశలు ఆకాంక్షలు ఫలిస్తాయి. ఇప్పుడు ఏర్పడిన ప్రభుత్వం, ఈ మంత్రివర్గం, అధికార బృందం అంతా మీ సేవకులు. నిజమైన ప్రజా స్వామ్యంలో ఉండవలసిన పద్ధతే అది. ఇంతటి మహత్తర విజయాన్ని సాధించిన తెలుగు ప్రజలకు అసాధ్యమన్నది లేదు. కాబట్టి మీ పార్టీమీదా, అది సారథ్యం వహించే ప్రభుత్వంమీదా అజమాయిషీ, సర్వాధికారాలూ, మీకున్నాయి. తెలుగుభాష, సంస్కృతులకోసం తెలుగుజాతి సమగ్ర అభ్యు దయంకోసం అందరూ చేయూత నివ్వాలని మరోసారి అర్థిస్తున్నాను. సర్వకాల సర్వావస్థల్లో తెలుగు కీర్తి పతాకం సగర్వంగా నింగిలో ఎగిరేట్టు చూస్తాననీ, మీ అందరి అభిమానం, ఆశీస్సులు రక్షా కవచంగా ధరించి, తెలుగు వెలుగులను దిగంతాల పర్యంతం వ్యాప్తి చెందేటట్లు ప్రయత్నిస్తానని, తెలుగుజాతి మహోజ్వల భవిష్యత్తుకోసం అమరవీరులు ధారపోసిన వీరరక్తపు ధార సాక్షిగా శపథం చేస్తున్నాను.

*ముఖ్యమంత్రిగా ప్రమాణ స్వీకారం చేసిన తర్వాత 1983 జనవరి 9న, లాల్ బహదూర్ స్టేడియంలో అశేష జనవాహినిని ఉద్దేశించి......*

# అంకిత భావంతో .........

ఆవేశంతో పిడికిలి బిగించిన యువశక్తి దిద్దిన రక్తతిలకాలు, మంగళ హారతు లిచ్చిన ఆడపడుచుల అవ్యాజానురాగాలు, ఆశీర్వదించవచ్చిన పెద్దల మందహాసాలు- గత తొమ్మిదినెలలుగా నిత్యం నాకు ఎదురైన దృశ్యాలివి. ఈనాడు మీతో మాట్లాడుతోంటే అవన్నీ నా కనుల ముందర కదలాడుతూ ఆనందబాష్పాలు కురిపిస్తున్నాయి.

చరిత్ర ఎరుగని రీతిలో నాపై మీరు వర్షించిన అభిమానం, ఆదరం వెలకట్టలేనివి. మీరు చేకూర్చిన విజయం మరపురానిది, మరువలేనిది. నన్ను ఇంతగా కావాలనుకుంటున్న మీ అందరికీ మీవాణ్ణిగా మరోసారి నిండు హృదయంతో నమస్సులందజేస్తున్నాను.

మనకు మహోజ్వల చరిత్ర ఉంది. జగద్విఖ్యాతిగాంచిన జాతి మనది జీవనదుల గలగలలతో, పచ్చని పంట పొలాలతో ఫ్యాక్టరీల ఘంటారావంతో, దేశానికే తలమానికం కావలసిన 'తెలుగునాడు' ఈనాడు ఇలా మసకేసి పోయిందంటే, అక్షర క్రమంలో ప్రథమస్థానంలోవున్న ఈరాష్ట్రం అభి వృద్ధిలో ఎక్కడో వెనుకబడివుందంటే ఆవేదనతో హృదయం కృంగి పోయింది. ఎంత పిచ్చివాళ్లను చేశారు తెలుగువాళ్లను ! ఎంత వెర్రివాళ్లను చేశారు మనజాతిని !

ఇవన్నీ నన్ను కదిలించాయి. ఇన్నాళ్లు నన్ను ఇంతగా అభిమానించి ఈ స్థాయికి తెచ్చిన నా జాతి రుణం తీర్చుకోవాలన్న ఆకాంక్ష ప్రబలంగా కలిగింది. ఆవేశం పొంగింది. అందుకే కదిలివచ్చాను. మీకు తెలుసు. నేనిదివరకే చెప్పాను. ఇకనుంచి ఈ జీవితం మీదే అని. అవును. నిజంగా ఇక యిది మీదే. మీ అపూర్వ ఆదరణే నేనీ నిర్ణయాన్ని తీసుకునేట్లు చేసింది. ప్రజాసేవే పరమావధిగా, సమాజశ్రేయస్సే సర్వస్వంగా శేష జీవితాన్ని మీకు అంకితం చేస్తున్నాను.

ఇది మనసా...వాచా...కర్మణా చెబుతున్న మాట. 'తెలుగుదేశం ప్రభుత్వం నిజమైన ప్రజాప్రభుత్వంగా నిలిచిపోవాలన్నది నా ఆశయం' ప్రజల హృదయాలలో చిరస్థాయిగా నిలచి వారి సాంఘిక, ఆర్థిక సమస్యలను పరిష్కరించి కొత్త జీవితాన్ని వారికి అందించి, వారి కుటుంబ జీవనంలో చిరుదీపాలు వెలిగించాలని నా ఆకాంక్ష. ఆ లక్ష్యంతోనే 'తెలుగుదేశం' ప్రభుత్వం ముందుకు సాగుతుంది.

ప్రాచ్యభాషలలో మధురాతి మధురమైనదని పేరుగన్న మన తెలుగు భాషను నిత్యనూతనంగా తీర్చిదిద్దుతుంది. నవ్యతకు నాందిపలుకులా శోభిల్లే తెలుగు సంస్కృతికి కొంగొత్తరూపు రేఖలు దిద్ది మనజాతి ప్రాభవాన్ని, పోగొట్టుకున్న కీర్తిప్రతిష్ఠలను పునఃప్రతిష్ఠింపజేస్తుంది. తెలుగును అన్ని స్థాయిలలో అధికార భాషనుచేసి గౌరవిస్తుంది.

దుర్భరంగావున్న ప్రజాజీవితాన్ని మార్చాలంటే మాటలతో అయ్యేది కాదని మనందరికీ తెలుసు. మౌలికంగా సమాజాన్ని పట్టి పీడిస్తున్న వ్యాధులకు చికిత్స చేయవలసి ఉంది. గతజల సేతుబంధనం అనవసరం. కాని గతాన్ని గుర్తుచేసుకుంటేతప్ప భవిష్యత్తుకు రూపుదిద్దలేం. గాయపడిన గుండెకు సరైన శస్త్రచికిత్స జరిగితేనేగాని అది మామూలుగా పని చేయలేదు. అందుకే కుళ్ళిపోయిన ఈ వ్యవస్థమీద, అదుపు తప్పిన ఈ లంచగొండితనంమీద, అంతులేని దోపిడీ విధానంమీద తెలుగుదేశం ప్రభుత్వం రాజీలేని పోరాటం సాగిస్తుంది. వీటన్నింటిని అదుపులో పెడుతుంది. ప్రజల ఆశలు తీరుస్తుంది. స్వచ్ఛమైన పరిపాలనను ప్రజలకు అందించి అవినీతిని నిర్మూలించి అక్రమాలను అరికట్టి మీకిచ్చినమాటను నిలబెట్టుకుంటుంది.

ఎందరో అన్నార్తులు, బాధలతో బక్కచిక్కిన మూగజీవులు మగ్గి మగ్గి కన్నీరుకూడా వెలికిరాక ఇంకిపోయిన కష్టజీవులు, ఇందరి శ్రమను ఏ కొద్దిమందో దోచుకుంటూ, అనుభవిస్తూ, ఆనందాల కేరింతలతో, భోగాల కలవరింతలతో సమాజ శ్రేయస్సుకు ద్రోహంచేయడం న్యాయ సమ్మతంకాదు. అందరికీ చెందవలసిన అవకాశాలను ఏ కొద్దిమందో భుక్తం చేసుకోవడం, జాతిశ్రేయస్సుకు మంచి లక్షణంకాదు. అందుకే 35 ఏళ్ల స్వాతంత్ర్యం 35 సంవత్సరాల స్వతంత్ర పరిపాలనకూడా దేశంలోని

పేదరికాన్ని తుడిచి పెట్టలేకపోగా నిరుపేదరికాన్ని నిర్దాక్షిణ్యంగా సాటిమానవుల నెత్తిన రుద్దాయంటే సంపన్న సమాజం ఏ విధంగా మానవతా విలువలు కోల్పోయిందో ఆలోచిస్తే అర్థమవుతుంది.

జాతిపతనంతో స్వార్థం పెరిగింది. మంచితనం, మంచిమాట, మంచిపని చేయని పని ఈనాడు డబ్బుతో ఎన్నిపనులు చేయడానికి, చెలామణి చేసుకోవడానికి పూర్తి అవకాశం లభించింది. అందుకే ఈనాటి ప్రభుత్వ వ్యవస్థ సామాన్య మానవుడి జీవితాన్ని బాగుపరచలేని అసహాయ స్థితిలో నిలువు గుడ్డతో నిలబడి పోయింది. పేదప్రజలను ఉద్ధరించలేని, న్యాయాన్ని ధర్మాన్ని సముద్ధరించలేని అసమర్థపు ప్రభుత్వంపై తెలుగు జాతిలో రేగిన విప్లవమే తెలుగుదేశ మహోద్యమం. తెలుగువారి గుండెలలో రగిలిన ఉద్వేగమే ఈ మహోద్యమం. అదే తెలుగు గడ్డమీద సుడిజుట్టుకు వీచిన మహాప్రభంజనం.

సంక్రాంతి పర్వదినాలలో జరిగిన ఎన్నికలలో తెలుగుదేశం ఇంతటి అఖండవిజయం సాధించిందంటే అది మా తెలుగింటి ఆడపడచుల నిండు ఆశీస్సులు, అభిమానం ఎంతగా పొంగిపొర్లాయో నాకు తెలుసు. అక్కా చెల్లెళ్ళు ఇచ్చిన మంగళ హారతులే భవిష్యత్తుకు శుభదీపికలైనాయి. వారి నివాళులే ఈనాటి విజయానికి వెలుగుబాటలైనాయి. ఆ అనురాగపు జల్లులు తెలుగుదేశం పార్టీకి శుభ సందేశాలు అయ్యాయి. వారందరికీ నా శుభాశీస్సులు. తెలుగు గడ్డపై రేగిన ఈ మహోద్యమంలో ఈ ప్రభంజనంలో పాలుపంచుకుని భాగస్వాములైన యువశక్తికి నా శుభాభినందనలు. అన్నగా అభిమానించి, దివ్వెపట్టి ముందుకు నడిపించిన హరిజన గిరిజన బడుగు వర్గాల ఆపేక్ష, ఆప్యాయత ఎన్నటికీ మరువలేనివి, మరువరానివి. పసిపాపలు దేవుని ప్రతిరూపాలన్నారు. బాలవాక్కు బ్రహ్మవాక్కు అన్నారు. ఎక్కడికి వెళ్లినా కేరింతలు కొట్టుతూ ఎదురొచ్చి అమితోత్సాహంతో స్వాగతం చెప్పిన బాలలందరికీ నా నిండు దీవెనలు.

ఈనాడు ప్రజాసేవకుడిగా జీవితాన్ని ధన్యంచేసుకోదలచిన నేను తెలుగు జాతికి అంకితమైనానని, ఇదే ధ్యేయంతో, లక్ష్యంతో ముఖ్యమంత్రిగా పదవీస్వీకారం చేశానని నా ప్రియసోదరీ సోదరులందరికీ, పూజ్యులందరికీ తెలియజేస్తున్నాను.

గమ్యాన్ని చేరడానికి, మీ అందరి ఆశీస్సులు, సహకారం అర్థిస్తున్నాను. బడుగు, బలహీన వర్గాల సముద్ధరణ, అల్పసంఖ్యాక వర్గాల పరిరక్షణ, రైతుకూలీల సంక్షేమం, కార్మికుల సౌభాగ్యం తెలుగుదేశం ప్రభుత్వ లక్ష్యాలు. ఈ ఆశయాల సాధనకోసం, తెలుగువారి ఆత్మగౌరవాన్ని పెంచడంకోసం, ఆడపడచుల సమస్యల పరిష్కారంకోసం, వారిపై జరుగుతున్న అత్యాచారాలను అరికట్టడంకోసం తెలుగుదేశం ప్రణాళికద్వారా ఈ రాష్ట్రప్రజలకిచ్చిన హామీలను నెరవేర్చడం కోసం, చేసిన బాసలను నిలుపుకోవడంకోసం ఈ క్షణం నుంచీ అవిరళ కృషి జరుగుతుంది. అన్ని రంగాలలో అన్ని విధాలా జాతి సంక్షేమం సాధించేవరకు విశ్రమించడం జరుగదని వాగ్దానం చేస్తున్నాను. ఆలయానికి వెలుగునిచ్చే కర్పూర కళిక తన ధ్యేయంతో తాను కరిగిపోయే విధంగా నేను స్వజాతి కార్యక్రమంలో ధన్యుడను కావాలని మనః పూర్వకంగా కోరుకుంటున్నాను.

నాలో విశ్వాసముంచి, నమ్మకముంచి నన్ను గెలిపించి, తెలుగుదేశానికి జీవంపోసిన తెలుగువారందరినీ, మరోమాటలో చెప్పాలంటే తెలుగునాటవున్న ఆరుకోట్ల ప్రజానీకాన్ని ఈ బరువైన బాధ్యతా నిర్వహణలో నన్ను నిండు మనస్సుతో ఆశీర్వదించాలని అభ్యర్థిస్తున్నాను. యువతరం ఉరకలెత్తి ముందుకు దూకుతూ నా మార్గాన్ని సుగమం చేయాలని, ఆడపడుచు లందరూ నిండు మనస్సుతో నా కృషి ఫలించడానికి ఆశీస్సులు పూలజల్లులుగా కురిపించాలని అర్థిస్తున్నాను.

తెలుగుజాతికి ప్రతీకగా నిలిచిన తెలుగుదేశం ప్రభుత్వాన్ని ముందుకు నడిపించడంలో ప్రజాసేవ, సమాజ సంక్షేమం సాధించడంలో అధికారులు, ఉద్యోగులూ, తమ బాధ్యతను తాము నిర్వహిస్తూ అవినీతిని నిర్మూలించి స్వచ్ఛమైన పరిపాలనా నిర్వహణకు కృషిసల్పాలని, ఆదర్శవంతమైన ప్రజాసేవలో పునీతులు కావాలని అహర్నిశలు అండదండలందిస్తూ ఈ ప్రయత్నంలో భాగస్వాములు కావాలని కోరుతున్నాను. మన రాష్ట్ర సర్వతోముఖాభివృద్ధికి, సర్వజన సంక్షేమానికి పాటుపడాలని నాతరఫున, నామంత్రివర్గం తరఫున, తెలుగుదేశం శాసనసభ్యుల తరఫున, తెలుగుదేశం పార్టీ తరఫున నిండుహృదయంతో అభ్యర్థిస్తున్నాను.

*1983 జనవరి 9 న ఆకాశవాణి/దూరదర్శన్ లనుండి ప్రసారితం*

# మన విధానం...

నూతన ప్రభుత్వం అధికారాన్ని చేపట్టాక జరుగుతున్న ప్రథమ కలెక్టర్ల సమావేశమిది. ఎన్నికలను ప్రశాంతంగా,నిష్పక్షపాతంగా నిర్వహించిన మీకూ, మిగతా ఉద్యోగులకూ నా హృదయపూర్వక అభినందనలు తెలియ జేస్తున్నాను. నేనూ ఒకనాడు ప్రభుత్వోద్యోగినే. ఉత్తమమైన పరిపాలనను ప్రజలకు అందివ్వాలన్నా, వారి ఆశలను తీర్చాలన్నా, ప్రజా ప్రతినిధులకు, ప్రభుత్వోద్యోగులకు మధ్య చక్కని సంబంధాలు, సదవగాహన వుండాలని నా నమ్మకం.

శాంతి భద్రతల నిర్వహణ మన ప్రధాన కర్తవ్యమని మీకందరికీ కూడా తెలుసు. అవి సక్రమంగా వుంటేనే మనం సర్వ శక్తులు వినియో గించి ప్రజా సంక్షేమం కోసం, అభివృద్ధి కార్యక్రమాలు రూపొందించ గలం.... అమలుపరచగలం. ప్రజా జీవితాన్ని కలవరపరచే రాజకీయ కుమ్ము లాటలు, ముఠాతగాదాలు, మతోన్మాద అల్లర్లను కఠినంగా అణచివేయాలి. స్వల్ప సంఘటనలను స్వార్థానికి ఉపయోగించుకుని సంఘ వ్యతిరేక శక్తు లను రెచ్చగొట్టే నకిలీ మత శక్తులను, బూటకపు రాజకీయ శక్తులను ఒక కంట కనిపెట్టి ఉండాలి. పాలనా యంత్రాంగం పాక్షిక ప్రయోజనాలకు దూరంగా వుండాలి. ప్రజల ఆశలను నెరవేర్చటానికి ఎల్లవేళలా సంసిద్ధు లమై వుంటామని, లక్ష్యశుద్ధితో నిష్పక్షపాతంగా పనిచేస్తామని నిరూ పించాలి. పాలనా యంత్రాంగం ఏ పనిచేసినా మానవతా దృక్పథం ప్రతి బింబించేలా వుండాలన్నది నా అభిమతం. ఎవరికీ ఎప్పుడూ, ఎట్టి భయం లేకుండా వుండే విధంగా శాంతి భద్రతలను కాపాడటానికి జాగ్రత్త వహిం చాలి. ఆడపడుచులు అర్ధరాత్రైనా నిర్భయంగా నడి వీధిలో వెళ్ళగలగాలి. దుష్ట శక్తులను అరికట్టి, నేరాలు తగ్గించి, పరిపూర్ణమైన ప్రశాంత వాతావరణాన్ని సృష్టించడానికి చర్యలు తీసుకోవాలి.



1983 జనవరి 9న హైదరాబాదు, లాల్ బహదూర్ స్టేడియంలో
గవర్నరు సమక్షంలో ముఖ్యమంత్రిగా పదవీ ప్రమాణ స్వీకారం



ముఖ్యమంత్రి బాధ్యతలు స్వీకరించిన అనంతరం అశేష ప్రజావాహినిని
ఉద్దేశించి తమ ప్రభుత్వం ఆశయాల్ని వివరిస్తూ—



భారత రాష్ట్రపతి శ్రీ జైల్‌సింగ్ తో స్నేహ కరచాలనం



భారత ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధితో అభిభాషణం

ప్రజా సంక్షేమానికి ఉద్దేశించిన ప్రణాళికా ప్రయోజనాలు అట్టడుగున వున్నవారికి చేరలేదని పరిశీలనలో విదితమైంది. గత ప్రణాళికలలో సాంఘిక , గ్రామీణ రంగాలకు సరైన న్యాయం జరుగలేదు. రక్షిత మంచి నీటి సరఫరా , పారిశుధ్యం, విద్య, ప్రజారోగ్యం, వైద్యం మున్నగువాటికి ప్రాధాన్యత లేకపోయింది. ఫలితంగా కాలక్రమంలో ప్రజలలో అసంతృప్తి పెరిగింది. మన ప్రణాళికా రూపకల్పనలో మార్పు అవసరమని దీనినిబట్టి విదితమవుతున్నది. గ్రామీణ పేదరికాన్ని నిర్మూలించడానికికాక, పట్టణాల సౌభాగ్యానికి పనికి వస్తున్న ప్రణాళికల పద్ధతిని సరిదిద్దే చర్యల గురించి మా ప్రభుత్వం యోచిస్తోంది. గ్రామీణ మంచినీటి సరఫరా, సార్వజనిక విద్య, ఆరోగ్యం, గృహనిర్మాణం, గ్రామీణ పరిశ్రమలకు అధిక ప్రాధాన్యం యిస్తుంది.

ఇప్పటికీ మన రాష్ట్ర జనాభాలో 80 శాతం గ్రామీణ ప్రాంతాలలో వున్నారు. రాష్ట్రంలో 27,221 గ్రామాలు, 32,750 పల్లెలు వున్నాయి. అనేక గ్రామాలలో కుండెడు మంచినీళ్ల కోసం మహిళలు మండుటెండలో మైళ్ల కొలదీ నడిచి వెళ్లవలసిన దురవస్థ నేటికీ కొనసాగుతోంది. మంచినీటి సరఫరా సమస్య వున్న 12,269 గ్రామాలలో ఐదవ పంచవర్ష ప్రణాళిక ఆఖరువరకూ 4,063 గ్రామాలకు మాత్రమే మంచినీరు అందివ్వగలిగారు. ఆరవ ప్రణాళికా కాలంలో 1983 మార్చి ఆఖరు వరకు 3,851 గ్రామాలకు రక్షిత మంచినీటి సరఫరా లభిస్తుందని భావిస్తున్నాం. సత్వరం రక్షిత మంచినీటి పథకాలు సమకూర్చవలసిన గ్రామాలు యింకా 4,355 వుంటాయి. 1983—84లో ఈ గ్రామాలకు కనీసం ఒకో జలనిక్షేపమైనా తప్పనిసరిగా సమకూర్చాలి. అందుకు అనుగుణంగా పథకాలు రూపొందించి వెంటనే అమలు జరపాలని మిమ్మల్ని కోరుతున్నాను. లెక్కవేసిన గ్రామాలేకాక రక్షిత మంచినీటి సరఫరా అందవలసిన మరికొన్ని ముఖ్యమైన గ్రామాలు కూడా వున్నాయని నే నెరుగుదును. ఈ గ్రామాలకు రక్షిత మంచినీటి సరఫరాకు అనావృష్టి ప్రాంతాల సహాయ నిధులను సకాలంలో ఉపయోగించాలి. అత్యధిక జిల్లాలలో ఈ కార్యక్రమం సంతృప్తికరంగానేవున్నా రెండు మూడు జిల్లాలలో మందకొడిగా వుంది. అన్నింటి వివరాలను మీకు అందజేశాం. కార్యక్రమం

వెనుకబడిగా వున్న జిల్లాలు మనం మరోసారి సమావేశమయ్యేలోగా పనిని వేగవరచి ఫలితాలు సాధిస్తాయని విశ్వసిస్తున్నాను.

రాష్ట్రంలో అనావృష్టి పరిస్థితి చాలా తీవ్రంగా వున్నదని మీ అందరికీ తెలుసు. వేసవి రోజులలో ఇది మరీ గడ్డుగా వుంటుంది. కరువు నివారణకు 58 కోట్ల 77 లక్షల రూపాయలు విడుదల చేస్తే 1982 డిసెంబరు ఆఖరు నాటికి 23 కోట్ల 40 లక్షలు మాత్రమే ఖర్చయింది. ఇది చాలా శోచనీయమైన విషయం. ఈ కార్యక్రమాల అమలును ఇక ఏ మాత్రం ఉపేక్షించరాదని, ఇందుకోసం కేటాయించిన నిధులను ఈ ఆర్థిక సంవత్సరం ఆఖరులోగా పూర్తిగా ఖర్చుచేసి తీరాలని చెప్పదలచు కున్నాను. అంతేకాక వేసవి గడ్డు రోజుల నెదుర్కోటానికి సరిస్ని పథకా లను రూపొందించాలి. అవసరమైతే అదనపునిధుల కోసం అడగాలి. ఈ కార్యక్రమాలను రూపొందించేటప్పుడు, అనావృష్టి ప్రాంతాల సహాయ పథకాలను, సమగ్ర గ్రామీణ అభివృద్ధి పథకాలను, జాతీయ గ్రామీణ ఉపాధి పథకాలను కూడా దృష్టిలో ఉంచుకొని సమన్వయ పరుచుకోవాలి. సత్వర చర్యలతో ఈ ఆర్థిక సంవత్సరం ఆఖరుకు నిధులు పూర్తిగా ఖర్చు అయ్యేలా చూస్తే, కేంద్ర సహాయం లభించే ఇటువంటి పథకాల కోసం భారత ప్రభుత్వం నుంచి అదనపు నిధులు అడగడానికి వీలుంటుంది.

భూ సంస్కరణలు ఎన్నో సదుద్దేశాలతో ప్రవేశ పెట్టబడినాయి. కాని ఈ అభ్యుదయ కార్యక్రమం నత్తనడకతో అమలు జరుగుతోంది. దీని ఫలితాలు అందుకోసం పెట్టిన ఖర్చుకు ఏ మాత్రం అనుగుణంగా లేవు. 23,942 ఎకరాల మాగాణి భూమిని, 4,18,824 ఎకరాల మెట్ట భూమిని ప్రభుత్వం స్వాధీనం చేసుకుంది. ఇందులో 568 ఎకరాల మాగాణి, 63,034 ఎకరాల మెట్ట భూమి వ్యవసాయానికి పనికిరాదని కలెక్టర్ల నివేదిక ద్వారా తెలిసింది. 1,949 ఎకరాల మాగాణి, 32,504 ఎకరాల మెట్ట ఇంకా వివాదగ్రస్తమై వుందని తెలిసింది. అందువల్ల 21,425 ఎకరాల మాగాణి, 3,23,286 ఎకరాల మెట్ట మాత్రమే పేదలకు పంచటానికి లభ్యమైంది. ఇందులో కూడా 1,285 ఎకరాల మాగాణి, 23,483 ఎకరాల మాగాణి, మెట్ట యింకా పంపిణీ కాలేదని

తెలిసి విస్మయం చెందాను. కనీసం వచ్చే పంటకాలంనుంచైనా సాగు చేయటానికి వీలుగా ఈ భూమిని బలహీన వర్గాలకు వెంటనే పంపిణీ చేయటానికి మీరంతా ప్రత్యేక శ్రద్ధ వహించాలని కోరుతున్నాను. అనావృష్టి ప్రాంతాల సహాయ పథకాలు, సమగ్ర గ్రామీణ అభివృద్ధి పథకాలు రూపొందించేటప్పుడు ఈ భూములకు నీటిపారుదల సౌకర్యాలు కల్పించటానికి ప్రాధాన్యత యివ్వాలి.

అభివృద్ధి కార్యక్రమాల ప్రయోజనం అసలైన వారికే అందేలా జాగ్రత్త తీసుకోవాలి. 1982-83 సంవత్సరంలో బలహీన వర్గాల కోసం 2 లక్షల ఇళ్ల నిర్మాణానికి లక్ష్యం పెట్టుకుని 18 కోట్ల 33 లక్షల రూపాయలు విడుదల చేస్తే 1982 డిసెంబరు ఆఖరు నాటికి, వెయ్యి రూపాయల వ్యయం చొప్పున నిర్మించే ఇళ్లు 4,686; నాలుగు వేల రూపాయల వ్యయం చొప్పున నిర్మించే ఇళ్లు 57 మాత్రమే పూర్తయ్యాయని తెలిసింది. ఇది చాలా దయనీయమైన పరిస్థితి. ఇలా అయితే ఏం ప్రగతి సాధించగలం? ఇళ్ల స్థలాల కేటాయింపును, గృహ నిర్మాణ కార్యక్రమాన్ని తగినంతగా వేగిర పరచాలి. మురికివాడలలో దౌర్భాగ్యకర వాతావరణంలో కొట్టుమిట్టాడుతున్న నిరుపేదల కోసం అన్ని సౌకర్యాలు గల పక్కా ఇళ్లువుండే కాలనీల నిర్మాణానికి నమూనాలు తయారయ్యాయి. వాటిని మీకు అందజేస్తున్నాను. బడ్జెటు కేటాయింపులు మురిగిపోని విధంగా గృహ నిర్మాణ పథకాలు అమలు జరిగేలా గట్టి చర్యలు తీసుకోవాలని కోరుతున్నాను. కట్టిన ఇళ్లు మన్నికగా, వాటిలో నివసించే ప్రజలకు పూర్తి సంతృప్తికరంగా వుండేలా జాగ్రత్త వహించాలి. ఇంతవరకు మీకు లభించిన అనుభవాలను దృష్టిలో వుంచుకొని ఈ పథకాలలో ఏమైనా మార్పులు అవసరమనుకుంటే నిర్మాణాత్మకమైన సూచనలు చేయవచ్చు. స్థానిక పరిస్థితులను బట్టి అవసరం అనుకుంటే, ఒకో జిల్లా పథకాలలో కొన్ని మార్పులుండవచ్చు. వీటిని అమలు చేసేటప్పుడు, వాటిలో నివసించబోయే వారితో సంప్రతించాలి.

నిత్యావసర వస్తువుల ధరలను సామాన్య ప్రజలకు అందుబాటులో వుండేలా అదుపు చేయటానికి ప్రభుత్వం కృతనిశ్చయంతో వుంది. బియ్యం, చక్కెర, కిరోసిన్‌వంటి వస్తువుల పంపిణీ వ్యవస్థను మెరుగు పరచటమే

గాక, వంటనూనెలు, పప్పులు, మిరపకాయలు, చింతపండువంటి వస్తువుల పంపిణీని విస్తృతపరచాలని కూడా భావిస్తున్నాం. ధరల అదుపుదలకోసం ప్రభుత్వం ఒక రాష్ట్రస్థాయి కమిటీని కూడా నియమించింది. పౌర సరఫరాలశాఖ మంత్రి అధ్యక్షతన గల ఈ కమిటీలో వర్తకులు, వినియోగదారుల ప్రతినిధులు సభ్యులుగా ఉంటారు. జిల్లాస్థాయిలో కూడా ఇటువంటి సంఘాలు ఏర్పాటుచేయాలని, హోటళ్లలో సరఫరాచేసే పదార్థాలతోసహా నిత్యావసర వస్తువుల ధరలను అరికట్టాలని కోరుతున్నాను. జిల్లా అధికారులు పర్యటనలకు వెళ్లినప్పుడు గ్రామాలలోని చవక డిపోలను తనిఖీచేసి అవి సరిగా, సమర్థవంతంగా పనిచేసేలా, బలహీన వర్గాల వారికి నిత్యావసర వస్తువులు సక్రమంగా అందేలా చూడాలి. బియ్యం సబ్సిడీ పథకాన్ని సామాన్య ప్రజలకు ప్రయోజనకరమైన రీతిలో రూపొందించే నిమిత్తం కలెక్టర్లు తమ అభిప్రాయాలను తెలియజేయాలని కోరుతున్నాను. నిత్యావసరవస్తువుల పంపిణీ మెరుగుపరచి, మార్చి నెలాఖరు నుంచి అమలుపరచే నిమిత్తం, 5—6 వారాలలోగా కుటుంబాల లెక్కల వివరాలు సేకరించి కొత్త రేషన్‌కార్డులు అందజేయాలని నేను ఉత్తరువులు జారీచేశాను. కంట్రోల్ వస్త్రాలను చౌక డిపోలద్వారా పంపిణీ చేయడానికి కూడా కాలక్రమంలో పథకాలు రూపొందించాలి. సామాన్యప్రజలకు సరైన వసతి, సరసమైన ధరలకు తిండి, బట్ట సమకూర్చడం మాప్రభుత్వం కర్తవ్యంగా పెట్టుకుంది.

అక్షరాస్యతలో మన రాష్ట్రం దేశంలోని 22 రాష్ట్రాలు , 9 కేంద్రపాలిత ప్రాంతాలలో 24వ స్థానాన్ని ఆక్రమిస్తున్నదని మీ అందరికీ తెలిసే వుంటుంది. ఇది చాలా అవమానకరం. ఈ దురదృష్టకరమైన పరిస్థితి ఇలాగే కొనసాగడానికి వీల్లేదు. నిరక్షరాస్యతలో మగ్గినంత కాలం ప్రజా జీవితానికి తగిన విలువ వుండదు. నిర్బంధ ప్రాథమిక విద్య మన రాజ్యాంగంలోని ఆదేశిక సూత్రాలలో ఒకటిగా పొందుపరచబడినప్పటికీ 35 ఏళ్ల స్వాతంత్ర్యం తరువాత కూడా మనం గమ్యానికి చేరువలో లేం. అందువల్ల వచ్చే విద్యాసంవత్సరం నుండి పాఠశాలలలో పిల్లలను-ముఖ్యంగా బాలికలను ఎక్కువగా చేర్పించే కార్యక్రమానికి లక్ష్యాలు నిర్ణయించుకొని విద్యావ్యాప్తికి ఉద్యమించాలని కలెక్టర్లను కోరుతున్నాను. రాష్ట్ర పథకాలను, జాతీయ

పథకాలను చేపట్టేటప్పుడు పాఠశాల భవన నిర్మాణానికి తగిన ప్రాధాన్యత ఇవ్వాలి. పేద పిల్లలను సరైన విద్యాబోధనతో చైతన్యవంతులను గావించి ఆదర్శ పౌరులుగా తీర్చిదిద్దటం మా ప్రభుత్వ లక్ష్యం. అంతేకాదు. వారు ఆరోగ్యవంతంగా వుండటానికి తగిన పౌష్టికాహారం సమకూర్చటం కూడా మా లక్ష్యం. ప్రస్తుతం బియ్యం, పప్పు, మసాలతో పెడుతున్న మధ్యాహ్న భోజన పథకం స్థానే పాలు, రొట్టె ఇచ్చే నూతన ప్రతిపాదన అమలుకు సరైన మార్గాలు తెలియపరచవలసిందిగా కోరుతున్నాను.

ప్రజా సంక్షేమంకోసం ఎన్నో అభివృద్ధి పథకాలు మా ఆలోచనలో ఉన్నాయి. ఆ పథకాలన్నింటిని చేపట్టటానికి వనరుల పరిస్థితి ఏమీ సంతోషకరంగా లేదని చెప్పదలచుకున్నాను. అందువల్ల అన్ని స్థాయిలలో పన్నుల వసూళ్లను కట్టుదిట్టం చేయాలి. కలెక్టర్లు కేవలం భూమిశిస్తు వసూలుకే పరిమితం కారాదు. వాణిజ్య పన్నులు, ఎక్సైజు, మార్కెటు ఫీజు మున్నగువాటి వసూలును మెరుగుపరచి, రాష్ట్ర ఆదాయాన్ని పెంచటానికి కూడా ఆసక్తి చూపాలి. చిన్నతరహా పొదుపు ఉద్యమానికి లక్ష్యాలు నిర్ణయించాలి. వనరులను పెంచే ప్రయత్నాలు ఒకవంక సాగిస్తూనే మరోవంక వాహనాలను స్వప్రయోజనాలకు వాడకుండా అదుపు చేయడం ద్వారా, ఫోనుల బిల్లులు తగ్గించటం ద్వారా పొదుపును పాటించాలి. ప్రముఖులు జిల్లాలలో పర్యటించేటప్పుడు వారివెంటవెళ్లే వాహనాలను తగ్గించడం ద్వారాను, అధిక వ్యయమయ్యే విందులు లేకుండా చూడడం ద్వారాను పొదుపు అమలు చేయాలి. ప్రజా ప్రభుత్వ పనితీరు అన్నివేళలా, అన్ని సందర్భాలలో ప్రజల ఆశలకు, ఆకాంక్షలకు అనుగుణంగా వుండాలి. పాలనా యంత్రాంగానికి ప్రజలతో సన్నిహిత సంబంధాలుండాలని, మీరంతా సామాన్య ప్రజల గోడు విని వారికి అండదండలుగా వుండాలని, దారిద్ర్య రేఖకు అట్టడుగునవున్న హరిజన, గిరిజన, వెనుకబడిన తరగతుల సంక్షేమానికి గట్టిగా కృషిచేయాలని కోరుతున్నాను. జిల్లా, తాలూకాలలోని ఫిర్యాదుల విభాగాలను చురుకుగా పని చేయించాలి. ప్రజల ఇక్కట్లను తీర్చటానికి, సత్వర చర్యలు గైకొనాలి. వృద్ధాప్యపు పింఛన్లు, వికలాంగులకు సహాయం, బలహీన వర్గాలకు భద్రత మున్నగు విషయాలలో మానవతా దృక్పథం, ప్రతిబింబించాలి. వరదలు, అగ్ని ప్రమాదాలు మున్నగు వైపరీత్యాల సమ

యంలో సహాయ కార్యక్రమాల ఫలితాలు నిజమైన బాధితులకే అందేలా చూడాలి. సహాయ కార్యక్రమాలు బహుళార్థ ప్రయోజనకారులుగా శాశ్వత ప్రాతిపదికపై రూపొందించబడాలి. చిత్తశుద్ధితో ఉద్యోగ ధర్మానికి అంకితం కావడమే దీన్ని సాధించే మార్గం అని తెలియజేస్తున్నాను. ప్రభుత్వ కార్యాలయాలకు వచ్చేవారిపట్ల మర్యాదతో వ్యవహరించాలి. ప్రజలకు ముఖ్యంగా ఆర్తితో వచ్చినవారికి వెంటనే సాయమందించాలి. వారి కష్టాలు తొలగించాలి. అన్యాయాన్ని నివారించాలి. ప్రభుత్వ కార్యాలయాలలో క్రమ శిక్షణ ప్రతిబింబించాలి.

అక్రమ నిల్వలు నిరోధించాలి. దొంగ వ్యాపారాన్ని అరికట్టాలి. బాధ్యతాయుతమైన పదవులలో వున్న అధికారులు తాను ప్రజా సేవకులమని గుర్తించాలి. అవసరంకొద్దీ వచ్చే ప్రజలతో అక్రమ మార్గాలలో, లంచగొండితనంతో వ్యవహరించటం ప్రజా పరిపాలనకే మాయని మచ్చ. ఇటువంటి పద్ధతులను ప్రభుత్వం ఎన్నడూ సహించదు. పరిపూర్ణమైన, పటిష్టమైన నిఘాతో ఇటువంటి శక్తులను ఏరివేసి, పాలనా యంత్రాంగాన్ని పరిశుద్ధం చేయాలని కోరుతున్నాను. అధికారమంటే అహంకారం కాదని పాలనా యంత్రాంగంలో వున్న ప్రతి ఒక్కరు గుర్తించాలి. తాము ఆదర్శంగా వుండి ఈ సమాజాన్ని క్షాళన చేయగలగాలి. తుష్టితో, పరిపుష్టితో ఆనంద నిలయంగా విలసిల్లేలా ఆదర్శవంతమైన రాష్ట్రంగా రూపొందేలా మీరంతా కృషి చేయాలని కోరుతున్నాను.

*1983 జనవరి 23న హైదరాబాదులో జరిగిన జిల్లా కలెక్టర్ల సమావేశంలో*

# ఇచ్చి పుచ్చుకొనే ధోరణి

దక్షిణాది రాష్ట్రాల ముఖ్యమంత్రుల సమావేశం నిన్న బెంగుళూరులో జరిగిన విషయం సభవారికి విదితమే. ఆంధ్రప్రదేశ్, కర్నాటక, తమిళనాడు, పాండిచ్చేరి రాష్ట్రాల ముఖ్యమంత్రులు ఈ సమావేశంలో పాల్గొన్నారు. కేరళ ముఖ్యమంత్రి ఈ సమావేశానికి హాజరు కాలేక పోయారు.

దక్షిణాది రాష్ట్రాల ముఖ్యమంత్రుల సమావేశమంటే యిదేదో కేంద్రానికి వ్యతిరేకంగా కాంగ్రెసేతర ముఖ్యమంత్రులను ఒక త్రాటిపై తెచ్చే యత్నమని కొందరు కొన్ని అపోహలు సృష్టించడానికి యత్నిస్తున్నారని మాకు తెలుసు. అయితే ఈ సమావేశంలో పాల్గొన్నవారిలో ఎవ్వరం కూడా కేంద్రానికి వ్యతిరేకులం కాము. ఈ భరతభూమి మనది. మన మంతా అందులో అంతర్భాగం. భరతమాత మన తల్లి. మనమంతా ఆమె బిడ్డలం. ఇది మా నిశ్చితాభిప్రాయం.

శరీరం బలంగా వుండాలంటే అన్ని అవయవాలు బలంగా వుండాలి. అదే విధంగా కేంద్రం బలంగా వుండాలంటే రాష్ట్రాలు మౌలికంగా బలంగా వుండాలి అన్నదే మా భావన.

వివిధ కార్యక్రమాల అమలులో, ముఖ్యంగా ఆర్థిక వ్యవహారాలకు సంబంధించినంత వరకు రాష్ట్రాలు మరింత స్వేచ్ఛ కలిగి వుండాలని నిన్నటి సమావేశంలో భావించాం. చర్చలు సుహృద్భావ వాతావరణంలో జరిగాయి. 8వ ఆర్థిక కమీషన్‌కు సమర్పించవలసిన విషయాల గురించి విస్తృత మైన ఏకాభిప్రాయం వ్యక్తమైంది. సమావేశంలో గైకొన్న కొన్ని నిర్ణయాలను సభ వారికి వివరిస్తాను.

ప్రజా సంక్షేమం కోసం ఆరోగ్యం, విద్య, నీటిపారుదల, విద్యుచ్ఛక్తి మున్నగు సౌకర్యాల కల్పన, నాటి అమలు రాష్ట్ర ప్రభుత్వాల భుజస్కంధాల పైన వున్నది. వీటికయ్యే వ్యయభారం చాలా ఎక్కువ. రక్షణ శాఖను

మినహాయిస్తే కేంద్ర ప్రభుత్వం చేయవలసిన ఖర్చు తక్కువ. అయినప్పటికీ వనరులు మాత్రం కేంద్రప్రభుత్వం వద్దనే ప్రధానంగా కేంద్రీకృతమై వున్నాయి.

కేంద్రానికీ, రాష్ట్రానికీ మధ్య ఆర్థిక పరిస్థితులకు సంబంధించి రాజ్యాంగంలో వున్న నిబంధనలను నవరించుతున్న తీరు చాలా అసంతృప్తి కరంగా వున్నది. ఆదాయంపన్ను, ఎక్సైజ్ పన్ను మున్నగువాటిలో కేంద్రం రాష్ట్రాలకు యిస్తున్న వాటా ఏ మాత్రం సంతృప్తికరంగా లేదు.

ఈ పరిస్థితుల దృష్ట్యా రాష్ట్రాలకు తగినంత ప్రాతినిధ్యం కల్పించి ఒక ప్రత్యేక ఆర్థిక కమీషన్‌ను (Fiscal Commission) నియమించాలని కేంద్రానికి సిఫార్సు చేయదలచాం. గత 35 సంవత్సరాల అనుభవం దృష్ట్యా ఆర్థిక వ్యవహారాలలో కేంద్ర, రాష్ట్ర సంబంధాలను సమీక్షించి వనరులను ఉభయులకు సమతులమైన రీతిలో పంపిణీ చేసేందుకు వీలుగా రాజ్యాంగానికి, శాసనాలకు సవరణలు ప్రతిపాదించే చట్టబద్ధమైన అధికారాలు ఈ కమీషనుకు వుండాలని సమావేశంలో నిర్ణయించాం.

ప్రస్తుత వ్యవసాయ ధరల విధానం అసంతృప్తికరంగావుంది. రైతుకు గిట్టుబాటు ధరను యిది పరిగణనలోకి తీసుకోవడంలేదు. సబ్సిడీలపై హెచ్చు మొత్తాలను రాష్ట్ర ప్రభుత్వాలు ఖర్చుచేయవలసిన అగత్యాన్ని కూడ యిది సృష్టిస్తున్నది. ఉత్పత్తి వ్యయం, స్థానిక ఉత్పాదక స్థాయి, మార్కెటు సరళి మున్నగు అంశాల గురించి రైతు ప్రతినిధులతో చర్చించి రాష్ట్ర ప్రభుత్వాలే వ్యవసాయోత్పత్తుల ధరలను నిర్ణయించే పద్ధతి అవసరం. రాష్ట్ర ప్రభుత్వాలు నిర్ణయించే గిట్టుబాటు ధరలకు పరపతి సౌకర్యాలను సమన్వయపరచాలి. రాష్ట్ర ప్రభుత్వాల అజమాయిషీ తప్ప మార్కెటులో ధరలు పడిపోతే ప్రణాళికేతరంగా కేంద్ర నిధుల నుండి సబ్సిడీలు సమకూర్చాలి.

మధ్య దళారీల అధిక లాభార్జన నిర్మూలించడానికి రైతు సంఘాలు తమ ఉత్పత్తులను తామే ఎగుమతి చేసుకోడానికి కూడా పూర్తి అవకాశాలు కల్పించాలి.

ప్రపంచ బ్యాంకు నుంచి అంతర్జాతీయ ఆర్థిక సంస్థల నుంచి, విదేశాల నుంచి దొరికే రుణాలను కేంద్రప్రభుత్వం తాను ఆ సంస్థల నుంచి పొందిన షరతుల మీదే రాష్ట్రాలకు బదిలీ చేయాలి. సర్వీసు చార్జీల నిమిత్తం కేంద్రం యిందుకోసం కేవలం నామమాత్రపు మొత్తాన్ని మాత్రమే స్వీకరించాలి.

ఖనిజాలమీద రాయల్టీం ద్వారా కొన్ని రాష్ట్రాలకు చాలా ఆదాయం లభిస్తుంది. అయితే ప్రధానమయిన ఖనిజాలమీద రాయల్టీని సవరించే అధికారం కేంద్ర ప్రభుత్వానికి మాత్రమే వున్నది. ఇప్పటివరకు వున్న అనుభవాల దృష్ట్యా ఈ సవరణలు క్రమబద్ధంగా లేవు. మార్కెటులో సరుకుకు గల గిరాకీని బట్టీ జరగడంలేదు. అందువల్ల ఈ రాయల్టీని ఎప్పటికప్పుడు సవరించే అధికారాన్ని రాష్ట్రాలకు బదిలీ చేయాలి.

ఆంధ్రప్రదేశ్ వరదలవల్ల, అనావృష్టివల్ల తీవ్రంగా నష్టపోతున్నది. అనావృష్టి కార్యక్రమాల క్రింద అందజేస్తున్న సహాయంలో 70 శాతాన్ని రుణంగా పరిగణిస్తున్నారు. నిజానికి ఈ సహాయ కార్యక్రమాలు అందుకు గురైన ప్రాంతాన్నీ, ప్రజలనూ ఆదుకోడానికి ఉద్దేశించినవి. అందువల్ల భవిష్యత్తులో అటువంటి సహాయంలో 75 శాతాన్ని గ్రాంటుగాను, 25 శాతాన్ని రుణంగాను పరిగణించాలి. తుఫానులు, వరదలవల్ల కలిగే నష్టాన్ని కేంద్రమే పూర్తిగా భర్తీ చేయాలి.

ఇటీవల బడ్జెటులో ప్రధానమంత్రి గ్రామీణాభివృద్ధి నిధిని ఏర్పాటు చేశారు. ఇది కొంత గందరగోళాన్ని సృష్టించింది. ఆదాయం పన్ను చట్టంలోని 35 వ సెక్షనును సవరించడం ద్వారా గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలలో పాలుపంచుకోడానికి పరిశ్రమలను యిప్పటివరకు ప్రోత్సహించారు. అయితే ప్రధానమంత్రి గ్రామీణాభివృద్ధి నిధి ఏర్పాటువల్ల ఈ అవకాశం జారిపోవచ్చు. అందువల్ల పాత రాయితీలను కొనసాగించవలసిందిగా కోరాం.

ధర్మకర్తృత్వ సంఘాల నిధులను ప్రభుత్వ సెక్యూరిటీలలోనూ, బ్యాంకులలోనూ పెట్టుబడి పెట్టాలని మొన్నటి బడ్జెటులో కేంద్ర

ప్రభుత్వం పేర్కొన్నది. ధర్మకర్తృత్వ సంఘాల నిధులను చిన్న తరహ పొదుపు ఉద్యమంలో పెట్టుబడి పెట్టాలని సూచించాం. దీనివల్ల రాష్ట్రాలకు తమ వాటా లభిస్తుంది.

ఉమ్మడి ప్రయోజనకరమైన అంశాలను ఎప్పటికప్పుడు చర్చించడాని అన్ని రాష్ట్రాల ముఖ్యమంత్రులతో ఒక మండలిని ఏర్పాటు చేయడ భావ్యమని భావించాం. ఇందుకు తొలిమెట్టుగా దక్షిణాది రాష్ట్ర ముఖ్యమంత్రుల మండలిని ఏర్పాటు చేయాలని నిర్ణయించాం. ఈ మండ ఇందుకోసం ఎప్పటికప్పుడు సమావేశాలు జరుపుతుంది.

ఇది కేంద్ర రాష్ట్ర సంబంధాలలో మరింత సుహృద్భావ వాతావ ణాన్ని సృష్టించడానికి ఆరంభించిన యత్నాలలో తొలి అధ్యాయం మాత్రమే ఉమ్మడిగా, సమిష్టిగా చర్చించి పరస్పరం యిచ్చిపుచ్చుకునే ధోరణిలే ప్రతిపాదనలు సాగించి, మనముందున్న అనేక సమస్యలను ఈ విధంగ పరిష్కరించుకోగలమని, ప్రజాజీవితాన్ని వెలుగుబాటలో పయనింపచేయ డానికి యిది నాందీవాచకం కాగలదని ఆశిస్తున్నాం.

*1983 మార్చి 22న రాష్ట్ర విధానసభలో...*

# ఆనంద నందనాలు వెల్లి విరియాలి

సుస్వాగతం — రుధిరోద్గారికి

శుభాకాంక్షలు — తెలుగు వారికి

క్రొంగొత్త వత్సరంలో అడుగిడుతున్న ఈ శుభ సందర్భంలో ఆంధ్రప్రదేశ్ ప్రజలందరికీ, వివిధ రాష్ట్రాలలో, వివిధ దేశాలలో వున్న తెలుగు సోదరీ సోదరులందరికీ నా నూతన సంవత్సరం శుభాకాంక్షలు.

ఆశలకు ప్రోది, ఆకాంక్షలకు పునాది మన ఉగాది. జీవితం సుఖదుఃఖాల మేలుకలయిక అనీ, అన్నిటినీ సమదృష్టితో వుంచుకొని బ్రతుకును నిత్యవసంతంగా మలచుకొమ్మని సూచిస్తుంది—ఈ రోజు మనం స్వీకరించే వేప పూత ప్రసాదం. ఇది తెలుగు ఉగాది విశిష్టత.

ఈసారి ఉగాదికి ఓ ప్రత్యేకత వుంది. 250 సంవత్సరాల తరువాత తమిళ, తెలుగు ఉగాదులు కలసి ఈ రోజునే వస్తున్నాయి. కాగా, కర్నాటక, తమిళ, మహారాష్ట్ర ప్రజలందరకూ ఇదే ఉగాది. ఈనాడే ఉగాది. ఆ సోదరులందరికీ నా శుభాకాంక్షలు.

ఉగాదులతో కలబోసుకున్నది తెలుగు వారి చరిత్ర. తెలుగునాట ఒకనాడు పాడిపంటలు వెల్లివిరిసాయి. పాలు, తేనెలు పొంగి పొరలాయి. కళామయూరాలు పురివిప్పి కలకలలాడాయి. పౌరుషం ప్రజ్వరిల్లింది. శాతవాహన, ఇక్ష్వాక, కాకతీయ, విజయనగర సామ్రాజ్యాల కాలంలో తెలుగుతేజం దిగ్దిగంతాలకు విస్తరించింది. అనంత కీర్తిని ఆర్జించింది.

ఆ సమృద్ధిని సాధించి, అలనాటి తెలుగు జాతి గౌరవాన్ని, తెలుగు వారి ఆత్మాభిమానాన్ని పునఃప్రతిష్ఠించి తెలుగు ప్రజాజీవితాన్ని సౌభాగ్యవంతం చేసి, తెలుగు భాషా సంస్కృతుల పునరుజ్జీవనం సాధించాలన్నదే మా ఆశయం. పేదరికాన్ని పారద్రోలాలన్నదే మా సిద్ధాంతం.

ఈ లక్ష్య సాధన కోసం ప్రభుత్వం ఈ మూడు నెలల స్వల్ప కాలంలోనే అనేక ప్రజాహిత నిర్ణయాలను గైకొన్నదని మీకు సవినయంగా మనవి చేస్తున్నాను. ఆనాడు మీకిచ్చిన హామీలను ఏనాడూ విస్మరించ బోమని తెలియజేస్తున్నాను. మీరుంచిన విశ్వాసానికి విరుద్ధంగా నడుచు కోమని కూడా హామీ యిస్తున్నాను. ప్రజలే ప్రభుత్వం. ప్రభుత్వమే ప్రజలు-మేము మీ ప్రతినిధులం. సంఘ సంక్షేమానికి అంకితమైన వారం.

ఉషస్సులు లేని, ఉగాదులెరుగని తాడిత, పీడిత ప్రజానీకం అంటరానితనం, మూఢమైన దురాచారాలకు గురై ఇక్కట్లలో, చీకట్లలో తమ బ్రతుకులను భారంగా ఈడుస్తున్నారు. అలాంటి బడుగు వర్గాల బ్రతు కులలో వెలుగులు చిందించాలని, వారికి చేయూతనందించాలన్నదే ప్రభుత్వ లక్ష్యం. సిలువ నీడకు కూడా నోచుకొని పేదవారి కోసం రెండు లక్షల 20 వేల శాశ్వత గృహాల నిర్మాణానికై ప్రభుత్వం బృహత్తర పథకాన్ని చేపట్టింది. చేసిన బాసల మేరకు కిలోబియ్యం రెండు రూపాయలకు పేదవారికి అందించే కార్యక్రమాన్ని ఈపర్వదినం నాడే ప్రారంభిస్తున్నాం. ఇందువల్ల లక్షలాది శ్రమజీవుల కుటుంబాలకు సంక్షేమం జరుగగలదని ఆశిస్తున్నాను.

దేశానికి అన్నదాత రైతన్న. అతని శ్రమకు తగ్గ ప్రతిఫలం లభించా లన్నదే ప్రభుత్వ లక్ష్యం. రైతే దేశానికి వెన్నెముక. రైతు సంక్షేమమే దేశ సంక్షేమం. తమ ప్రయోజనాలను పరిరక్షించుకునేందుకై తమకు సంబంధించిన అన్ని సమస్యలపైన స్వయం నిర్ణయాలు తీసుకునే అధికారం రైతు సోదరులకే వుండాలన్నది మా ఆదర్శం. అందుకే సహకార ప్రాతిపదికపై గ్రామస్థాయి నుండి రాష్ట్రస్థాయి వరకు ఒక నూతన వ్యావసాయిక వ్యవస్థను రూపొందించడానికి నిర్ణయం తీసుకున్నాం. రైతుల ప్రయోజనాలను పరిరక్షించడానికై ఎట్టి చర్యలను తీసుకొనడానికైనా మేము వెనుకాడబోమని మనవి చేస్తున్నాను.

స్వాతంత్ర్యం తరువాత 35 సంవత్సరాలు గడచినా దురదృష్టవశాత్తు మన గ్రామాల్లో ఇంకా మంచినీటి సమస్య అపరిష్కృతంగానేవుంది. కడి వెడు నీళ్ల కోసం మన ఆడపడుచులు మైళ్లకు మైళ్ళు మండుటెండలో

వెళ్ళవలసిన దుస్థితి అనేక గ్రామాలలో వున్నది. ఈ సమస్యకు తక్షణ పరిష్కారాన్ని అన్వేషించి అందరికీ మంచినీరు అందించాలన్నదే ప్రభుత్వ దృఢ దీక్ష. పరాయి పాలనలో మన జాతి వైభవం నశించి, కృశించి పోగా యింకా ఈ మాత్రమైనా మన సంస్కృతి బ్రతికి వున్నదంటే అది మన ఆడపడుచుల చలవే అని మనవి చేస్తున్నాను. సోదరీమణుల సంక్షేమం కోసం ఎంత చేసినా అది తక్కువే అవుతుంది. అది నా గుండెల్లో మెదిలే అనుభూతి. ఆడపడుచులకు మగవారితో బాటు సమానహక్కులు తండ్రి ఆస్థిలో లభించాలన్నదే నా విధానం. ఇందుకనుగుణంగా మన శాసన సభలలో తీర్మానం చేసి కేంద్రానికి సిఫారసు చేసినసంగతి మీకందరికీతెలుసు. ఏడుకొండలవాని అభయముద్రలో, పద్మావతీదేవి చల్లని శుభాశీస్సులతో వచ్చే సంవత్సరం నుండే మహిళలకు ప్రత్యేక విశ్వవిద్యాలయం ప్రారంభించ బడుతుందని తెలియజేయడానికి నాకు ఎంతో సంతోషంగా వుంది.

భావి భారత పౌరులు మన విద్యార్థులు. బ్రిటీషు పాలకుల వారసత్వంగా లభించిన బానిస విద్యావిధానం యింకా మన విద్యాలయాలలో కొనసాగుతూ వుండడం సిగ్గుచేటు. ఈ పరిస్థితిని ఆమూలాగ్రంగా మార్చివేసి మన యువ కులు తమ కాళ్లపై తాము నిలబడేశక్తిని, ఆత్మవిశ్వాసాన్ని, క్రమశిక్షణను, స్థైర్యాన్ని సాధించుకునే అవకాశాలు విద్య ద్వారా కల్పించాలన్నదే మా అభి మతం. విద్యను అంగడిలోపెట్టి అమ్ముకునే దౌర్భాగ్యస్థితి మనకు వుండకూడ దనే పట్టుదలతో కళాశాలల్లో కాపిటేషన్ ఫీజు రద్దు చేశాం. ప్రతిభకేగుర్తింపు అని నినదించాం. విద్యాలయాలను ఆదర్శ సంస్థలుగా తీర్చిదిద్ది, యువశక్తిని సాంఘిక సంస్కరణోద్యమంలో లయబద్ధం చేసి వినియోగించుకోవాలన్నదే మా లక్ష్యం. ఇందుకై 'తెలుగు వెలుగు' కార్యక్రమాన్ని రూపొందిస్తున్నాం.

> "తెలుగదేలయన్న — దేశంబు తెలుగు ఏను
> తెలుగు వల్లభుండ తెలుగొకండ
> ఎల్ల నృపులు గొలువ ఎరుగవే బాసాడి
> దేశ భాషలందు తెలుగు లెస్స"

ఇది సాక్షాత్తు శ్రీకాకుళం ఆంధ్ర మహావిష్ణు దేవుని నుడి. తేనె లొలుకు తియ్యదనం మన తెలుగు భాష సొత్తు. సుమధుర లలిత

సంస్కృతీ స్రవంతిగా వాసికెక్కిన భాష ఈనాడు ఎంతగా ఛిద్రమైపోయింది. తెలుగు సంస్కృతి పునరుద్ధరణకు మనమందరం అంకితం కావలసిన అవసరం వచ్చింది. అదే ఆదర్శంతో తెలుగు భాషే ప్రధాన భాష కావాలని ఈ ఉగాది నుంచి తెలుగును అన్ని స్థాయిలలో అమలు చేస్తున్నాం. తెలుగు సంస్కృతి విస్తరించాలి. తెలుగుతనం వర్ధిల్లాలి. తెలుగు బావుటా వినువీధుల్లో రెపరెపలాడాలి. అలనాడు తెలుగునాట మ్రోగిన విజయ దుందుభులు మరోసారి దిగ్దిగంతాలలో నినదించాలి. తెలుగుతల్లి తనముద్దు బిడ్డల మురిపాలలో ఆనందమయి కావాలి.

తెలుగు ప్రజలందరి జీవితాలలో నిత్య వసంతాలు తొణకాలని, ఆనందనందనాలు వెల్లివిరియాలని కోరుకొంటూ అందరికీ మరోసారి నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలియజేస్తున్నాను.

*15, ఏప్రిల్ 1983 రుధిరోద్గారి ఉగాదినాడు*
*ఆకాశవాణి/దూరదర్శన్‌లలో ప్రసారితం*

# తెలుగు — తమిళుల మైత్రికి వారధి

ఈ రోజు సుదినం. ఆనాడు వీరబ్రహ్మేంద్రస్వామి వారి చిత్ర నిర్మాణం సందర్భంలో ఇక్కడికి వచ్చాను. వారి ఆశీస్సులతో మహోకసారి ప్రజాహితమైనటువంటి ఈ సంక్షేమ కార్యక్రమానికి ఇక్కడికి రావడానికి నేను ఎంతో ఆనందిస్తున్నాను. ఎందుకంటే ఈనాడు ప్రజాహితం కోసం, ప్రజాసంక్షేమంకోసమే ప్రభుత్వం కానీ అధికారం చేపట్టడానికి కాదన్నది నిర్వివాదాంశం. ఈనాడు ప్రజలే ప్రభుత్వం, ప్రభుత్వమే ప్రజలు. ప్రభుత్వం ఏది చేస్తున్నప్పటికీ కూడా ప్రజలను దృష్టిలో పెట్టుకొని ప్రజా సంక్షేమానికే చేస్తున్నదని మాత్రం నేను పరిపూర్ణంగా విశ్వసిస్తున్నాను. అదే ఈనాటి ప్రజాస్వామ్యానికి నిర్వచనం. ఏదైనాసరే అందరికీ సరైనటువంటి సక్రమమైనటువంటి అవకాశాలు కల్పించబడాలి. ఎవరు ఏ ప్రాంతంలో ఉన్నప్పటికీ అందరూ మనవారు. ఆరు కోట్ల తెలుగు ప్రజానీకమంతా కూడా సోదరభావంతో ఒక్క త్రాటి మీద మెలగాలి. ప్రతి ఒక్కరూ కూడా ప్రక్కవారి సంక్షేమాన్ని చూడాలి. వారి సంక్షేమాన్ని గమనించి సాటి సంఘం యొక్క, సాటి సమాజం యొక్క అభివృద్ధికి పాటుపడాలి, సహాయపడాలి. ఇదే ప్రభుత్వం యొక్క లక్ష్యమని కూడా మీకందరికీ నేను సవినయంగా మనవిచేస్తున్నాను.

ఈనాడు తెలుగువారి గుండెల్లోనుంచి ప్రవహించినటువంటి అనురాగ వాహినే తెలుగుగంగగా రూపొందిందనిచెప్పి నేను మనవి చేస్తున్నాను. తమిళనాడుకు, తెలుగునాడుకు శాశ్వతమైనటువంటి అనుబంధంగా, ప్రేమ వాహినిగా చిరకాలం ఈ తెలుగుగంగ చక్కగా, చల్లగా, హృదయాను రంజకంగా, మనస్సంతృప్తిగా సాగాలనిచెప్పి కూడా ఈ సందర్భంగా నేను కోరుకుంటున్నాను. ఈనాడు మనందరం కూడా ఇరుగుపొరుగు రాష్ట్రాల వారం అన్నదమ్ముల్లాగా కలిసిమెలిసి నటువంటి వారము. మన సంక్షేమాన్ని, అభివృద్ధిని ఒకరికొకరం చూచుకుంటూ ముందుకు సాగవలసినవారం. అటువంటి సందర్భంలో ప్రక్కవారికి తాగడానికి నీళ్లు కూడా లేకుండా

బాధపడుతున్నారు అంటే ఎప్పుడో చేయవలసింది. ఈ పథకం ఇంతవరకు జాప్యం అయిందంటే ఒకవిధంగా బాధగానే ఉంది. ఇకముందు ఈ కార్యక్రమాలు కుంటుపడకూడదు. మన సుహృద్భావానికి సూచకంగా తెలుగువారి ఆదరణకు ఒక రూపంగా ఇది ఆకృతి దిద్దుకోవాలనేటటు వంటి సోదరభావంతోనే మన తమిళ సోదరులకు ఈనాడు ఈ వసతి కల్పించడం జరిగిందని మీకందరకూ మనవి చేస్తున్నాను.

ఈనాడు మనం తినటం ప్రాధాన్యం కాదు. ప్రక్కనలేని వారిని చూడడం, వారికి పెట్టడం కూడా నా ఆదర్శం. అదే మానవ ధర్మం. అదే వీరబ్రహ్మంగారు చెప్పిన ఆదర్శం కూడా. ఈనాడు మానవులంటే, మానవతా వాదం అంటే—ఎవరైతే సాటి మానవుడిలో భగవంతుణ్ణి చూడగలుగుతారో అది నిజమైనటువంటి మానవత్వం. ఈనాడు నీ సంగతి నీవు చూసుకోవటం కాదు. నీ ప్రక్కన నీ దేశం, నీ సంఘం, నీ సమాజం, నీ మానవాళి ఏ విధంగా ముందుకు వెడుతున్నది? ఏ విధమైనటువంటి సంక్షేమకరమైనటువంటి భావంతో నీవు మెలగాలి? సోదరభావంతో నీ సమాజానికి అభివృద్ధికి దోహదకారివి కావాలి? అది పరమార్థమైనటువంటి విషయం. అదే బ్రహ్మంగారు చెప్పినటు వంటి సత్యస్వరూపమైనటువంటి మానవ ధర్మం. ఎన్నాళ్లనుంచో, ఎన్నో తరాల నుంచో ఇంచుమించుగా ఎన్నో యుగాలనుంచో కటకట లాడుతున్నటువంటి ఈ ప్రాంతాన్ని మనకున్నటువంటి వనరులన్నింటినీ సద్వినియోగపరుచుకుని వాటిని సంక్షేమ కార్యక్రమాలకు, ప్రజాభి వృద్ధికి, తద్వారా రాష్ట్రాభివృద్ధికి ఉపయోగించుకోవడం మన ధర్మం.

అందుకనే ఏది ఏమైనా సరే ఈనాడు పేద ప్రజానీకం యొక్క సంక్షేమాన్ని చూడటమే ప్రభుత్వ ధర్మంగా పెట్టుకొని, ఆనాడు ఎన్నికల ముందు ఏ మాటైతే హామీగా యిచ్చామో, ఏ పేదప్రజల సంక్షేమాన్ని చూస్తామనిచెప్పి మీ అందరికీ మాట యిచ్చామో ఆ పేదప్రజల సంక్షేమంకోసమే ఈ కార్యక్రమాలన్నీ తలపెట్టబడ్డాయని సోదర సోదరీ మణులకు మనవి చేస్తున్నాను. మీరు నమ్మకం ఇచ్చారు. ఆదరించారు. విశ్వ సించారు, గౌరవించారు. దానికి ప్రతిరూపంగా మీ విశ్వాసానికి, మీరిచ్చిన గౌరవానికి అర్హత ఉన్నవాళ్లమని నిరూపించుకొనటానికే ఈ ప్రభుత్వం



తెలుగుగంగ ఒప్పందంపై 1983 ఏప్రెల్ 19న ఆంధ్రప్రదేశ్,
తమిళనాడు ముఖ్యమంత్రులు సంతకాలు చేస్తున్న దృశ్యం



ఏప్రెల్ 27న కడపజిల్లా బ్రహ్మంగారి మఠంవద్ద రిజర్వాయరు నిర్మాణానికి
శంకుస్థాపన చేస్తున్న తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ ఎం.జి. రామచంద్రన్ తో



తెలుగు గంగ ప్రాజెక్టు వ్యయంలో తమిళనాడు వాటా తొలి విడత రూ. 30 కోట్ల మొత్తాన్ని మద్రాసులో ఏర్పాటుచేసిన కార్యక్రమంలో తమిళనాడు ప్రభుత్వం తరఫున ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధీ నుంచి స్వీకరిస్తున్న ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి

పనిచేస్తున్నది అహర్నిశలని మీకందరికీ నేను మనవిచేస్తున్నాను. అందుకే మీ అందరి చల్లని ఆశీస్సులతో ఈనాడు ఈ తెలుగు గంగకు శంకుస్థాపన చేయడం జరిగింది—సోదరులు ఎం.జి. రామచంద్రన్ యొక్క చల్లని హస్తాలతో. ఈనాడు వారు ఇక్కడికి రావడం, ఈ తెలుగు గంగకు వారి చేతులమీదుగా ఈ ఉత్సవాన్ని జరిపించడం నిజంగా ఇది చిరస్మరణీయంగా తెలుగువారి హృదయాలలో ఉండేటటువంటి మధురాతి మధురమైనటువంటి అనుభూతిగా ఉంటుందని వారికి సవినయంగా మనవిచేస్తున్నాను.

మన జాతి ఉన్నంతకాలం, మన దక్షిణభారతదేశం ఉన్నంతకాలం, తెలుగు తమిళుల మైత్రికి చిహ్నంగా, గుర్తుగా, జ్ఞాపకంగా పదిలంగా హృదయాలలో ఉంచుకుంటారని కూడ నేను వారికి సవినయంగా మనవి చేస్తున్నాను. సోదరులందరికీ ఒక విషయాన్ని గుర్తు చేస్తున్నాను. దీనికి ఒక ప్రత్యేకమైనటువంటి ఒక కొత్త పద్ధతిమీద ఈ పథకాన్ని రూపొం దించాలని కూడ ప్రభుత్వం భావిస్తున్నదని నేను మనవి చేస్తున్నాను. ముందునుంచి కూడా ప్రభుత్వం మధ్యనున్నటువంటి దళారీ వర్గం వారందర్నీ కూడా తీసివేయటానికే ప్రయత్నిస్తున్నది. ఏదైనాసరే అనుభ వించే వారికి, దాని నిర్మాణంలో తలపెట్టిన వారికి వారి ఇద్దరిమధ్య కంట్రాక్టర్లుగానీ, దళారీలుకానీ ఉండకూడదన్న భావంతో ఈనాడు యువ శక్తినంతా కేంద్రీకరించి, మన రాష్ట్రంలో ఉన్నటువంటి, ముఖ్యంగా ఈ నాలుగు జిల్లాలు—కడప, కర్నూలు, నెల్లూరు, చిత్తూరు జిల్లాల్లో ఉన్న టువంటి—యువశక్తినంతా సమీకరించి, వారి కృషికి చిహ్నంగా, వారి కృషికి గుర్తుగా ఈ ప్రాజెక్టు ఒక ఆకృతి పొందాలని కూడ ప్రభుత్వం ఆలోచిస్తున్నది.

ఈనాడు కరువు, కాటకాలమూలంగా తినటానికి తిండి లేక చేసు కోవడానికి పనులు లేకండా వలస వెడుతున్నటువంటి సోదరీ, సోదరులం దరికీ న్యాయం కలుగజేయాలి, వారికి వృత్తి ఇవ్వాలి. తద్వారా భృతిని కల్పించాలి. కిలో బియ్యం 2 రూపాయలకు అందజేయాలి శ్రామికులందరికీ. ఇది ప్రభుత్వ లక్ష్యం. దీని ఆకృతిగా ఈ పథకాన్ని రూపొందించడానికి కృషి జరుగుతుంది.

ఇది యువశక్తికి, నిర్మాణ కృషికి ఒక గుర్తుగా రూపొందించడానికి ప్రయత్నాలు జరుగుతున్నాయి. ఈనాడు ఎంతో ఆశతో, ఆప్యాయతతో అందరూ వచ్చారు, ఆశీర్వదించారు. మీ చల్లని ఆశీస్సులు, అండదండలు ఉన్నంతవరకు మా ప్రభుత్వం తలపెట్టిన కార్యక్రమాల్ని కృతనిశ్చయంతో, ద్విగుణీకృతోత్సాహంతో, నిర్విఘ్నంగా నెరవేర్చడానికి కృషి చేస్తుందని మీకందరికీ నేను మరొక్కసారి హామీయిస్తున్నాను. ఈనాడు ప్రభుత్వమే మీరు, మీదే ఈ ప్రభుత్వం. మీ సంక్షేమానికే యిదిపాటు పడుతుంది. పేద జనోద్ధరణే ఆదర్శంగా పెట్టుకొని ఈ ప్రభుత్వం ముందుకు సాగుతుందని మీ విశ్వాసానికి ఏ మాత్రం కూడా తగ్గకుండా, దీటుగా నిలబడి మీ అందరి సంక్షేమానికి పాటుపడుతుందని సవినయంగా మనవిచేస్తూ; ఎంతో ఆప్యాయతతో, ఆదరంతో ఈనాడు ఇంతదూరమైనా ఇక్కడికి విచ్చేసిన అధికారులకు, అనధికారులకు అటు తమిళనాడు, ఇటు మన రాష్ట్రంలో ఉన్నటువంటి అధికారులందరికీ, పత్రికా విలేకరులందరికీ, పెద్దలకు, పూజ్యులకు, సోదరులకు, సోదరీమణులకు మరొక్కసారి నా అభినందనలు తెలియజేస్తూ; ఈనాడు మనం చేపట్టిన ఈ కార్యక్రమం జయప్రదం కావాలని, అతి త్వరితంగా రూపుదిద్దుకోవాలని మీరందరూ కూడా నిండు మనసుతో ఆ భగవంతుణ్ణి ప్రార్థించి ఈ ప్రభుత్వ కృషిని ఆశీర్వదించాలని ప్రతి ఒక్కరికి విజ్ఞప్తి చేస్తున్నాను.

*1983 ఏప్రెల్ 27న బ్రహ్మంగారి మఠంవద్ద*
*తెలుగుగంగ రిజర్వాయరు శంకుస్థాపన సందర్భంగా*

# ఇరుగు పొరుగు రాష్ట్రాల మధ్య సహకారానికి శ్రీకారం

ఈనాడు ఈ ప్రజాహిత కార్యానికి విచ్చేసినటువంటి సోదరులు, తమిళనాడు ముఖ్యమంత్రి, గౌరవనీయులు శ్రీ యం. జి. రామచంద్రన్ గార్కి, ఇచ్చట వేదిక మీద వున్నటువంటి ఈ కర్నూలుజిల్లా, ప్రకాశం జిల్లా కార్యకర్తలకు, శాసనసభ్యులకు, అందరికి,— పూజ్యులు, నిజ్ఞులు ప్రతిభా విశేషం కల్గినటువంటి పూజ్యులకు, పెద్ద లందరికి—ఈనాడు ఈ సమావేశాన్ని ప్రజాబాహుళ్యంగా అందరికి తీర్చి చెప్పడానికి— విచ్చేసినటువంటి పత్రికా ప్రతినిధులకు— ఈనాడు ఎంతో దూరంనుంచి అటు మద్రాసు నుండి, ఇటు హైదరాబాదు నుండి కూడా ఈ కార్యక్రమానికి విచ్చేసినటువంటి అధికార వర్గానికి, అనధికార వర్గానికి— ఎండనక ఎంతో ప్రయాసతో ఈ శ్రమనంతా ఓర్చి, ఎంతో ఆప్యాయతతో, ఆదరంతో ఆశీర్వదించడానికి విచ్చేసినటువంటి అశేష యువ సోదరులకు, యువ శక్తికి— ఎంతో కరుణతో ఆదరంతో ఆరు కోట్ల ప్రజానీకానికి సంబంధించినటువంటి ఈ ప్రాజెక్టును ఆశీర్వదించడానికి, నాకు దీవనలు అందించడానికి విచ్చేసినటువంటి మా తెలుగింటి ఆడబడుచులందరికి నా హృదయ పూర్వకమైనటువంటి నమస్సులు.

ఇదంతా కూడా మీ చలవ.

ఇది ప్రజా యుగం. ప్రభుత్వానికి ప్రజలకు ఏమీ తేడా లేదు. ప్రజలే ప్రభుత్వం. ప్రభుత్వమే ప్రజలు. ఈనాడు ప్రభుత్వం ఏది తలపెట్టినా ప్రజాభిమతానుసారం ప్రజలు ఏది కోరుతారో, ప్రజలకు ఏది అవసరమో, ప్రజలకు ఏది క్షేమమో, ప్రజలకు ఏది అభివృద్ధికరంగా వుంటుందో అటువంటి కార్యక్రమం చేపట్టడం ప్రభుత్వ ధర్మంగా నేను భావిస్తున్నాను. అందుకనే ఆనాడు ఎన్నికల సమయంలో మీ అందరికి

వాగ్దానం చెయ్యడం కూడా జరిగింది. సామాన్య ప్రజానీకానికి, అట్టడుగునవున్నటువంటి పేద ప్రజానీకానికి 35 సంవత్సరాల పరిపాలన ప్రజల కందుబాటులో లేక, దారిద్ర్య రేఖకు అట్టడుగున వున్నటువంటి 50 శాతం ప్రజలందరికి కూడా కట్టుకోడానికి బట్ట, తినడానికి తిండి, ఉండడానికి వాసయోగ్యమైన ఇల్లు ఇస్తామని ఆనాడు మీ అందరికి నేను వాగ్దానం చేసియున్నాను. వంద సంవత్సరాలుగా కలగానేవుంటూ ఈనాటికి కూడా ఒక రూపం దాల్చకుండా, ఇంటిముందే యేరువున్నదిగాని త్రాగడానికి గుక్కెడు మంచి నీళ్లకు సోదరులకు అవకాశం లేని ఈ తరుణంలో ఏమైనా సరే ఈనాడు రాయలసీమకు వున్నటువంటి ఈ క్షామబాధ నివారణ తక్షణం జరిగి తీరాలి అనే భావంతో ఈనాడు ఉభయ కుశలోపరి అన్నట్లుగా ఇద్దరియొక్క ప్రయోజనాలను దృష్టిలో పెట్టుకొని, అటు తమిళనాడు సోదరులకు ఇటు ఆంధ్రప్రదేశ్ సోదరులకు అనువైన విధంగా 'తెలుగు గంగను' ఏర్పరచడం జరిగిందని మీ అందరికి సవినయంగా మనవిచేస్తున్నాను.

ఈనాటిదికాదు ఈ సమస్య. ఎప్పటినుంచో వున్నది. కృష్ణానదీ జలాలు మద్రాసు పట్టణానికి మంచినీటికోసం తరలించాలని. కాని ఇంత వరకు అది ఫలప్రదమైన, జయప్రదమైన ఒక ఆకారం దాల్చలేదు. ఈనాడు మద్రాసుకు నీటితోపాటు ఒకనాటి రత్నాలసీమగావున్న రాయల సీమలోవున్న సోదరులందరికి మంచినీళ్లు ఇవ్వాలి, రైతులకు వ్యవ సాయానికి నీళ్లు ఇవ్వాలనే భావంతో ఉభయత్రా రెండు రాష్ట్రాల క్షేమాలను కలిపి ఈ తెలుగుగంగగా రూపొందించబడింది.

ఈనాడు కర్నూలు జిల్లాలో, కడప జిల్లాలో, నెల్లూరు జిల్లాలో, చిత్తూరు జిల్లాలో 6 లక్షల ఎకరాల సాగుకు ఈ నీరు ఇవ్వబడుతుంది. ఇది ఇంకా 4 లక్షల ఎకరాలకు అండర్‌గ్రౌండ్ వాటర్ టేబుల్‌ని—ఆ భూ జల నిక్షేపాన్ని—ఒక పరిమితిలో వుంచడంకూడా జరుగుతుంది. ఆ విధంగా ఈనాడు బావులకుగాని, అన్నిటికిగాని వనరులు ఏర్పరచ బడతాయి. ఈ విధంగా 10 లక్షల ఎకరాలకు ఈ వ్యవస్థ ద్వారా, ఈ పథకం ద్వారా నీరు అందించబడుతుంది.

ఈనాడు తమిళ సోదరులకు, ఆంధ్ర సోదరులకు ఏమాత్రం కూడా భేదభావం లేదు. ఇక్కడ తమిళ సోదరులున్నారు. మద్రాసు రాష్ట్రంలో మన ఆంధ్ర సోదరులున్నారు. అందరుకూడా ఒక తల్లిబిడ్డల్లాగా పొరపొచ్చాలేవీ లేకుండా, అరమరికలు లేకుండా అన్నదమ్ముల్లాగా కలిసి మెలిసి వున్నారు. వారి వ్యాపారాలుగాని, వ్యవహారాలుగాని అన్నీ సాగించు కుంటున్నారు. అటువంటి పరిస్థితుల్లో మనం ఎప్పటికప్పుడు సోదరుల కష్టాలను గమనిస్తూ, వారి కష్టసుఖాలలో కూడా పాలు పంచుకుంటూ అండగా వుంటున్నాము. ఇరుగు పొరుగు రాష్ట్రాలే కాదు, ఒక్క తల్లి కన్నబిడ్డల్లాగా ఈనాడు తమిళులు, తెలుగువారు కూడా ఉంటారన్నభావం ఎప్పటికప్పుడు వ్యక్తం చెయ్యడం మన ధర్మం, మన ఆదర్శంగా నేను భావిస్తున్నాను.

ఎప్పుడో ఒడంబడిక జరిగింది. కర్నాటక, మహారాష్ట్ర ప్రభుత్వాలు, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం యీ మూడు రాష్ట్రాలు కలిసి 15 టి.యం.సి.ల వాటాను తమిళ సోదరులకు త్రాగడానికిస్తామని అన్నారు. ఎన్నో సంవత్సరాలు గతించాయి. ఎన్నెన్నో ఆలోచనలు జరిగినాయి. కానీ ఈనాటికి కూడా ఒక రూపం ధరించలేదు. ఏమైనా సరే ఈ నవతరంలోనే ఇది నెరవేరాలనేటటువంటి దృక్పథంతో ఏ విధంగానైనా సరే ఇది జాగుచెయ్యబడకూడదు అనే అభిప్రాయంతో ఈ నాటికి యీ నిర్ణయం తీసుకోవడం జరిగింది. అది నా అదృష్టంగా భావిస్తున్నాను. ఎందుకంటే 35 సంవత్సరాలుగా అన్నగారు (ఎం.జి.ఆర్.) నన్ను తమ్ముడుగా ఆదరిస్తున్నాడు. గౌరవిస్తున్నాడాయన. మేమిద్దరం కలిసి ఒక కాగితంమీద, అగ్రిమెంటుమీద సంతకంచేసే అదృష్టం నాకు కల్గింది.

ఈనాడు తెలుగుగంగ రావడం మూలకంగా శ్రీశైలం కుడికాల్వ పని ఆగిపోతుందనే ఒక తప్పుడు ప్రచారాన్ని కొందరు చేస్తున్నారు. అటు వంటిది ఏమీ జరుగదని సోదరులందరికి సవినయంగా మనవిచేస్తున్నాను.

దాని కార్యక్రమం అది సాగుతుంది. ఈ ప్రక్కన ఈ కార్యక్రమం కూడా సాగింపబడుతుందని మీ అందరికి సవినయంగా మనవిచేస్తూ

ఇటువంటి అనుమానాలేవీ పెట్టుకోవద్దని చెప్పి మీ అందరికి నేను సవినయంగా విజ్ఞప్తి చేస్తున్నాను. అంతేకాదు నిధులు ఎక్కడినుంచి వస్తాయి, ఇన్నిన్ని పథకాలు మొదలు పెట్టారని ఏవేవో సంకోచ భావాలు, ప్రచారం చేస్తున్నారు. మనిషికి ఆలోచన ఉండాలి. మనిషికి పట్టు దల ఉండాలి. ఆత్మవిశ్వాసం ఉండాలి, నిర్మలం ఉండాలేగాని డబ్బుకోసర మని మంచి ఆలోచనలేవీ నిలుపకూడదు. మనకోసం కాలం ఆగదు. ఈ కాల గమనాన్నిబట్టి మనం కూడా ముందుకు వెళ్లాల్సిందే తప్ప డబ్బు లేదు, డబ్బులేదని ఏమాత్రం నిలుపుదలచేయడానికి వీలులేదు.

ఇంతమంది సోదరులున్నారు, సోదరీమణులున్నారు. డబ్బులేకపోతే జోలెకట్టుకొని మీ అందరి ముందుకు వస్తే మీరందరూ ఇచ్చే డబ్బులే చాలు—ఇటువంటి పథకాలన్నీ సమూలంగా నెరవేర్చడానికి. నాకు ప్రజా సంక్షేమం, తెలుగు తల్లియొక్క వికాసం, తెలుగు సోదరులయొక్క అభివృద్ధి తప్ప మరేదికూడా నా మనస్సులో లేదు. నా జీవితమే తెలుగు గడ్డకు అంకితం. తెలుగు తల్లికి ఇదేవిధంగా నా ప్రాణాలు ఇవ్వ డానికైనా సిద్ధంగా ఉన్నాను. మీరు నా అండ నున్నంతవరకు, మీరు నా అండదండగా ఉండి నడిపించినంతవరకు ఏ అడ్డంకులుగాని, ఏ అవాంతరాలుగాని, నా ముందుకు రాలేవు. ఈనాడు ప్రజాశక్తిని ప్రతిఘటించే ఏ రాజకీయ పార్టీగాని, ఏ రాజకీయ నాయకుడు గాని, నిలబడదు. ఈ ప్రజాయుగంలో ప్రజాహిత కార్యక్రమాలు చేపట్టేటటు వంటివారు ఎవరైనా సరే ప్రజానాయకులుగా ముందుకు వెళ్లవలసిందేగాని, ప్రజల మనస్సులో అనుమానాలు కల్పించి, అవాంతరాలు తెచ్చేటటువంటి వారిని యిక ప్రజలు సహించరని నేను హెచ్చరిక చేస్తున్నాను.

ఇదేకాదు, ఇకముందు మనం ఎన్నో కార్యక్రమాలు చేపట్టవలసి ఉన్నది. ఈనాడు ఎడారిగా వున్నటువంటి ఈ నేల అంతా కూడా సస్య శ్యామలం కావలసివున్నది. పచ్చగా పరవళ్లు తొక్కుతూ కన్నుల పండుగగా మన తెలుగుతల్లి మన ముందు చిరునవ్వులతో కలకలలాడాలి. అదే మన ధ్యేయం. అదే మన ఆశయం. ఆ ఆశయ సిద్ధికి ఏమాత్రం కూడా వెనుదీయకుండా, మీరెన్నుకొన్న నాయకత్వానికి తగిన అర్హత వున్న వ్యక్తినని నిరూపించుకోవడానికి ఏమాత్రం కూడా వెనుకాడనని,

ఈనాడు నాకు కుడి ఎడమలుగా నిలిచిన ఈ సహచరులందరు కూడా ప్రజాసంక్షేమానికే బద్ధకంకణులై అంకితమయ్యే నాయకులని, ఈ ప్రభుత్వము ప్రజలకొరకే, ప్రజల సంక్షేమానికే నిర్వహించబడే పరిశుద్ధమైనటువంటి పాలన ఇచ్చే యంత్రాంగమని, ఇదంతా కూడా ఈ ఆరు కోట్ల ప్రజానీకానికే అంకితమని ఈ సభాముఖంగా మీ అందరికి నేను సవినయంగా మనవిచేస్తున్నాను.

ఎంతో సంతోషం. అన్నగారిని ఆహ్వానించే అదృష్టం కల్గింది. ఈనాడు ఆరు కోట్ల తెలుగువారి తరఫున సోదరులకు నేను స్వాగతం చెప్తున్నాను. ఈనాడు ఇక్కడ వెలిసే తెలుగుగంగ ఉభయ రాష్ట్రాలకు చిరకాలం వారియొక్క అనుబంధానికి, ప్రేమకు, అనుభూతికి, చిహ్నంగా ఉండాలని, ఏవిధంగా ఈనాడు మేమిద్దరం అన్నదమ్ములుగా ఈ సభావేదిక మీద మీ అందరు ఆశీస్సులిస్తుండగా నిలబడ్డామో, కూర్చున్నామో, ఈ కార్యక్రమానికి ఉపక్రమించామో అదేవిధంగా తెలుగు, తమిళులయొక్క కలయిక చిరకాలం ఇలాగే వర్ధిల్లాలని, ఒక తల్లి గన్న బిడ్డల్లాగా, అన్నదమ్ముల్లాగా వ్యవహరించాలని, ఒకరి కష్టాలలో ఒకరి సుఖాలలో ఒకరికొకరు పాలుపంచుకుంటూ చెయ్యిలో చెయ్యి, అడుగులో అడుగు వేసుకుంటూ ముందుకు సాగాలని, ఇది ఆదర్శవంతమైనటువంటి కృషి కావాలని, భారతదేశంలో ఉన్నటువంటి మిగిలిన రాష్ట్రాలు కూడా ఇదేవిధంగా అన్యోన్యతతో, ఆనందంతో ఒకరినొకరు పరామర్శించుకుంటూ ముందుకు వెళ్ళాలని కోరుకుంటున్నాను. ఈనాడు ఈ శుభకార్యానికి పునాది వేయడానికి వచ్చినటువంటి సోదరులకు మరొక్కసారి ఈ ఆరు కోట్ల తెలుగు ప్రజానీకం తరఫున అభినందనలు తెలుపుతూ, ఈనాడు ఈ కార్యక్రమంలో వారుకూడా భాగస్వాములుగా నిలిచినందుకు, ఈ వ్యవస్థ నిర్మాణం ఈ ప్రాజెక్టు నిర్మాణంలో వారు కూడా సహాయ భూతులై, సానుకూలతతో మన ప్రక్కన ఉన్నందుకు వారికి అభినందనలు తెలుపుతున్నాను.

*1983 ఏప్రిల్ 27న వెలుగోడువద్ద తెలుగుగంగకు తమిళనాడు ముఖ్యమంత్రి శ్రీ ఎం.జి. రామచంద్రన్ శంకుస్థాపనచేసినసందర్భంలో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి అధ్యక్షోపన్యాసం*

# మానవత్వానికి నిదర్శనం

ఈనాడు సుదినం. ఎంత మధురంగా ఉందో, ఎంత ఆనంద మయంగా ఉందో చెప్పడానికి నా తరం కావడంలేదు. ఎందుకంటే సోదరులు రామచంద్రన్‌గారు మాట్లాడుతూ వారు వ్యక్తపరిచి నటువంటి ప్రేమకు, అనురాగానికి నేను ఒక తమ్ముడిగా పరవశించి పోయాను. ముగ్ధుడ్నయిపోయాను. ఈనాడు మీ అందరి సమక్షంలో వారి ఆశీస్సులు అందుకునే అవకాశం నాకు కలిగినందుకు కూడా అది నేను అదృష్టంగా భావిస్తున్నాను. ఈనాడు ఇది మానవత్వానికే పట్టం కట్టిన ఒకమధురమైన రోజు. ఈనాడు తమిళసోదరులు, ఆంధ్రసోదరులు అందరూ కూడా ఒక్క తల్లి కన్నబిడ్డల్లాగా ప్రేమలు కలబోసుకుంటూ, ఆనందాన్ని పంచుకుంటూ, ఉత్సాహంతో, ఉల్లాసంతో ఒకరి కష్టాలు ఒకరు తీర్చుకునే సుదినంగా భావిస్తున్నారు అంటే అంతకంటె మంచి పండుగ దినం మనకు లేదని నేను పరిపూర్ణంగా భావిస్తున్నాను. ఈనాడు సాటి సోదరులకు త్రాగడానికి మంచినీళ్ళు లేనప్పుడు- ఇప్పుడే చెప్పారు సోదరులు రామచంద్రన్‌గారు - నూరు సంవత్సరాల చరిత్ర చేయలేనిదానిని ఈనాడు మనం పరిష్కరించుకోగలుగుతున్నామంటే నిజంగా అది మానవత్వానికి నిదర్శనమని మీకందరికీ నేను మనవి చేస్తున్నాను. ఈనాడు మనం తినటమో, త్రాగటమో ఆదర్శం కాకూడదు. ప్రక్కన లేనివారికి ఇంత పెట్టగలిగినప్పుడు, నీ ప్రేమను ఇంత పంచి ఇచ్చినప్పుడు, సోదరభావంతో వాడగలిగినప్పుడు అదే మానవత్వానికి పరమార్థంగా ఉంటుందని కూడా మీకందరికీ నేను సవినయంగా మనవిచేస్తున్నాను. ఈనాడు అన్ని వనరులు ఉన్నప్పటికీ కూడా, 35 ఏళ్ళు స్వాతంత్ర్యం వచ్చి కూడా ఇంతవరకు రాయలసీమకు సంపూర్ణంగా త్రాగడానికి నీళ్ళు వేసవికాలంలో లభించనటువంటి దురదృష్టం ఇంకా ఉన్నది, అదే సాగుతున్నది అంటే అది ఎటువంటి దుర దృష్టకరమో ఒక్కసారి ఆలోచిస్తే సోదరులందరికీ తెలుస్తుంది. పేదవారికి తినడానికి తిండి, త్రాగడానికి మంచినీళ్ళు, ఉండడానికి ఇళ్ళు కల్పించడం

ప్రభుత్వ ధర్మం, అదేవిధంగా ఈనాడు ఈ కార్యక్రమం జరుపుతున్నా మంటే మీ అందరూ మా అండన ఉన్నారనీ, తమ్ముళ్లందరూ నా వెనుక ఉన్నారనీ, ఆ బలంతో నేను ముందుకు నడవగలుగుతున్నానని నేను మీకందరికీ మనవిచేస్తున్నాను.

ఈనాడు ప్రభుత్వానికి, ప్రజలకు ఏమీ భేదంలేదు, ఏమీ తేడా లేదు. ప్రజలే ప్రభుత్వం, ప్రజలదే ఈ ప్రభుత్వం. ఎంతవరకు మీ సంక్షేమంకోసం, మీ సౌభాగ్యంకోసం, ఈ పరిపాలన సాగుతుందో, పాలన జరుగుతుందో అంతవరకే ఇక్కడ నేను ఉండగలుగుతానని మనవి చేస్తు న్నాను. ఏనాటికానాడు మీరిచ్చిన ప్రోత్సాహంతో, మీరిచ్చిన బలంతో, సహకారంతో ఎప్పటికప్పుడు ముందుకు వెళ్లడం జరుగుతుంది. ఎన్ని ఆటంకాలు వచ్చినాసరే, ఎన్ని అడ్డంకులు వచ్చినాసరే అన్నిటినీ ముందుకు దాటి వెళ్లగలుగుతాను. మీరే నాకు బలం. ఈ విధమైన అండ దండలు ఇచ్చి, ప్రోత్సహించి ముందుకు నడుపుతున్న సోదరీ సోదరు లందరికీ కృతజ్ఞతాభావంతో ఒక్కసారి నా బాధ్యతను ఈ విధంగా నెరవేర్చుకున్నాను. ప్రజా సంక్షేమంకోసం ఈ ప్రాజెక్టును అంకితం చేయడానికి నేను ఎంతో ఆనందంగా భావిస్తున్నాను.

ఈనాడు తమిళనాడులో తెలుగు సోదరులు ఉన్నారు. అన్నగారు చెప్పినట్లుగా ఈనాడు తెలుగునాడులో తమిళ సోదరులున్నారు. ఒక అమ్మగన్న బిడ్డల్లాగా, అన్నదమ్ముల్లాగా మనం మెలగవలసిన అవసరం ఉంది. ఈనాడు ఒకరినొకరు పరామర్శించుకుంటే, ఒకరి కష్టాలు ఒకరు తీర్చు కుంటే, ఒకరి సుఖాలలో ఒకరు పాలుపంచుకుంటే, కాలులో కాలు, చేతిలో చెయ్యివేసికొని ముందుకు రావలసిన అవసరం మనకెంతో ఉంది. మన సంక్షేమాన్ని గమనించుకుంటూ ముందుకు సాగడమే ఆదర్శంగా కావాలని, ఈనాడు మీ అందరి సమక్షంలో అన్నగారి అధ్యక్షతన జరిగే ఈ సమావేశంలో నాచే పునాది వేయబడినటువంటి ఈ తెలుగుగంగ కార్యక్రమం నిర్విఘ్నంగా కొనసాగాలని, ప్రతి తెలుగువారికి, ఈ ప్రాంతంలో వున్నటువంటి — కర్నూలు, కడప, నెల్లూరు, చిత్తూరు జిల్లాలలో ఉన్నటువంటి తెలుగువారందరికి ఆధారం కల్పించాలని, అమృత వర్షంకురిపించాలని మనఃపూర్వకంగా వేడుకుంటున్నాను.

ఈ కార్యక్రమాన్ని ముఖ్యంగా ఎంత త్వరితంగా చెయ్యగలిగితే త్వరితంగా చేస్తాము, సాగిస్తామని మీ అందరికి మనవిచేస్తున్నాను.

*1983 ఏప్రెల్ 27న చినముక్కపల్లిలో తెలుగుగంగ శంకుస్థాపన కార్యక్రమంలో*

# కార్మికజాతి ఆశాజ్యోతి మే డే

జాతీయాభివృద్ధికీ, దేశాభ్యున్నతికే శ్రమజీవులే ప్రధానమైన పునాది. ఉత్పత్తిని పెంచి, జాతి జీవన ప్రమాణాలు మెరుగుపరచటంలో వారి పాత్ర నిరుపమానమైనది. జాతిప్రగతికి వారే పట్టుగొమ్మలు. వారి శ్రమే వారి సంక్షేమానికి ప్రయోజనకారి కావాలన్నదే రాష్ట్రప్రభుత్వ దృఢ సంకల్పం. వారి శ్రమ దోపిడీకి గురికాకుండా చూడాలన్నది ప్రభుత్వ నిశ్చితాభిప్రాయం. ఇందుకోసం వారూ సంఘటిత శక్తిగా పోరాటం సాగించాలి. సమైక్యంగా ముందుకు సాగుతామన్న తమ ప్రతినను పునరుద్ఘాటించాలి.

సమాజంపై వెనకటిరోజుల్లో ఉన్న క్రీనీడలు క్రమంగా చెదరిపోతు న్నాయి. విజ్ఞానంద్వారా ప్రపంచవ్యాప్తంగా గల శ్రమజీవులు తమ అభ్యు న్నతికోసం సాగిస్తున్న మహోద్యమానికి, హక్కుల సాధనకోసం కార్మిక వర్గం శపథం చేసి సాగిస్తున్న పోరాటాలకు పర్వదినం ''మే డే''. సమ సమాజ స్థాపన కోసం ప్రపంచకార్మికులు ఆశతో జరుపుకునే పండుగ రోజు ''మే డే''.

దేశదేశాలలో గల కార్మికశక్తిని, ఏకత్రాటిపై సమీకరించుకుని, సంప్రదించుకుని శ్రమజీవుల జీవితాభ్యుదయంకోసం ముందుకుసాగే మంచి రోజు ''మే డే''. కార్మికవర్గం సంఘటిత శక్తిగా, సమైక్యశక్తిగా రూపొంది ఏకోన్ముఖంగా పోరాటపథంలో పయనించేందుకు జరుపుకునే నిండు పండుగ రోజు ''మే డే''. ఒకరినొకరు అర్థంచేసుకుని సమతాపథాన ముందుకుసాగే అవకాశాలు మెరుగవుతున్నాయి. కార్మికసోదరులు ఈ విషయాలను గమనించాలి. హక్కుల రక్షణతోపాటు తమ బాధ్యతలను కూడా గమనించి క్రమశిక్షణతో పారిశ్రామికాభివృద్ధికి దోహదంచేసి ఉత్పత్తులను పెంచాలి.

శ్రమకు తగ్గ విలువను ముట్టజెప్పే సమంజసమైన పారిశ్రామిక విధానాన్ని అమలు జరపాలన్నది ప్రభుత్వ ఆశయం. ఆనాడు ఇంతకన్నా

మంచి సమాజం ఏర్పడుతుంది. శ్రమజీవుల ఆర్థికాభ్యున్నతి, సంక్షేమం మా ప్రభుత్వ లక్ష్యం. వారి జీవితాలకు నూత్న వసంతం చేకూర్చాలని మా ఆశయం. సమాజప్రగతికి రెక్కలు ముక్కలు చేసుకునే కార్మికులు కడగండ్లు లేకుండా కమ్మగా బ్రతకాలని మా ఆకాంక్ష. అందుకోసం మా ప్రభుత్వం అనుక్షణం కృషిచేస్తున్నది.

స్వాతంత్ర్యం వచ్చి 35 సంవత్సరాలు గడిచినా ఇంకా 50 శాతం ప్రజలు దారిద్ర్యరేఖకు అట్టడుగున బ్రతుకుతున్నారు. ఈ పరిస్థితిని మార్చనంతకాలం సమసమాజాన్ని స్థాపించలేం. అందుకే నిర్మాణాత్మక కార్యక్రమాలను గ్రామీణ వ్యవస్థనుంచి ప్రారంభిస్తున్నాం. కిలో బియ్యం 2 రూపాయలకే అమ్మించినా, నిరుపేదలకు శాశ్వత గృహనిర్మాణ వసతి కల్పించినా, మంచినీటి పథకాలను అందరికీ అందుబాటులోకి తెస్తున్నా, మురికివాడల సముద్ధరణకు పూనుకున్నా అన్నీ శ్రమశక్తిమీద బ్రతికే పీడిత ప్రజానీకం కోసమే.

పరిశ్రమలలో శ్రామికులను భాగస్వాములుగా గుర్తించి గౌరవించటమే మా ప్రభుత్వ ధ్యేయం. సంపన్నులకు పెట్టడం మా ప్రభుత్వ ధ్యేయం కాదు. లేనివారిని, అవసరం ఉన్నవారిని ఆదుకోవటమే ప్రభుత్వం ఆశయం. ఎందరు ఎన్ని అనుకున్నా, ఎన్ని విపరీతార్థాలు కల్పించినా శ్రామికసోదరులందరూ మా ప్రభుత్వంపై ఉంచిన నమ్మకాన్ని ఎన్నటికీ వమ్ముచేయం. వారికిచ్చిన హామీలను పూర్తిగా పాటిస్తూ వారి సంక్షేమానికి త్రికరణశుద్ధిగా పాటుపడగలమని మరోసారి హామీయిస్తున్నాను.

పారిశ్రామిక శాంతిని పరిరక్షించుకుంటూ అన్ని రంగాలలో ఉత్పత్తులను ఇతోధికం చేయటానికి కార్మిక సోదరులంతా కలిసికట్టుగా కృషిచేయాలని విజ్ఞప్తి చేస్తున్నాను.

*1983 మే డే సందర్భంగా*

*హైదరాబాదులో .........*

# మన కార్యక్రమాలే మన నిజాయితీకి నిదర్శనాలు

మనకు ప్రాంతీయ ద్వేషం లేదు. ప్రాంతీయ భేదం లేదు. మనమంతా ఒక్కటే. తెలుగు జాతి ఒక్కటి. తెలుగువారు ఒక్కటిే. గతంలో ఈ విధంగానే విద్వేషాలు సృష్టించి స్వార్థపరులైనటువంటి రాజకీయనాయకులు ఎన్నో ఎన్నో ద్వేషభావాలు కల్పించారు. ఈనాడు అదృష్టవశాత్తు తెలుగు జాతి అంతా ఒక్కటిగా మెలుగుతున్నది. ఆరుకోట్ల ప్రజానీకం తెలుగు రాష్ట్రాభివృద్ధికి కంకణం కట్టుకొన్నది.

ఏవిధంగానైనా సరే ఎప్పటికైనా సరే ఆ జాతీయ విద్వేషాలుకాని, ఆ ప్రాంతీయ భేదాలుగాని మనలో రాకూడదని ఎప్పటికప్పుడు గతాన్ని విస్మరించి భవిష్యత్తుకు పూలబాట వేసుకుంటూ ముందుకుసాగాలని, సోదరులందరికీ నేను మనవిచేస్తున్నాను. అందుకే ఈనాడు ఆ ప్రాంతం, ఈ ప్రాంతం అనే భేదం లేకుండా ఎవరికైతే అవసరాలున్నాయో, ఎవరైతే త్రాగటానికి మంచినీరు లేక బాధపడుతున్నారో ఒకప్రక్క కృష్ణా, గోదావరి, తుంగభద్ర, పెన్నా, సువర్ణ ఇత్యాది నదీ జలాలున్నప్పటికీ ఇంకా గొంతుతడవక మండు టెండల్లో మండిపోతున్నారో అటువంటి సోదరులకు తాగటానికి గుక్కెడు మంచినీళ్లయినా అందించడం ధర్మంగా మన ప్రభుత్వం భావిస్తున్నదని నేను మనవిచేస్తున్నాను. అందుకే ఈనాడు ఇటువంటి కార్యక్రమాన్ని మీరందరూ ప్రభుత్వం పట్ల ఉంచిన విశ్వాసానికి ఒక ప్రతిరూపంగా మీకు నివేదనగా అందజేస్తున్నాను.

మనది వ్యవసాయం ముఖ్యంగా ఉన్నటువంటి రాష్ట్రం. ఈనాడు రైతు క్షేమంగా వుంటేనే కాని దేశానికి సంక్షేమం లేదు. రైతు, కార్మికులు, రైతు కూలీలు చిరునవ్వుతో ముందుకు నడిపిస్తేనేగాని ఈ దేశానికి మనుగడలేదు. అది నా నమ్మకం. అందుకనే ముఖ్యంగా

ఈనాడు పంటలు పండించి దేశానికింత కూడుపెడ్తున్న అన్నదాత రైతు సంక్షేమం కోరడం ప్రభుత్వ ధర్మంగా భావిస్తున్నాను. ఆ రైతును అంటిపెట్టుకుని ఆ రైతు నీడలో వెలుగుతూ దిన దిన గండంగా మండి పోయిన డొక్కలతో, ఎండిపోయిన శరీరంతో కొడుగుడులాడుతున్నటు వంటి కోటానుకోట్ల వ్యవసాయ కార్మికుల సంక్షేమం చూడడం కూడా ప్రభుత్వ ధర్మమని నేను విశ్వసిస్తున్నాను. ఈనాడు మనకున్నటువంటి వనరులన్నీ ఉపయోగించుకొని ఏ విధంగానైనా సరే మన రాష్ట్ర సమృద్ధిని సాధించడం ప్రభుత్వ లక్ష్యమని నేను నమ్ముతున్నాను.

ఈనాడు పరిశుద్ధమైనటువంటి పరిపాలన ప్రజలకందివ్వాలి. నీతి నిజాయితీతో ప్రభుత్వం వ్యవహరించాలి. ప్రజాక్షేమంకోసమే ప్రభుత్వాం పనిచేయాలి. ఇదే మా ధ్యేయం. మన ఆడబడుచులందరు ఎంతో ఆప్యా యతతో గెలిపించారు. వారిరుణం తీర్చడమెలాగు. ఈనాడు జనాభాలో యాభై శాతం ఉన్న ఆడబడుచుల సంక్షేమం చూడడం అవసరం. అదే మా ధ్యేయం. అందుకే పురుషులతోపాటు స్త్రీలకుకూడా ఆస్థిలో సమాన హక్కులు కల్పించడానికి ప్రభుత్వం నిర్ణయించింది. ఈనాడు వాళ్లకాళ్లమీద వాళ్లు నిలబడి, వారిజీవన విధానాలను వారు స్వతంత్రంగా సాగించుకోడానికి అవకాశం కల్పించాలనే ధ్యేయంతో మహిళా విశ్వవిద్యా లయం ప్రారంభించింది. ఇవన్నీ మా ఆడబిడ్డల సంక్షేమానికని, వారి రుణం తీర్చుకోడానికని సవినయంగా నేను మనవిచేస్తున్నాను.

ఈనాడు ప్రజలకు ప్రభుత్వానికి భేదంలేదు. దూరం లేదు. మేమందరం మీవాళ్లం, మీలో వున్నవాళ్లం, మీతో కలిసిమెలసి తిరగాలను కుంటున్నవాళ్లం. ఈనాడు అన్నీ వదులుకుని ప్రజలే మా ఊపిరిగా, దేశమే మా ధ్యేయంగా వచ్చినటువంటివాళ్లం. ఈనాడు ప్రభుత్వం మీది, మీరే ప్రభుత్వాన్ని నిర్వహిస్తున్న పాలకులు. ప్రజలే ఈనాడు పాలకులు. అదీ ప్రజాస్వామ్యానికి సరైన నిర్వచనం. అందరికీ సమానమైన అవకాశాలు ఇవ్వబడాలి. అందరికీ సమానమైన విద్యా విశేషాలు లభించేటువంటి విధానాలను ఆర్థిక సమానత్వాన్ని ప్రభుత్వాం సాధించాలి. అప్పుడుగాని సమసమానత్వం మనకురాదు. కబుర్లు పై నుండి చెపుతూ క్రిందున్నవాళ్లని ఆ మురికిగుంటల్లోనే, మురికివాడల్లోనే

వుంచడం న్యాయంకాదు. అదెప్పటికికూడా సమాజానికి మంచిదికాదు. ఇప్పటికే ఆలస్యమైనప్పటికీ తెలుగు జాతి కళ్లు తెరచింది. ఈనాడు వ్యర్థపు మాటలు చెప్పి, అబద్ధాలు చెప్పి జనసమూహాన్ని నమ్మించేరోజులు పోయాయి. ఏమైనాసరే మన కార్యక్రమాలే మన నిజాయితీని రుజువుచేయాలి. మన విధానాలే మన ప్రజాసేవకు నిదర్శనాలుగా వుండిపోవాలి. అందుకే ఈనాడు ఈ నల్గొండ జిల్లాకు ఈవిధంగా వనరులు కల్పించాలని ప్రభుత్వ సంకల్పం. ఈనాడు రాయలసీమ, తెలంగాణా రెండూ రెండు కళ్లు తెలుగుజాతికి. ఈనాడు మెట్ట ప్రాంతాలుగా వుండి త్రాగడానికి నీరందక—ఎదురుగుండానే కన్పిస్తూవున్నది కృష్ణానది—కాని పైకొచ్చే అవకాశంలేదు. అటువంటి అవకాశాలు కల్పించి మన తెలుగుతల్లిని సస్యశ్యామలం చేసి మల్లెపూలతో పరవళ్లుత్రొక్కేవిధంగా ఆరాధించుకోవడం తెలుగుజాతి కర్తవ్యం. అందుకే ఈరోజు ఈనాడు శ్రీశైలం ఎడమకాలువ రెగ్యులేటర్‌కు పునాది వేయడం జరిగింది. 3 లక్షల ఎకరాల సాగుబడికి ఈనాడు నాంది పల్కింది ప్రభుత్వం. ఇప్పుడుకాదు నాకు ఆనందం. ఈనాడు మీదేవరకొండ ప్రక్కనుండే ఆ కాలువ వెళుతుంటే, మీరందరూ ఆనీళ్లు త్రాగుతుంటే అది చూడాలి నేను. ఆరోజుకోసం ఎదురు చూస్తుంటాను. ఆనాడు మళ్లీ మీదర్శనం కోసం ఇక్కడికి వస్తానని నేను మీ అందరికి మనవిచేస్తున్నాను.

*1983 మే 7న దేవరకొండలో శ్రీశైలం ఎడమకాలువ రెగ్యులేటర్‌కు శంకుస్థాపన సందర్భంగా*

# కదలిక ప్రగతికి ఊపిరి

ఉత్తుంగ తరంగమై పరవళ్ళు త్రొక్కుతూ ఇరు ఒడ్డులను వొరిసి పారే జీవనది గోదావరి కూడా మొదట చిన్న సెలయేరులా ఉద్భవించినదే. యాభై సంవత్సరాల క్రితం ప్రస్తుతం ఆంధ్రప్రదేశ్ రోడ్డు రవాణా సంస్థగా వాసికెక్కిన ఈ సంస్థ కూడా ఒక చిన్న రవాణా సంస్థగా నిజాం రాష్ట్రంలో మొదలైన విషయం మీకందరికీ తెలుసు. ఆవగింజంతైన మర్రి విత్తనం నుండి మహావటవృక్షం పుట్టి పెరిగినట్లు అలనాటి ఆ చిన్న సంస్థయే ఈనాటి ఈ మహాసంస్థకు మాతృకని తెలుసుకోవడం చిత్రంగా అనిపించకమానదు. ఈ అభివృద్ధి వెనుక వేలాది కార్మిక సోదరుల కష్టం దాగివున్నది. వారంతా నిరంతరం చెమటోడ్చి శ్రమించి మూడు పువ్వులు, ఆరు కాయలుగా పెంచి పెద్ద చేసిన సంగతి మనమంతా ఒకసారి నిండు హృదయంతో కృతజ్ఞతాంజలులతో గుర్తుకు తెచ్చుకోవలసిన అవసరం వుంది. ఆ ఉద్యోగులు, ఆ కార్మికులే ఈ సంస్థకు వెన్నెముక, నవనాడులు, అండ దండ. ఈ శుభసందర్భంలో గత 50 సంవత్సరాలుగా ఈ సంస్థ అభివృద్ధికి దోహదం చేసిన, చేస్తున్న అశేష ఉద్యోగ బృందానికి, కార్మిక సోదరులకు నా హృదయపూర్వక అభినందనలు తెలియజేస్తున్నాను.

"గ్రామసీమల్లోనే వుంది ఈ జాతి జీవనం" అని చాటి చెప్పాడు పూజ్య బాపూజీ. కష్టిత ప్రజలు దుర్భర దారిద్ర్యంలో, అజ్ఞానంలో, అనారోగ్యంలో కొట్టుమిట్టాడుతూ ఆ మారుమూల గ్రామాల్లో నివసిస్తున్నారు. వారి బడుగు బ్రతుకులలో వెలుగులు నింపాలంటే, వారి జీవితాలలో నవోషస్సులు ఉదయించాలంటే, వారి భవితవ్యాన్ని బంగారు బాటలో తీర్చిదిద్దాలంటే ముఖ్యంగా కావలసింది రాకపోకల సౌకర్యాల పెంపు. రాకపోకల వల్లనే బయటి ప్రపంచంతో వారు సంబంధబాంధవ్యాలు పెంచుకోగలుగుతారు. అభివృద్ధి పథకాల ఆవశ్యకతను, ప్రాముఖ్యతను అవగతం చేసుకోగలుగుతారు. తాను అనుభవిస్తున్న దుర్భర దారిద్ర్యాన్ని



1984 ఫిబ్రవరి 2న హైదరాబాదు, జూబ్లీహాలులో
కలెక్టర్ల సమావేశంలో ప్రభుత్వ విధానాల వివరణ



సమావేశంలో పాల్గొన్న వివిధ జిల్లాల కలెక్టర్లు



తిరుపతిలో 1983 ఏప్రెల్ 14న పద్మావతీ మహిళా విశ్వవిద్యాలయానికి
ప్రారంభోత్సవం



శ్రీశైలం ఎడమ కాలువ ప్రధాన రెగ్యులేటరు నిర్మాణం పనికి
1983 మే 7న ప్రారంభోత్సవం

ఎలా పారద్రోలుకోవాలో, ఎలా అంచెలంచెలుగా అభ్యుదయపథంలో ముందుకు సాగాలో వారు తెలుసుకోగలుగుతారు. ఎండనక, వాననక, పగలనక, రేయనక పొలాలను హలాలతో దున్ని, మట్టి నుండి మాణిక్యాన్ని పండించే రైతన్న తన కష్టానికి తాను తగిన ప్రతిఫలం లభించక నిరాశ నిస్పృహలకు లోనవుతున్నాడు. ఈ పరిస్థితి నుండి అతన్ని తప్పించాలంటే అతని శ్రమకుతగిన ప్రతిఫలం లభించేటట్లు చూడాలంటే, తను పండించిన పంటను మార్కెట్లకు తీసుకొని వెళ్లి, తను కావాలనుకున్నప్పుడు, దానికి లాభసాటి బేరం తగలినప్పుడు తన పంటను తాను అమ్ముకోగలడన్న ధైర్యం అతనిలో కలిగించాలి మనం. సరైన రహదారి సౌకర్యాలు, రాక పోకల సౌకర్యాలు అతనికి లభించినప్పుడే ఇది సాధ్యం అవుతుంది. అందు వల్ల రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థ అభివృద్ధి రాష్ట్రంలో రవాణా సౌక ర్యాల అభివృద్ధితో ముడిపెట్టుకొనివుంది. ఈ రోజు మనకు కనపడు తున్న ఈ రోడ్డు రవాణా సంస్థ బస్సు కేవలం ఒక్క రవాణా సాధనం మాత్రమేకాదు. అది ఒక చైతన్య రథం. ప్రపంచం నలుదిక్కులా జరుగుతున్న విషయాలను నాలుగు పేజీలలోకి కుదించి సవ్యాఖ్యానంగా ప్రజలకు అందించే వార్తాపత్రికలను కూడా ఈ బస్సే గ్రామాలకు మోసు కొని వస్తుంది. రోగపీడితులై బాధపడుతున్న ఆర్తులకు తగిన చికిత్స చేసి, స్వస్థత చేకూర్చి తిరిగి నిండు ఆరోగ్యంతో తమ పనులను తాము నిర్వహించేటట్లు చూసే వైద్యుని, ఔషధాలను ఈ బస్సు పల్లెలకు చేరవేస్తుంది. కదలిక ప్రగతికి ఊపిరి అయితే ఆ కదలికకు జీవనాడి ఈ బస్సు.

అయితే ఇంత ప్రాముఖ్యత గల ఈ రవాణా సంస్థ ఇంతవరకు పని చేసిన తీరుతెన్నులను మనం ఈ రోజు సమీక్షించుకొని యింకా చక్కగా ప్రజలకు, మరింత ఉపయోగకరంగా, మరింత లాభసాటిగా ఈ నిర్వహ ణను కొనసాగించడం ఎలా అన్న విషయాన్ని పరిశీలించవలసిన అవసరం ఈనాడు ఎంతైనా వున్నది. ఒక్క బస్సుపెట్టుకొని ప్రయివేటు రంగంలో ఆపరేటర్లు లక్షాధికారులవుతున్న సమయంలో వేలాది బస్సులు నడిపే ఈ రోడ్డు రవాణా సంస్థ భారీ నష్టాలతో నడవడం ఎందువల్ల? ఈ ప్రశ్న మనకు మనమే వేసుకోవలసివుంది. ఇందుకు ఎవరో బాధ్యులని నేను వారిని నిందించడంలేదు. ఈ పరిస్థితిని చక్కదిద్ది ఈ సంస్థలో వస్తున్న

నష్టాలకు అడ్డుకట్టలు కట్టి లాభాలను పెంపొందించి ఈ సంస్థను సక్రమమార్గంలో నడిపించడానికి, ప్రజాసేవలో ఉత్తమ సాధనంగా దీనిని తీర్చిదిద్దడానికి ఈ సంస్థ ఉద్యోగబృందం, కార్మికసోదరులు కలిసి చిత్తశుద్ధితో, పట్టుదలతో గట్టిగా కృషి చేస్తున్న సంగతి నాకు తెలుసు. ఈ కృషి యిప్పటికే సత్ఫలితాలను యిచ్చిందన్న సంగతి కూడా నాకు తెలుసు. అంతేకాదు. ఈ కృషిని మరింత పట్టుదలతో, మరింత క్రమ శిక్షణతో, మరింత ఉత్సాహంతో మనం కొనసాగించవలసి వుందన్న సంగతి మీకు గుర్తు చేయవలసిన అవసరం లేదని అనుకొంటాను. ఈ మహత్తర కృషిలో మీరందరూ త్వరలోనే విజయాన్ని సాధించగలరని, భారీ నష్టాలతో నడుస్తున్న ఈ సంస్థ తొందరలోనే ఒక లాభసాటి వ్యాపారంగా మారి రాష్ట్రానికి వన్నె తెచ్చే వ్యవస్థగా రూపొందగలదని నేను ఆకాంక్షి స్తున్నాను.

ఈ స్వర్ణోత్సవాల సందర్భంగా బస్సు సర్వీసులను మెరుగుపరచి, మరింత సక్రమంగా, మరింత ప్రయోజనకరంగా వాటిని నిర్వహించే విషయంలో మీరందరూ సమాలోచన చేస్తారని, సత్వర చర్యలు తీసు కొంటారని నాకు పూర్తి విశ్వాసంవుంది. ముఖ్యంగా మనమందరం ప్రతి క్షణం గుర్తు చేసుకోవలసిన అంశం ఒకటివుంది. ప్రజాస్వామిక వ్యవస్థలో ప్రజలే పాలకులు. రైతే రాజు. శ్రామికుడే చక్రం త్రిప్పాలి. అందువల్ల మన బస్సులో ప్రయాణం చేస్తున్న ప్రతి వ్యక్తి మనకు అత్యంత గౌరవ నీయుడైన అతిథి. రాష్ట్ర రోడ్డు రవాణా సంస్థలో పనిచేసే ఉద్యోగులు— ముఖ్యంగా బస్ కండక్టర్లు, డ్రైవర్లు, ఇతర సిబ్బంది— ఈ అంశాన్ని ప్రతి క్షణం జ్ఞప్తికి వుంచుకోవాలని నేను కోరుతున్నాను. 'మడులు, మాన్యాల కన్నా మర్యాదగా మాట్లాడితే మిన్న' అన్న నానుడి మీకంద రికీ తెలుసు. గౌరవం యిచ్చి పుచ్చుకోవడం, మాట మన్ననతో ప్రయా ణీకులకు తలలో నాలుకలవలే మసలడం, మీకు, మీ సంస్థకు ఎంతో మంచి పేరును తెచ్చిపెడతాయి. సామాన్య మానవుడు చెమటోడ్చి సంపాదించిన ధనంలో టికెట్ రూపేణ యిచ్చే పైసలతోనే మనకు రవాణా సంస్థ వారు జీతాలు చెల్లిస్తున్నారన్న సంగతి, అది మన మను గడకు మూలధనమన్న సంగతి విస్మరించగూడదు.

కొన్ని కొన్ని సందర్భాలలో మన ఉద్యోగుల బృందం ప్రవర్తిస్తున్న తీరుపట్ల ప్రజలనుండి అనేక ఫిర్యాదులు అందడం నిజంగా దురదృష్ట కరం. ఇట్టి పరిస్థితులు తలెత్తకుండా ఉద్యోగ బృందం పూర్తి శ్రద్ధ తీసుకొంటారని, మనలో మనకు ఎన్ని సమస్యలున్నా వాటిని సరైన విధంగా మనం పరిష్కరించుకోవడం, తోటి ప్రయాణీకులతోటి మర్యాదగా మసలడం, వారి కష్టసుఖాల్లో పాలుపంచుకోవడం మన విద్యుక్తధర్మంగా అందరూ భావిస్తారని నేను ఆశిస్తున్నాను.

*ఆంధ్రప్రదేశ్ రాష్ట్రరోడ్డు రవాణాసంస్థ స్వర్ణోత్సవాల సందర్భంగా*
*1983 జూన్ 2వ తేదీన...*

# తెలుగుతల్లికి రక్తతిలకం దిద్దిన త్యాగమూర్తి అల్లూరి

జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపీ గరీయసి, ఇది ఈనాడు మనం నేర్చుకోవలసింది. సీతారామరాజుగారి పటాన్ని అడ్డంపెట్టుకొని మాట్లాడుకోవడంకాదు మన ముఖ్యోద్దేశ్యం. ఎప్పుడు జరిగింది ఈ విప్లవం? 1922—24 సంవత్సరాల మధ్య జరిగింది. ఎందుకు వెలిగింది అంత అఖండజ్యోతి ఆ సంవత్సరమున్నర కాలంలో? దానిలోఉన్న ఆవేశ మేమిటి? దానిలో ఉన్నటువంటి పరమార్థం ఏమిటి? ఆ మహానుభావుడు పొందిన ఫలితం ఏమిటి? మీకు తెలుసో తెలియదో—అన్నారు కొందరు ఆనాటి నాయకులు—అల్లూరు సీతారామరాజు అండ్ హిస్ ఫాలోయర్స్ ఆర్ నథింగ్ బట్ బాండిట్స్ అని. మన తెలుగువారే అన్నారు. సిగ్గుచేటు. ఏమిస్తారు దీనికి సమాధానం? ఏమి చెపుతుంది తెలుగు జాతి దీనికి సమాధానం?—అని అడుగుతున్నాను. మీ వాడిని నీవు గుర్తించలేవు. తెలుగుతనం చచ్చింది మనలో ఎప్పుడో. పుట్టింది ఆనాడే సమతా సిద్ధాంతం. పల్నాటి బ్రహ్మన్న కాలంలో చాపకూడు తిన్నారు అందరూ ఒక బంతిలో. అలనాడే వెలసిన సంస్కృతి ఏమైంది ఈనాడు మనలో. ఎక్కడుంది వీరావేశం తెలుగువారిలో. దేశాన్ని మర్చిపోయాము. జాతిని మర్చిపోయాము. డబ్బుతో చస్తున్నాం. రాజకీయ పరమార్థం అదేనని ఈనాడు మనం బ్రతుకుతున్నామని మీ అందరికి మనవిచేస్తున్నాను. ఎందుకోసమని బ్రతికాడు ఆ మహనీయుడు? ఎవరికోసం? అటవీజాతులకోసం. గుర్తుందా పెద్దలు మీ అందరికి ఈనాడు అటవీజాతులు ఏవిధంగా ఉన్నారు. మన్యం వెళితే తెలుస్తుంది. ఆదిలాబాద్ జిల్లా వెళితే తెలుస్తుంది. ఈ రోజున సామాజిక న్యాయం ఎక్కడున్నది మనదేశంలో. న్యాయదేవతకు మనమే కట్టాం కళ్లకుగంతలు. వినటానికి చెవులేకాని, చూడటానికి కళ్లులేవని చెప్పి ఈనాడు ఆ

అంధకారంలో అన్యాయాలుచేసి గడుపుతున్నాము. ఈనాడు సామాజిక పరమైనటువంటి న్యాయంకావాలి. న్యాయదేవతకు కట్టిన గంతలు విప్పదీయాలి. సమాజాన్ని చూచేటట్లు అవకాశం కల్పించాలి. నీముందున్న సమాజం ఏమిటి ఈరోజు. ఒక్కసారి కళ్లుతెరిచిచూడు కన్పిస్తుంది. అర్ధాకలితో అలమటిస్తూ, తినటానికి తిండిలేకుండా, కట్టడానికి బట్టలేకుండా, పిల్లలకు చదువు చెప్పడానికి యోగ్యత లేకుండా నూటికి యాభై శాతం ప్రజానీకం ఈనాడు దారిద్ర్యరేఖకు దిగువనే బ్రతుకుతుంటే ఏమిటి స్వాతంత్ర్యం వారికి ఇచ్చినది ? ఏమిటి స్వాతంత్ర్యం మనదేశానికి తెచ్చినది. మన పరిపాలనకంటే బ్రిటీషువారే బాగా పాలించారేమో అన్న గతాన్ని స్మరణకు తెస్తున్నటువంటి ఈ పరిపాలనా విధానం ఎంత సిగ్గుచేటుగా, అవమానకరంగా ఇంతకాలం సాగిందో ఒక్కసారి ఆలోచించమని సోదరులందరికీ నేను మనవి చేస్తున్నాను. కావాలి సామాజిక న్యాయం...న్యాయమంటే ఒక వర్గానిది కాదు. సమస్త ప్రజానీకానికి కల్గాలి న్యాయం. అవకాశాలు అందరికి కల్పించబడాలి. అదీ నిజమైనటువంటి ప్రజాస్వామ్యం. అటువంటి విధానం ముందుకు రావాలి. ఆనాడు వెలుస్తుంది ప్రగతి మన కళ్ల ముందు. సోదరులారా ఈనాడు సీతారామరాజుగారిగురించి ఆలోచించు కొనేటప్పుడు మంచి గురించి మాట్లాడుకోవడం మన ధర్మం కాబట్టి వారు ఏ విధమైనటువంటి నిస్వార్థమైనటువంటిత్యాగంతో దేశానికి మేలు కోరారో, మేలును ఆచరించడానికి ఆయన జీవితాన్ని ధారబోశారో అటు వంటి మహానుభావుని జయంతి సందర్భంగా కాస్తయినా స్వార్థం మానుకొని గతాన్ని గుర్తు తెచ్చుకొని మన జాతి పురోభివృద్ధిని లక్ష్యంగా పెట్టుకొని మన భవిష్యత్ కార్యక్రమాన్ని నిర్ణయించుకోవడం మన ధర్మం అని మనవిచేస్తున్నాను. ఈనాడు రాజకీయమంటే పదవులు కాదు. కుర్చీలలో కూర్చోవడంకాదు. అదికాదు ఆదర్శం. నీకున్న అవకాశాన్ని ప్రజలకోసం వినియోగించిననాడే నువ్వు నాయకుడవు అవుతావు. లేనినాడు గద్దె శాశ్వతంకాదు. నీ పదవి శాశ్వతంకాదు. పదవికి నీవల్ల గౌరవం కలగాలి. అటువంటి గౌరవాన్ని సాధించడానికి మానవుడు ప్రయత్నించాలని మనవిచేస్తున్నాను. ఎందరో ముద్దు బిడ్డలు తెలుగు తల్లి

బిడ్డలు త్యాగంచేశారు కనుకనే ఈనాడు మనం స్వాతంత్ర్యం వచ్చిందని కులుకుతున్నాము. కాని ఆ స్వాతంత్ర్యం ఎందుకు వాడుకొంటు న్నాము ? మన పొట్టలు నింపుకొనటానికి వాడుకుంటున్నాము. ఏ ప్రజ లయితే దారిద్ర్యరేఖకు దిగువన ఉన్నారో, వారి సంగతి మనకు కనిపించ కుండా ఇంతవరకు స్వార్థంతోనే గడుపుకుంటూ ప్రజాస్వామ్యాన్ని, ప్రజాసంక్షేమాన్ని విస్మరించి మన బ్రతుకులు బ్రతుకుతున్నాము కనుకనే ఈ దేశం ఈ విధంగా దురవస్థల పాలయిందని మనవి చేస్తున్నాను. లేకపోతే ఎక్కడున్నది ఈనాడు ఆర్థిక సమా నత్వం—సమాజంలో ? అహర్నిశలు కష్టించి, చమటోడ్చి నీకింత కూడు పెడుతున్న ఆ రైతు ఏ విధంగా ఉన్నాడు? రైతు కార్మికులు ఏవిధంగా ఉన్నారు? మురికివాడల్లో మురికిబ్రతుకే బ్రతుకుతూ అలో లక్ష్మణా అని ఆక్రోశిస్తూ దినం గడవక పిల్లల క్షేమం చూచుకోలేక వాళ్లు బ్రతుకుతుంటే ఈనాడు ఏ.సి. రూములో ఉండి పెత్తనం చేస్తు న్నాము మేము. నాయకుడు కింద గుడిసెలో ఉండాలి. వారి బ్రతుకులు తెలుసుకోవాలి. ఆనాడుగాని నిజమైన నాయకత్వం దేశానికిరాదు. అందుకే చెపుతున్నాను—మనకు కావాలి సామాజిక న్యాయం. న్యాయ దేవత యొక్క అసంతృప్తికర విధానాన్ని చూడాలి కళ్ళతో. చేయగల మహనీయులు న్యాయం చేయగల ధైర్యం, దమ్ముఉన్న తెలుగు మగాడు రావాలి నాయకుడుగా. అప్పుడు కలగాలి సామాజిక న్యాయం. మీకు హామీ ఇస్తున్నాను. ఉన్నది వదులుకొని వచ్చాను నేను ఇక్కడికి. ఎంత వరకు నా కోసం నేను బ్రతుకుతాను ? కనీసం కొంతయినా నా జాతికి పరమార్థత కల్పించాలనే ఉద్దేశంతో వచ్చాను. ఈ పదవికి ఎన్నిట్లో గౌరవం నేను చవి చూశాను. ఈనాడు వచ్చిన పరమార్థంవేరు. నాకు కావలసింది ఏమీ లేదు. నాకు కావల్సింది నా దేశం. ఆరుకోట్ల తెలుగువారియొక్క సంక్షేమం. ఏ కొద్దిమంది యొక్క ప్రయోజ నాలకో ఆరుకోట్ల తెలుగు ప్రజల సంక్షేమాన్ని వారు నా పట్ల, నా పార్టీపట్ల విశ్వాసాన్ని, నమ్మకాన్ని అమ్ముకొనేంత హీనుణ్ణి కాదని చెపుతున్నాను. పరిపూర్ణంగా ఈ బొందిలో ప్రాణం ఉన్నంతవరకు నా తెలుగుతల్లి గౌరవానికే నేను బ్రతుకుతానని మీకు హామీ ఇస్తు

న్నాను. ఏమైనాచేస్తే ఎవరు ఏమి అడ్డుకున్నా ఏమి కోసం వచ్చినా ఈనాడు పురజనులు నా పక్షాన ఉన్నారు. నన్ను కోరారు. కాబట్టి ఆ బలమే నాకు చాలు.

నేను అనుకొన్నటువంటి విప్లవాత్మక విధానాలన్నీ ప్రజా సంక్షేమంకోసం, పేదరికాన్ని నిర్మూలించటంకోసం, పేదవారి సముద్ధరణకోసం, శ్రామికులకోసం, కార్మికులకోసం, కర్షకులకోసమేనని సభాపూర్వకంగా పెద్దలకు నేను మనవిచేస్తున్నాను. ఇటువంటి కార్యక్రమంలో మీరు ఈనాడు నాకిచ్చినటువంటి ఈ ఆవేశపూరితమైనటువంటి బలాన్ని నేను ఊతగా పెట్టుకుంటాను, ముందుకు సాగుతాను. సోదరులందరూ ఇటువంటి మహత్తరమైన సీతారామరాజుగారి జయంతి సందర్భంలో ఇటువంటి దృఢ విశ్వాసాన్ని, దృఢ నమ్మకాన్ని, నాలో నేను కల్పించుకునే అవకాశం ఇచ్చినందుకు— ముఖ్యంగా మీ అందరికీ నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. ఎన్నో విగ్రహాలు పెట్టుకున్నాము. ఎంతమందినో పూజిస్తున్నాము. కావాలి ఒక వీరుడు. దేశంకోసం గుండెలో ఉన్న రక్తాన్ని చిందించిన ప్రతి రూపం కావాలి మనకు. ఈనాడు చూస్తే తెలిసింది సీతారామరాజు గారి స్వరూపం ఇదా అని. అది ఆరుకోట్ల ప్రజల సమక్షాన ఉంచటానికి ఒక నిలువెత్తు కాంస్య విగ్రహాన్ని నేను హైదరాబాదునగరంలో ఆవిష్కరిస్తానని నేను మనవిచేస్తున్నాను. అదే కావాలి మన ఆదర్శం. నీకోసం కాదు నీవు బ్రతికింది. నీవు కట్టిన కాషాయం నీకోసంకాదు దేశానికి. సర్వసంగ పరిత్యాగంచేసిన మహనీయుడు తెలుగువాడని ప్రతి ఒక్కడు కూడా గుండెమీద చరుచుకుని తెలుగుజాతి కీర్తిని, ప్రతిష్ఠను పునశ్చరణ చేసుకొనే విధంగా నేను ఆ విగ్రహాన్ని నిర్మిస్తానని మనవి చేస్తున్నాను. ఎన్నో పనులు చేస్తున్నాము. ఎంతో ఖర్చులు ఉన్నాయని చెప్పుకుంటున్నాము. అయినా మంచికి మంచితనానికి మనకున్నటువంటి స్థితిని వాడుకోవడం అది ఒక పరమార్థమైన విషయం అని నేను గుర్తుకు తెచ్చుకుంటూ ఈనాడు అల్లూరి సీతారామరాజుగారి సోదరులు సత్యనారాయణరాజుగారు అంతటి అన్నను పోగొట్టుకొని ఇంతటి పేదరికంతో ఉన్నాడు కనుక ఉడతాభక్తిగా ఏదైనా సరే దేశానికి,

ప్రజలకు, తెలుగు తల్లికి చేసిన సేవలను గుర్తించి, మానవతా విలువలను మనస్సులో ఉంచుకొన్న మనిషిగా, తెలుగు తల్లి బిడ్డగా, మీ వాడిగా ఈ సందర్భంగా నెలకు రు. 500 లు వారి కుటుంబానికి ఈ సభాముఖంగా అందజేస్తానని ప్రకటిస్తున్నాను.

*1984 జూలై 4న అల్లూరి సీతారామరాజు జయంత్యుత్సవంలో*

# చేయవలసింది ఇంకెంతో వుంది

తెలుగుజాతి ఏనాటిది ? శాతవాహనుల నాడే తెలుగువారి పరిపాలనా దక్షత ఈ దేశం నలుచెరగులా చెరగని ముద్రలు వేసింది. కాకలు తీరిన కాకతీయుల కరవాలాల ఖణఖణలు తెలుగునాట ప్రతిచోట ప్రతిధ్వనించాయి. తెలుగువారి కీర్తిచంద్రికలు పున్నమితో పరిమళించి గుబాళించాయి. సస్య శ్యామలమై, సౌభాగ్యనిలయమై, సుఖసంతోషాలకు ఆలవాలమై అలరిన తెలుగుజాతి యశోప్రాభవం సరిహద్దులు దాటి, సాగర తీరాల నధిగమించి— సుదూర ప్రాంతాలకు విస్తరించింది. తెలుగునేలపై పూచి, నవ్యతతో కొంగ్రొత్త రీతులతో పరిఢవిల్లిన తెలుగువారి కళావైదుష్యం వెలుగు పందిళ్లు వేసి దశదిశలా యశఃకాంతులు విరజిమ్మింది. విజయనగర రాజ వీధులలో రత్నాల రాసుల బేహారు నడిచిందట ఆనాడు. ఆత్మతృప్తికి, వేదాంత విజ్ఞాన విశేషాలకు లోటు లేకుండా, కలిమికి, బలిమికి కొరత లేకుండా బ్రతికారు అలనాడు మనవారు. సాటివారికి సైదోడన్నారు. సోదరభావం, సర్వమత సహనం చూపారు. పలనాటి బ్రహ్మన్న చాపకూడు తిన్న సమాజం సర్వమానవ సమానత్వానికి సోపానం—కన్నమదాసును కన్న వానిగా దత్తత చేసుకున్న ఆ నాయని ఉదాత్తత ఆనాడే కులమత వ్యవస్థ లను అధిగమించి నింగికెగసిన తెలుగునాటి సర్వజ్ఞత.

అంతా గత చరిత్ర. ఆ పవిత్ర చరిత్రకు సంప్రదాయాలకు ఈనాడు మనం వారసులం.

కాని నేటి సమాజాన్ని చూస్తే—మన ముందు నగ్నంగా కనిపించే దృశ్యాలను పరిశీలిస్తే ఏమిటి మనకు గోచరించే సత్యం ?

తినడానికి తిండి లేక, కట్టడానికి బట్ట లేక మాడే కడుపులతో, మండే గుండెలతో, అన్నమో రామచంద్ర అని అలమటించే లక్షలాది పేద ప్రజలా ?

గిట్టుబాటు ధరలు లభించక, శ్రమకు తగిన ఫలితం దొరక్క, బిడ్డ లకు చదువు సంధ్యలు చెప్పించుకోలేక అహర్నిశలు రెక్కలు ముక్కలు

చేసుకుంటూ, మారుమూల గ్రామాలలో కనీస ప్రాథమిక సౌకర్యాలకు కూడా నోచుకోని రైతన్నలా—

కండలు కరిగించి, రక్తాన్ని చెమటగా మార్చి నిరంతరం శ్రమిస్తున్నా పొట్ట గడవక, దారీ డొంక తెలియక, బ్రతుకు భారం మోస్తూ, సుఖమన్నది పగటి కలగా పస్తులే నిత్యసత్యంగా రక్తాశ్రువులతో మురికి కూపాలలో చేయని పాపాలతో, తీరని శాపాలతో మగ్గుతూ చావలేక బ్రతుకుతున్న కార్మిక, శ్రామిక సోదరులా ?—

నిస్పృహ, నిరాశ, దారిద్ర్యం, అనారోగ్యం, అజ్ఞానం మొదలైన సాంఘిక దురాచారాలకు బలై రవ్వంత వెలుగుకోసం కొండంత ఆశతో అలమటించే లక్షలాది హరిజన, గిరిజన వెనుకబడిన ప్రజా సందోహమా?

వచ్చిన మన స్వాతంత్ర్యం వీరికి ఏం తెచ్చింది ? ఏమిచ్చింది? ఏమి కట్టబెట్టింది? ఏమి ఒరగ బెట్టింది?

ఈ దురదృష్టకర పరిస్థితి ఇక సాగరాదు. ఈ వ్యవస్థ ఇకపై సాగబోదు. దీని పర్యవసానమే అలనాటి నుంచి తెలుగునాట తిష్ట వేసుకొన్న పాలక వ్యవస్థ బదాబదులు కావడం. ప్రపంచ చరిత్రలోనే అపూర్వంగా, ఆదర్శప్రాయంగా నూతన ప్రభుత్వాన్ని ప్రతిష్టించి నవ్యతకు నాంది పలికి మహోజ్వల చరిత్రను సృష్టించారు తెలుగువారు. ఎంతో ఉద్వేగంతో, ఉత్సాహంతో, ఉల్లాసంతో ముందుకు నడిచింది యువశక్తి. అనురాగాలే వెల్లువగా, ఆశీర్వచనాలే పూలజల్లుగా, మంగళహారతులతో నివాళులిచ్చింది తెలుగింటి ఆడపడుచుల వాత్సల్యం. పొంగిన ఉత్తుంగ తరంగమై అధికార బాధ్యతలను అప్పగించింది, తెలుగుదేశం ప్రభుత్వానికి తెలుగు ప్రజానీకం, ఎందుకు?

వారి ఆశలను, ఆకాంక్షలను సఫలంచేసి సంక్షేమ కార్యక్రమాలతో అన్నిరంగాలలో ఆంధ్రప్రదేశ్‌ను ఆసేతు హిమాచలానికి ఆదర్శం చేయాలని—

దారీ తెన్నూ తెలియక, జీవిత నిరాశలతో అంధకారంలో అట్టడుగున మగ్గుతున్న బడుగువర్గాలకు క్షేమం జరగాలని—

ఉషఃకాంతులే సోకని ఆ బక్క బతుకులలో, బడుగు జీవితాలలో వెలుగు సుంతైనా నింపాలని—నారి తరతరాల కన్నీటి గాథలను ఆదరంతో తుడిచివెయ్యాలని—

అందుకే ఆ బాధ్యతలతోనే ప్రజలలో ఒకరమై, సామాన్య మానవుల ప్రతినిధులమై గ్రామాభ్యుదయ కార్యక్రమాలు చేపట్టడం జరిగింది. కిలో బియ్యం రెండు రూపాయలకు పేద ప్రజానీకానికి అందించడానికి ప్రయత్నం చేసినా—

అహర్నిశలు రెక్కలు ముక్కలు చేసుకోవడమే గాని పొద్దుండగా పిల్లల క్షేమం చూసుకోలేని పేదవారి పిల్లలకు మధ్యాహ్న భోజన పథకాన్ని నిర్వహించడానికి ఉపక్రమించినా—

తలదాచుకోడానికి నీడైనా లేని అభాగ్యులను శాశ్వత గృహ నిర్మాణ పథకాలతో సమాదరించడానికి ప్రయత్నించినా—

ఈ కార్యక్రమంలో ఒక భాగం మాత్రమేనని మనవిచేస్తున్నా. చేయవలసింది యింకెంతో వుంది. నారి జీవితాలలో వెలుగు నింపి సమాదరణతో ఆదరించి, మన సమాజంలో, ఈ ప్రజాస్వామ్యయుగంలో—సమ భాగస్తులుగా, సమానావకాశాలు అందించి, చేయూతనిచ్చి మనతోబాటు నడిపించిననాడుగాని నిజమైన మానవాభ్యుదయం జరుగదని నా విశ్వాసం.

ఈనాటికి కూడా పారిశ్రామిక రంగంలో, వ్యావసాయిక వ్యవస్థలో సంతృప్తికరమైన ప్రగతిని సాధించలేకపోయిన ప్రస్తుత పరిస్థితిని చక్కబరిచి రాష్ట్రాభివృద్ధిని, దేశ సమృద్ధిని సాధించడం ప్రభుత్వ ధ్యేయం.

ఆర్థికపరంగా వ్యక్తి ఆదాయాన్ని పెంపొందించి ప్రతివారికి సంతృప్తికరమైన జీవనాన్ని ప్రసాదించడం ప్రభుత్వ ఆదర్శం.

మధ్యవున్న దళారీలను, స్వార్థపరులైన దుష్టశక్తులను అడ్డు తొలగించి వుత్పత్తిదారులకూ వినియోగదారులకూ సూటిగా సమన్వయం సమకూర్చటమే ప్రభుత్వ లక్ష్యం.

అర్హతకు ప్రోత్సాహం లభించక విజ్ఞానం కుంటువడుతున్న, మేధస్సు కొడిగట్టిపోతున్న ఈ సమాజంలో దుస్సంప్రదాయాలను తుదముట్టించి అర్హతకు తగినంత ప్రోత్సాహం కలిగించడం ప్రభుత్వ నిర్ణయం.

లంచగొండితనం, దళారీవిధానం, అవినీతి నిర్మూలించి స్వచ్ఛమైన పరిపాలన ప్రజలకందించడం ప్రభుత్వ విధానం.

ఎంత అవసరమున్నా, ఎన్ని యిబ్బందులున్నా ఈనాటి రాష్ట్ర ఆర్థిక పరిస్థితిని గుర్తించి, సమాజపరమైన అవసరాలను అవగాహన చేసుకొని, సమభావంతో, సహకారంతో, సహృదయంతో, సహనంతో, త్యాగంతో ఉద్యోగ సోదరులు ప్రభుత్వంతో సహకరించాలని మరొక్కసారి అర్థిస్తున్నాను.

"సొంత లాభం కొంత మానుకు
పొరుగు వాడికి తోడుపడవోయ్

..........................

దేశమంటే మట్టి కాదోయ్
దేశమంటే మనుషులోయ్"

అన్న మహాకవి గురజాడ సూక్తిని మననం చేసుకొని, వాక్కులోనే కాదు—ఆచరణలో సయితం ఈ సత్యాన్ని కొంతవరకైనా కనపరచడం మన ధర్మమని వినయపూర్వకంగా మనవిచేస్తున్నాను.

అందరి మేలు గమనించడంలోనే మన మేలు కూడా వుందని నా తాత్పర్యం.

ఆరుకోట్ల ప్రజా సంక్షేమం మాకు ధ్యేయం. అందరి క్షేమాన్ని గుర్తించి వర్తించడమే ప్రతి వొక్కరి కర్తవ్యమని నా పరిపూర్ణ విశ్వాసం.

ప్రతిక్షణం ఆదేశాలను అందించే మహత్తరమైన శక్తిగా, నా మనుగడకు ఊపిరి పోసే జీవగర్రగా నా పురోగమనకు వెలుగుబాటలు తీర్చిదిద్దే నిర్దేశకులుగా, మీ వాడిగా, మీ సేవకై సర్వం త్యాగం చేసిన తెలుగు వాడిగా, మీ ఆజ్ఞలకు ఎదురు చూస్తుంటాను. వాటిని పొదలదాల్చడమే నా ప్రథమ కర్తవ్యమని భావిస్తున్నాను. ధర్మ నిర్ణేతలు, న్యాయ నిర్ణేతలు ప్రజలే.

ఆకాశవాణి, దూరదర్శన్‌ల ద్వారా జూలై 15, 1985 న
చేసిన విజ్ఞప్తి నుండి

# సమ సమాజనిర్మాణానికి ప్రగతి పథం

''జననీ జన్మ భూమిశ్చ
స్వర్గాదపీ గరీయసీ''—
తెలుగు తల్లీ! నీకు నా అంజలి!
ఈ స్వాతంత్ర్య శుభదిన
వినమ్రాంజలి!

ఆరుకోట్ల తెలుగన్నలకు, తమ్ములకు, ఆడపడచులకు, చిరుపాపలకు, పండిన పెద్దలకు, తలపండిన పూజ్యులకు నా హృదయ పూర్వక నమస్సుమాంజలి!

ఆగస్టు 15—అందరికీ పండుగ, ఆ సేతు హిమాచలానికి ఆనవమాన పర్వదినం. ఎన్నో త్యాగాలతో, మరెంతో దీక్షతో, రక్తతర్పణం చేసి సాధించుకున్నది భరత జాతి స్వాతంత్ర్యం.

కాలపుటలపై చెరగిన రక్తాక్షరాలతో లిఖించబడే మహత్తర స్వాతంత్ర్య సమర చరితకు చరితార్థత ప్రసాదించిన యీ శుభదినాన గుర్తుకు తెచ్చుకుందాం ఆనాటి మేటి స్వాతంత్ర్య సమర వీరులను కృతజ్ఞతాంజలి ఘటించి — ఒకసారి.

సత్యాగ్రహ సమరాన్ని నడిపాడు పూజ్యబాపూజి—సత్యం, అహింసలే ఆయుధాలుగా, రవి అస్తమించని బ్రిటీషు సామ్రాజ్య సింహాన్ని జూలు పట్టి అదలించి, పిదలించి మాతృభారతి దాస్య శృంఖలాలను భళ్లున తెగనరికిన ఆ జాతిపితకు అర్పిద్దాం నేడు మన శ్రద్ధాంజలి.

రౌద్రం తొలికించి రక్తం చిందించి అమ్మపాదాలకు రుధిరాభిషేకం చేసిన అలనాటి ఉగ్రవీరులు గదర్ ఉద్యమ నేతలకు సమర్పిద్దాం బాష్పాంజలి.

తలకు ముసుగు తగిలించి, మెడకు ఉరిత్రాడు బిగించి — నీ తుది కోరిక ఏమని అడిగితే "ఇంక్విలాబు జిందాబాద్"—అని దిగ్దిగంతాలు మార్మోగేలా నినదించిన విప్లవ వీరుడు సర్దార్ భగత్‌సింగ్‌ను స్మరిద్దాం పుష్పాంజలిఘటించి.

మధ్యందిన భానుడిలా మన్యంలో మెరసి, అడవులలో యిడుములలో అలమటించే ఆటవికులను సంఘటితపరచి ఒక్కొక్కని ఒక్కొక్క కొదమ సింగంలా తీర్చిదిద్ది తెల్లదొరల గుండెల్లో నిదురించిన తెలుగుతల్లి అనుగు బిడ్డడు అల్లూరి సీతారామరాజుకు అర్పిద్దాం గుండెలనిండుగా స్మృత్యంజలి.

'స్వాతంత్ర్యం నా జన్మహక్కు'—అని గర్జించిన లోకమాన్య తిలక్, శాంతిదూత, నవభారత నిర్మాత, జవహర్‌లాల్—, ఆజాద్‌హింద్ ఫౌజును నిర్మించి ఢిల్లీఛలో అని నినదించి, ఎర్రకోటను కైవసం చేసుకొనటానికి ఎంతో సాహసంలో సాయుధ పోరాటం సల్పిన నేతాజీ సుభాశ్చంద్రబోస్, ఉక్కుమనిషి సంస్థానాల విలీనకర్త సర్దార్ వల్లభాయిపటేల్, సాధుశీలి మౌలానా అజాద్, జై జవాన్, జై కిసాన్ అన్న నినాదమిచ్చిన లాల్‌బహదూర్, ఆగస్టు విప్లవానికి అలంబన లోకనాయక్ జయప్రకాశ్, గుండెలను తుపాకీ గుండ్లకెదురొడ్డిన ఆంధ్రకేసరి ప్రకాశం, చీరాల—పేరాల సత్యాగ్రహసారథి ఆంధ్రరత్న దుగ్గిరాల, దేశభక్త కొండా వెంకటప్పయ్య, దేశోద్ధారక నాగేశ్వరరావు, రైతు బాంధవుడు ఆచార్యరంగా, వారు, వీరని ఏమిటి, ప్రతివారు ఒకరోజు స్వాతంత్ర్య సమరంలో అగ్రగాములై నిలిచారు మనందరిముందు. వారందరకూ నమోవాకాలు.

1947 ఆగస్టు 15న స్వాతంత్ర్య భానుడుదయించినా, ఆ లేత కిరణాలు సోకని చీకటి గూడుల్లా వుండిపోయాయి నైజాం వంటి సంస్థానాలు. అందుకే ఆపైన గూడా సాగింది తెలంగాణాలో స్వాతంత్ర్య సమరం! పార్టీ సిద్ధాంతాలు ప్రక్కకు నెట్టి—రాజకీయాలు అవల బెట్టి—అందరూ ఒక్కటై నిలిచారు నియంతృత్వ సంస్థానాధిపత్యాన్ని తుడిచి పెట్టటానికి—

రెచ్చిన రజాకార్ దురంత దారుణ హింసాకాండతో రేగిన ప్రచండ తెలంగాణా సమరంలో పెదబొబ్బ పెట్టింది తెలుగు జాతి 'స్వతంత్రం మా జన్మహక్కు'ని—జాతీయతా భావ ప్రబోధనికై, సంస్థాన విమోచనకై నడుంకట్టిన నాయకులు—

స్వామి రామానంద తీర్థ, సురవరం ప్రతాపరెడ్డి, మాడపాటి హనుమంతరావు, జమలాపురం కేశవరావు, బూర్గుల రామకృష్ణారావు, కొండా వెంకటరంగారెడ్డి, రావి నారాయణరెడ్డి, మగ్దుం మొహియుద్దీన్, బద్దం ఎల్లారెడ్డి, షోయబుల్లాఖాన్ వంటి యోధానుయోధులెందరో—వారందరకూ మన నమస్సుమాంజలులు—

వారందరి మహత్తర త్యాగాల ఫలితం—మన స్వాతంత్ర్యం. అయితే జనం ఆశించిందేమిటి ? అందుకొన్నది ఏమిటి ?

గుండెలనిండా గుబులు నింపుకొని, కన్నుల నిండా కన్నీరు తొణకిసలాడుతూ కష్టాలలోనే కాలం వెళ్లబుచ్చే కష్టజీవులు అడుగుతున్నారు—ఇదేనా స్వాతంత్ర్యం అని.

కండలు కరిగించి, ఎండకు ఎండుతూ వానకు తడుస్తూ రక్తాన్ని చెమరిస్తూ కూడా నోటికి గుక్కెడు గంజికి నోచుకోని లక్షలాది కార్మిక సోదరులు అడుగుతున్నారు 'ఇదేనా స్వాతంత్ర్యం' అని. తినటానికి తిండిలేక కట్టుకున్న పాత—పాపం, ఏ పాతకాలం నాటిదో—ఆ పాతలోనే రోతగా బ్రతుకీడుస్తూ సామాజిక న్యాయానికి వెలియై, సాంఘిక దురాచారాలకు బలియై ఆక్రందించే ఆడపడచులు అడుగుతున్నారు—'ఇదేనా స్వాతంత్ర్యం' అని.

ఆలనా పాలనా లేక, అధోగతిలో అంధకారంలో అజ్ఞానంలో రొంపిలో రోతలో బిక్కు బిక్కు మంటూ బిత్తరపోతూ అలమటించే చిరుబిడ్డలను, చిన్నారులను చూసి సిగ్గుపడుతోంది స్వాతంత్ర్యం—'నా ప్రభావం యింతేనా' అని.

ఎవరికి వచ్చింది స్వాతంత్ర్యం ?

స్వార్థం పేరుకొని పోయిన లంచగొండితనానికా? ప్రజా సంపదను, శ్రమజీవుల శక్తిని కాకుల్లా, గద్దల్లా, రాబందుల్లా తన్నుకపోయే మధ్య దళారీలకా? మిలమిలలాడే రొక్కానికి అమ్ముడుబోయిన మానవత్వానికా? ఎవరికి వచ్చింది స్వాతంత్ర్యం? ఏమంటారు?

. మీరే చెప్పాలి దీనికి జవాబు.

అర్థం కాని అంధకారంలో వెలుతురుకోసం వెతుక్కుంటున్న మీ ప్రతినిధిని నేను. మోడువారిన పేదల బ్రతుకుల్లో పన్నీరు చల్లాలని, కష్టజీవుల గాయాలను కన్నీళ్లతోనైనా కడగాలనీ, రైతన్నల సంక్షేమం, కార్మిక సోదరుల అభ్యున్నతి, ఆడపడచుల అభ్యుదయం నా చేతిమీదుగా జరగాలని, స్వాతంత్ర్యానికి సరయిన నిర్వచనం ఏనాటికైనా నా తెలుగు నాటికి నేను యివ్వాలని నా ప్రయత్నం. అనాడే నా శ్రమకు అర్థం. అప్పుడే అన్నగా నా పెద్దరికం నిలబెట్టుకోగలిగేది. అందుకే యీ తాప త్రయం. అందుకే ఈ ప్రస్థానం.

ఈ అనుచరణలో భాగమే—తలదాచుకోడానికి నీడైనా లేని నిర్భాగ్యు లకు శాశ్వత గృహనిర్మాణ పథకం. ఈ ఆచరణలో భాగమే రేపవలు రెక్కలు ముక్కలు చేసుకున్నా కన్నపట్టికి పట్టెడన్నం పెట్టుకొనోచుకోని పేద పిల్లలకు ఉచిత మధ్యాహ్న భోజన పథకం.

ఆ కార్యక్రమంలో మరో భాగమే—ఆకలి డొక్కలతో పూటకు టికాణా లేక దారిద్ర్యరేఖకు దిగువన భారంగా బ్రతుకులీడ్చే బడుగు వర్గాలకు కిలో బియ్యం రెండు రూపాయలకు అందించాలన్న తాపత్రయం. ఈ ఉత్కర్షలో భాగమే కన్నవారి ఆస్తిలో కొడుకులతోపాటు ఆడపడచులకు కూడ సమాన హక్కులు కల్పించాలన్న ధ్యేయం. నిరుద్యోగ రక్కసిని నిర్మూలించడానికి, యువతలో పేరుకుపోయిన నిరాశా, నిస్పృహలను తొలగించటానికి, ఉత్పత్తులకు సరయిన కిమ్మత్తును రైతన్నలకు లభింపజేయటానికి, మేధస్సు కొడిగట్టిపోతున్న ఈనాడు అర్హతకు ఆదరణ కల్పించటంకోసం చదువులను సంతలో తాకట్టుపెట్టే దౌర్భాగ్య విధానానికి స్వస్తి చెప్పటానికి ముందంజ వేస్తున్నది యీ ప్రజా ప్రభుత్వం.



కర్నూలుజిల్లా పాణ్యంలోని ఇందిరా కాలనీలో 1983 జూలై 6వ తేదీన
కిలో 2 రూ.ల బియ్యం పంపిణీ పథకానికి ప్రారంభోత్సవం



ఖమ్మంజిల్లా మధిరలో 1984 ఏప్రిల్ 25న బలహీనవర్గాలకు రుణాలు పంపిణీ



ఆదిలాబాదు జిల్లా గిరిజనులకు 1983 మే 11న వస్త్రాల పంపిణీ

పసపోయిన డిగ్రీలను పంచే పసివాడిన విద్యాపీఠానికి నూతన జీవితం పోసిన వృత్తి విద్యలకు ప్రాధాన్యం కల్పించాలనీ, ఆధారంలేని ఆడ పడుచులకు యింత ఆదరువు కల్పించాలనీ, జీవితం గౌరవంగా గడుపుకొనే అవకాశం అక్కాచెల్లెళ్లకు ఏర్పరచాలని నేను కన్న ఎన్నో కలలకు ప్రతి రూపమే నేటి పద్మావతి మహిళా విశ్వవిద్యాలయం. అధికార వికేంద్రీకరణతో పరిపాలన వ్యవస్థను ప్రజలకు దగ్గరగా, మరింత దగ్గరగా చేసి గ్రామా భ్యుదయ కార్యక్రమాలకు నూతన స్ఫూర్తిని కల్గించాలన్న ప్రయత్నమే నా మస్తిష్కంలో మథింపబడుతున్న మాండలిక నూతన వ్యవస్థీకరణ విధానం.

ఇరుగు పొరుగును మరవకుండానే మనవారికింత మేలు చేయడం మన ధర్మం. అందుకే అలనాటి భగీరథ ప్రయత్నాన్ని తలపిస్తూ, మరపిస్తూ నింగి కెగిసిన వరవడిలో శ్రీశైల మల్లికార్జునస్వామి శిరోవేష్టంలో చిందు లాడుతున్న తెలుగుగంగను రాయలసీమ మాగాణంలో మధించి, మదరాసు వాసుల దప్పితీర్చే ప్రయత్నం మన మానవతా దృక్పథానికి ప్రతిబింబం.

లక్ష్మీ సరస్వతుల కేరింతల్లో శ్రీశైలం కుడి, ఎడమల స్రవంతుల్లో జీటలు వారిన ఎండు భూములు నిండగా పండగా పచ్చటి పైరులతో కళ కళలాడే, అరవిచ్చిన ఆనందంలో తొణికిసలాడే మన తెలుగుతల్లిని చూడా లన్న ఆశలు ఎన్నో, ఎన్నెన్నో వున్నాయి ప్రభుత్వానికి.

ఎప్పుడో, గోదావరిని కృష్ణమ్మతో కలిపేది ఎప్పుడో, పోలవరం తెలుగు వారికి దేవుడిచ్చిన వరంగా ఒక మహదానంద సాగరంగా రూపొందే శుభ దినం ఎప్పుడో, పండిన ఆశలతో గుండెల నిండుగా కన్నుల పండువగా తెలుగుజాతి హసించి పరవసించేది ఎప్పుడో, దానికే నా ప్రయత్నం. అందుకే యీ పయనం.

ఆరుకోట్ల తెలుగువారం. 12 కోట్ల చేతులు కలసిన కృషితో దింపగలం, ఆ దివినే భువికి. అందరం అందుకే కలిసి ముందుకు నడుద్దాం. భుజం, భుజం కలిపి సాగుదాం. ఈ ప్రయత్నంలో విజయం తథ్యం!

ఈ స్వాతంత్ర్యదినం అందరికీ పండుగై, ఆనందదాయకమై, భావి మానవ కళ్యాణ సంధాయకమై, సమసమాజ నిర్మాణానికి ప్రజాహితానికీ, ప్రగతిపథం చూపాలి వెలుగుదివ్వె పట్టాలి—అని కోరుకుంటున్నాను.

గుండెల నిండుగా, మీ వాడిగా తెలుగువాడిగా మీ ముందు వినమ్రతతో, చిత్తశుద్ధితో మరోసారి ప్రమాణం చేస్తున్నాను—ఈ నా శేష జీవితం తెలుగు జాతికే, తెలుగువారికే, తెలుగువారి సేవకే అంకితమని.

*1983 ఆగస్టు 15న స్వాతంత్ర్య దినోత్సవం సందర్భంగా పెరేడు గ్రౌండ్స్‌లో*

# ప్రతిమానవుడికీ కావాలి స్వాతంత్ర్యం

ఆరుకోట్ల అశేష తెలుగు ప్రజావాహినికి నా స్వాతంత్ర్య శుభాభినందనలు.

ఇది భారత జాతి మరువలేని శుభదినం. భరతమాత సంతానం ఎన్నో త్యాగాలతో, మరెంతో దీక్షతో, త్యాగనిరతితో రక్త తర్పణం చేసి సంపాదించుకున్న పర్వదినం. కాలపుటలపై సుస్థిరంగా, చారిత్రాత్మకంగా చెరగని రక్తాక్షరాలతో లిఖించబడిన సుదినం. స్వాతంత్ర్యపు పౌరసత్వపు పరమార్థాన్ని ప్రాణప్రదంగా కాపాడుకొంటూ, సాటి దేశాలతో పోటీగా దీటైన స్వేచ్ఛా వాయువులు పీల్చగలిగిన దినం. ప్రపంచ మానవ సమాజంలో మేమూ మనుష్యులమే అని ఉబికిన గుండెతో, పెల్లుబికిన ఆవేశంతో తలయెత్తి తొడచరిచి అలనాటి పలనాటి వీరగాథలు, బొబ్బిలి పులి గాండ్రింపులు, కాకతీయుల విచ్చు కరవాలాల కణకణలు, వెల్లువలా పొంగి పొరలే తుంగభద్రా వీచికలలో మిళితమై మధురంగా, సుమధురంగా వినిపించే విజయనగర కవితా స్రవంతులు మరొక్కసారి గురుతుకు తెచ్చుకున్న రోజు. రక్తతర్పణంతో తెలుగు తల్లి పాదాలకు పారాణి దిద్ది, అమ్మను బంధించిన బానిస శృంఖలాలను భళ్ళున తెగనరికిన రోజు. 'స్వాతంత్ర్యం మానవ హక్కు' అని నినదించి నిరంకుశత్వాన్ని తిరోగమనం చేయించిన రోజు. మానవాళి ఏనాటికీ మరచిపోని మధుర స్వప్నంగా శాంతియుత అన్వేషణలోగల మహాద్భుత శక్తిని అత్యద్భుతంగా, అతి ఆదర్శవంతంగా నిరూపించిన రోజు. అదే ఆగష్టు 15. అదే ఈ రోజు. ఇదే మనకు స్వాతంత్ర్యం ప్రాప్తించిన రోజు. ఈ చారిత్రాత్మక దినాన మీవాడిగా, తెలుగువాడిగా నా జాతికి నేను శుభాభినందనలు సమర్పిస్తున్న మంచి రోజు.

ఇవే ఇవే నా వారికి నమస్కారాలు. ఇవే ఇవే స్వాతంత్ర్య సమర మహాయజ్ఞంలో సమిధలైన మన తెలుగు వీరులకు నేను సమర్పించే

శ్రద్ధాంజలులు. ఇవే ఇవే స్వాతంత్ర్య సముపార్జన కృషీవలుడు, ధన్యజీవి జాతిపిత పూజ్య బాపూజీకి నేను అర్పించే పుష్పాంజలులు. జాతీయ, రాష్ట్రీయ భారత స్వాతంత్ర్య సమర వీరవర్యులకు, అమరజీవులకు అందరికీ నేనర్పించే నివాళులు. ఈనాడు సమధికోత్సాహంతో జాతి అంతా జరుపుకొంటున్న ఈ స్వాతంత్ర్య శుభదినం ఎప్పటికీ, ఎన్నటికీ అందరం పరిరక్షించుకొని, అత్యున్నత ప్రమాణాలను, నైతిక, శ్రామిక, పారిశ్రామిక విలువలతో మించి అన్ని దేశాలను అధిగమించి పై అంతస్తుల అందలం అందుకోవాలని ఆకాంక్షిస్తున్నాను. ఈ శుభ సందర్భాన పెద్దలకు పూజ్యులకు, చిట్టి తమ్ముళ్లకు, పెద్దన్నలకు, అక్కాచెల్లెండ్రకు, యువతకు, కవితకు అందరికీ అనురాగంతో, ఆప్యాయతతో, నిండు మనసుతో స్వాతంత్ర్య శుభాకాంక్షలు తెలియజేస్తున్నాను.

అయితే వచ్చిన స్వాతంత్ర్యం మన సమాజానికి ఏమిచ్చింది ? తెచ్చుకున్న ఈ స్వాతంత్ర్యం ఎంత ప్రగతికి మార్గం చూపింది ? సామాజిక పరమైన న్యాయం మానవునికి అందకుండా అంతస్థుల్లో వున్నవారికే కేవలం స్వంతంగా, తమ హక్కుగా అనుభవించటం సంఘ సమానతకు సరైన నిర్వచనం కాదు. గుండెల నిండా గుబులు నింపుకొని, కన్నుల నిండా నీరు తొణికిసలాడుతూ, కష్టాలలోనే కాలం వెళ్లబుచ్చుకుంటున్న దురదృష్టవంతులు యింకా వున్నారు ఈ సమాజంలో. తినడానికి తిండి నోచుకోక, కట్టుకున్న చివికిన పాత ఏ పాత కాలానిదో పాపం, తట్టుకోలేక ఆ పాతలోనే రోతగా బ్రతుకుతున్న కష్టజీవులు, హక్కులకు వెలియై దురాచారాలకు బలియై, కర్మసిద్ధాంతంతో ప్రస్తుతాన్ని సరిపెట్టుకొంటూ భవిష్యత్తు లేక, దారిగానక, చీకటిలో కొట్టుమిట్టాడే కర్మజీవులు, నిస్సహాయులు, నిర్భాగ్యులు ఆనాటి నుంచి ఈ నాటి వరకు తీరని అవమానాలతో వరకట్న పిశాచి వికటాట్టహాసాలలో కుమిలిపోతూ స్వాతంత్ర్యం అన్నది మానినికి లేదా ? అని మూగబోయిన గొంతుతో ఆడపడుచులు అడుగుతున్నారు సామాజికపరమైన న్యాయం. వక్తల ప్రవచనాలకు, పాలనా కర్తల పైచూపులకు అందక, ఆలనా పాలనా లేక అధోగతిలో, రొంపిలో, రోతలో, అజ్ఞానంలో బిత్తరపోతున్న చిరు బిడ్డలు, కష్టం గిట్టని కార్మికులు, ఫలితం దక్కని రైతులు, చట్టం

కాపాడలేని శ్రామికులు—కన్నీళ్ళింకిపోయి, కాలే కడుపులతో, మండే డొక్కలతో "ఎవరికి వచ్చింది స్వాతంత్ర్యం" అని నిలదీసి అడిగితే—స్వార్థం పేరుకుపోయిన లంచగొండితనానికి అందామా? ప్రజా సంక్షేమాన్ని కాకుల్లా, గద్దల్లా, రాబందుల్లా తన్నుకుపోయే దళారీ తనానికని అందామా? మిలమిలలాడే రొక్కానికి అమ్ముడుపోయిన మానవత్వానికి అందామా? ఏమందాం? చెప్పాలి మీరు.

అర్థంకాని అంధకారంలో వెలుతురు కోసం వెతుకుతున్న మీ ప్రతినిధిని నేను. మోడువారిన పేద బ్రతుకుల్లో పన్నీరు జల్లాలని, కష్టజీవుల గాయాలను నా కన్నీళ్లతో కడగాలని, రైతన్నల సంక్షేమం ఈ చేతి మీద జరగాలని, స్వాతంత్ర్యానికి సరైన నిర్వచనం ఏనాటికైనా ఇవ్వగలగాలని నా ప్రయత్నం. అప్పటికిగాని, ఆనాటికిగాని నా శ్రమకు నేనే నిర్వచనం చెప్పకోలేను. ఆనాడు గాని మీ అన్నగా నా పెద్దరికాన్ని నేను నిలబెట్టుకోలేను. అందుకే ఈ తాపత్రయం. అందుకే ఈ ప్రస్థానం. ఈ అనుచరణలో, ఆచరణలో ఒక భాగమే తలదాచుకోడానికి నీడయినాలేని నిర్భాగ్యులకు శాశ్వత గృహ నిర్మాణ పథకం. ఆ కార్యక్రమంలో ఒక భాగమే రేపవలు రెక్కలు ముక్కలు చేసుకున్నా కన్నపట్టికి పట్టెడన్నం పెట్టడానికి నోచుకోని పేదల బిడ్డలకు మధ్యాహ్న భోజన పథకం.

ఆకలి డొక్కలతో పూటకు టికాణా లేక భారంగా బ్రతుకీడ్చే బడుగు వర్గాలకు కిలో బియ్యం రెండు రూపాయలకే అందించాలన్న ప్రయత్నం. ఈ ఉత్కర్షలో ఒక భాగమే కన్నవారి ఆస్తిలో కొడుకులతోబాటు ఆడ పడుచులకు కూడా సమాన హక్కులు కల్పించాలన్న ప్రయత్నం.

నిరుద్యోగ రక్కసిని నిర్మూలించడానికి, యువతలో నిస్పృహ పోగొట్టడానికి, ఉత్పత్తులకు సరైన కిమ్మత్తు రైతన్నకు లభింపజేయడానికి, సహకార వ్యవస్థను సహజీవనానికి ముడిపెట్టడానికి, మేథస్సు కొడిగట్టి పోతున్న ఈనాడు అర్హతకు ఆదరం పోయి చదువులు అమ్ముకునే దుస్సంప్రదాయ విధానానికి స్వస్తి చెప్పడానికే ప్రభుత్వ ప్రయత్నం. పసపోయిన డిగ్రీలను పంచే వసివాడిన విద్యా విధానానికి నూతన జీవం పోసి, నిరుద్యోగ నివృత్తికై వృత్తి విద్యలకు ప్రాధాన్యత కల్గించాలని,

ఆధారం లేని ఆడపడుచులకు ఆదరవు కల్పించాలని, స్వతంత్రంగా జీవితం గడుపుకొనే అవకాశం అక్కా చెల్లెళ్లకు కల్పించాలని, ఎన్నో కలలు కన్న విద్యాపీఠమే నేటి మహిళా విశ్వ విద్యాలయం. వ్యయాన్ని అదుపులో పెట్టి ఆదాయాన్ని పెంచి రాష్ట్రాభివృద్ధిని సాధించాలన్న ప్రయత్నమే ఈనాడు మస్తిష్కంలో మథింపబడుతున్న మాండలిక నూతన వ్యవస్థీకరణ విధానం.

పుణ్యంలో పురుషార్థమన్నట్లు పక్కవారిని మరువకుండా మనవారి కింత మేలు చేయడం ప్రభుత్వ ఆదర్శం. అలనాటి భగీరథ ప్రయత్నాన్ని తల పిస్తూ, మరపిస్తూ నింగికెగసిన వరవడిలో శ్రీశైల మల్లికార్జునస్వామి శిరో వేష ంలో చిందులాడుతున్న తెలుగుగంగ రాయలసీమ మాగాణంలో మథించి మదరాసు వాసుల దప్పిక తీర్చే పరమార్థమే మన మానవతాదృక్పథం.

లక్ష్మీ సరస్వతుల కేరింతల్లో శ్రీశైలం డామ్ కుడి ఎడమ కాల్వల స్రవంతుల్లో—బీటలు వారిన భూములు నిండుగా పండగా పుష్టివంత మైన ఆహారాన్ని పరిపుష్టిగా అందించగా ఆనందంలో తొణకిసలాడే తెలుగుతల్లిని సందర్శించాలన్న ఆశలు ఎన్నెన్నో వున్నాయి. ఎప్పుడో ఆ గోదావరిని కృష్ణమ్మతో కలిపే రోజు ఎప్పుడో. పోలవరం తెలుగు వారికి దేవుడిచ్చిన వరంగా ఒక ఆకృతి దాల్చి ఆనంద సాగరమయ్యే ఆ శుభ దినం ఎప్పుడో, ఎప్పుడో. పాతుకుపోయిన పేదరికం పీడ విడిపోయేది ఎప్పుడో, ఎప్పుడో! సంతృప్తితో, పండిన ఆశలతో గుండె నిండుగా వెన్నెల చెండుగా తెలుగుజాతి హసించేది ఎప్పుడో, ఎప్పుడో? దానికే నా ప్రయత్నం. దానికే ఈ సాధన. 'నా', 'మా' వల్ల మాత్రం కాదు. 'మా' అన్న పరమపదం కలవాలి. మన మందరం కలసి ముందుకు నడవాలి. అడుగులో అడుగువేసి భుజం, భుజం కలుపుతూ నడుం గట్టుకొని నడవాలి. ఇది మరో స్వాతంత్ర్య సమరం. మనం సాధించుకో బోయేదే నిజమైన స్వాతంత్ర్యం. దేశానికే కాదు, ప్రతి మానవుడికి కావాలి స్వాతంత్ర్యం. ప్రతి జీవిని పునీతం చేయాలి స్వాతంత్ర్యం. ఉమ్మడి సౌశైజాతికి నీరాజనం పట్టాలి స్వాతంత్ర్యం. అందుకే, అందుకే ఈ పయనం. విజయం తథ్యం. పూజ్యులందరికీ అభివందనం. మరోసారి శుభాభివందనం. ఈ ఆగస్టు

15 వ ఈ స్వాతంత్ర్య దినం అందరికీ పండుగ్గై, ఆవేశపూరితమై, భావి మానవ కళ్యాణానికీ, సమసమాజ స్థాపనకూ, సంఘ శ్రేయస్సుకూ, ప్రజా హితానికీ ప్రగతి పథం చూపాలి, వెలుగు దివ్వె కావాలి—అని కోరుకొంటూ వినమ్రతతో, చిత్తశుద్ధితో నా శేష జీవితం తెలుగు జాతికి అంకితమని ప్రమాణం చేస్తున్నాను.

*స్వాతంత్ర్యా దినోత్సవం సందర్భంగా 1983 ఆగస్టు 15న రేడియో, దూరదర్శన్‌లలో*

# ఉత్తిష్ఠత

శ్రీ రామకృష్ణ-వివేకానంద బోధాసాగరాన్ని మథించి జ్ఞానామృతాన్ని సాధించిన పెద్దలు స్వామీ రంగనాథానంద సమక్షంలో, శ్రీ రామకృష్ణ మఠప్రాంగణంలో నేను శ్రీరామకృష్ణుల గురించి, వివేకానందుల గురించి ప్రసంగించటం వ్యాసునికి భారతం చదివి వినిపించినట్లుగా వుంటుందేమో. అయితే నేనీ కార్యక్రమంలో పాల్గొనటానికి అంగీకరించటానికి కారణం:

> "సాధూనాం దర్శనం పుణ్యం
> స్పర్శనం పాపనాశనం
> సంభాషణం కోటి తీర్థం
> వందనం మోక్షసాధనం"— అన్న పెద్దల సూక్తి.

అంతేకాదు, 'నైష్కర్మసిద్ధి' రచించేముందు సురేశ్వరాచార్యులవారు చెప్పినట్లు "న ఖ్యాతి లాభ పూజార్థం-" అని పేరు ప్రఖ్యాతుల కొరకో, వేరే ప్రయోజనం కొరకో కాక, నాకు తెలిసిన విషయాలను పెద్దల సమక్షంలో ప్రస్తావించి రూఢిపరచుకోవాలన్న ఆతృతతోనే ఈనాడు మీ ముందు నిలవటానికి సాహసిస్తున్నాను.

'భగవంతుడున్నాడా? ఈ ప్రశ్న కొత్తది కాదు. 'ఉన్నాడు' – ఈ జవాబు తరచుగా వినవచ్చేదే. కాని 'మీరు చూశారా?' అని అడిగితే...? "అవును, చూశాను. అంతేకాదు, నీకు కూడా భగవంతుని దర్శించే మార్గం చూపుతాను"—అని నిస్సంకోచంగా, విస్పష్టంగా చెప్పగలిగిన గురుదేవుడు శ్రీరామకృష్ణుడు. కామినీ కాంచనాలను జయించిన ముక్తసంగుడు ఆయన. తామరాకుకు నీరంట వచ్చునేమో కాని ఒక యింటివాడయినప్పటికీ ఆ పరమహంసకు సంసారబంధ మంటలేదు. "భావనామాత్ర సంతుష్ట"అని దేవీ సహస్ర నామాలలో జగదంబను వర్ణించారు. తల్లి కేంకావాలి-తల్చుకుంటే చాలు, సంతోషిస్తుంది. 'అమ్మా'అని తన చిన్నారి శిశువు పిలిస్తే ఎన్ని పనులున్నా వదిలివేసి వస్తుంది. అక్కున జేర్చుకొని లాలిస్తుంది.

'అమ్మా' అని గుండెల నిండుగా ఆర్తితో పిలిచాడు శ్రీ రామకృష్ణుడు. అంబను సాక్షాత్కరింప జేసికొన్నాడు అనన్య సామాన్య భక్తి భావనతో— అందువల్లనే అంత్యకాలంలో కూడ శిష్యులతో—"ఎవడు రాముడో, ఎవడు కృష్ణుడో ఆయనే ఈ దేహంలో రామకృష్ణుడుగా వున్నాడు" అని అసందిగ్ధంగా, అత్యంత విస్పష్టంగా చాటి చెప్పగలిగాడు ఆ ఆత్మజ్ఞాని.

అట్టి గురువుకు తగ్గ శిష్యుడే స్వామీ వివేకానంద. శ్రీ రామకృష్ణుడు జ్యోతి అయితే వివేకానంద కాంతి. మనకు తెలుసు నారాయణుడు, నరుడు. మనకు తెలుసు—రాముడూ, ఆంజనేయుడూ. మనకు తెలుసు— కృష్ణుడూ, అర్జునుడు. అట్టి దివ్యావతార ద్వయమే రామకృష్ణ, వివేకానందులు— అని మనవిచేస్తున్నాను. శ్రీ రామకృష్ణ బోధామృతాన్ని దేశదేశాలూ తిరిగి పంచిన మహనీయుడు వివేకానందుడు. తన గంభీర ప్రవచన ప్రవాహవేగంతో ప్రపంచపు నలుచెరగులు ముంచెత్తిన మహా మనీషి ఆయన.

వివేకానందస్వామి శాస్త్రాన్ని అంగీకరించాడు కాని చాదస్తానికి బానిస కాలేదు. మిడిమిడిజ్ఞానంతో, మూఢాచారాలలో మురిగిపోతూ— అదే హైందవమత వైభవమని మురిసిపోతూ వుండే ఛాందసులకు మన మతమంటే ఏమిటో తెలియచెప్పిన మహానుభావుడాయన. భారతీయులకు కావలసింది మతబోధలు కాదు. ఆకలితో, చీకటిలో అలమటించే అభాగ్య సోదరులకు అవసరం పట్టెడన్నం—అని చాటిన యదార్థవాది ఆయన. "అన్నం బ్రహ్మ..." అన్న శ్రుతిసూక్తి ఆయన ప్రసంగాలలో ప్రతిధ్వనించింది. అవును. ముందు మానవాళి కోరుకునేది కనీస అవసరాలు తీరాలని. ఆపైన వస్తుంది—"జ్ఞానం బ్రహ్మ"—అన్న స్థాయి. తరువాత అందుకోవచ్చు. ఆపై కృషి కొనసాగించిన నిస్సంగుడు 'ఆనందం బ్రహ్మ' అన్న అంతస్తు.

నాడు వివేకానంద చెప్పిన మాటలు నేటికీ అన్వయిస్తాయి. స్వాతంత్ర్యం వచ్చి 35 సంవత్సరాలు గడిచినా, జనాభాలో సగానికి సగం ఇంకా దారిద్ర్య రేఖకు దిగువన క్రుంగిపోతున్నారు. రెక్కాడినా డొక్కాడక క్రుంగిపోతున్నారు. ఈ దురదృష్టకర పరిస్థితిని మార్చి సమ సమాజాన్ని నిర్మించుకోవలసిన అవసరం ఎంతైనా వుంది. ఈ మహత్తర కృషిలో జాతి

ముందుకు సాగిపోతుంటే అడ్డంకులు కల్పించే అనైక్యతాశక్తులు చెలరేగు తున్నాయి. మతంపేరిట, కులం పేరిట, ప్రాంతంపేరిట, భాష పేరిట పరస్పర ద్వేషాలురగిల్చే ప్రయత్నాలు సాగిస్తున్నాయి. ఆకలికి మతముందా? అజ్ఞానానికి కులముందా? అని అడుగుతున్నాను. మమతలబంధాలు పెంచు కోవాలిగాని మనిషి మనిషికీ మధ్య నాగజెముడు కంచెలు పాతుకోనమని ఏ మతమూ చెప్పదు. రాముడైనా, రహీమైనా, క్రీస్తు అన్నా, కృష్ణుడన్నా— ఆ అనంతుడే కాని వేరుకాదు. నదులన్నీ సాగరంలో సంగమించినట్లు ఏ దేవునికి చేసిన నమస్కారమైనా ఆ ఆదిమధ్యాంత రహితునికే అందు తుంది. 'ఏకం సద్విప్రా బహుధా వదంతి'—ఆయన ఒక్కడే, వేరు వేరు పేరులతో పిలుస్తారు— అన్న మహత్తర భావన మన సంస్కృతిలో జీర్ణించివుంది.

'అంతా దేవుని బిడ్డలమే' అన్న సర్వమత సారాన్ని సూటిగా హృద యానికి హత్తుకునేలా పలికిన ఘనత స్వామీ వివేకానందులది. చికాగోలో జరిగిన చరిత్ర ప్రసిద్ధమైన సర్వమత మహాసభలో పాల్గొంటూ ఆయన సదస్యులను **'Ladies and Gentlemen'** అని సాంప్రదాయిక పద్ధతిలో సంబోధించలేదు. "అమెరికా దేశపు నా ప్రియమైన సోదర సోదరీ మణు లారా!" అని సంబోధించాడు. ఆ పిలుపులో వున్న ఆప్యాయతకు, చనువుకు ప్రేమ భావనకు పులకించిపోయిన సదస్యులు ఆయన పలుకులకు హర్షం తెలుపుతూ విడవకుండా కరతాళధ్వనులు చేశారు. ఆ ఒక్క మాటలోనే ఆయన సర్వమతసారమైన మానవాళి పరస్పరానురాగబంధాన్ని వ్యక్తం చేశారు.

అయితే నేడు మనం చేస్తున్నదేమిటి? మతం పేరిట సాటి మనిషిని చంపుకోవటమా? కొరాన్‌లో ఒక కథవుంది. ఆదాము కుమారు లిరువురు భగవంతునికి నైవేద్యం అర్పిస్తారు. ఒకరు పెట్టిన నైవేద్యం స్వీకరించి భగ వంతుడు రెండవవాని నైవేద్యం తిరస్కరిస్తాడు. ఎందుకని? "నేను నిన్ను చంపుతాను"—అన్నాడు ఒకడు. రెండవవాడు బదులు చెప్పాడు: నీవు నన్ను చంపటానికి చేయెత్తినా సరే, నేను నిన్ను చంపను. నేను జగత్పిత అధి కారంలో ఉన్నాను. ఆయన అందరికీ తండ్రి"—అని. రెండవవాని నైవేద్యమే భగవంతుడు స్వీకరించాడు కాని, "సోదరుని చంపుతా" నన్నవాడు వడ్డిం

చినది కాదు. మతాలు ఎంచినే బోధించినా మన దురదృష్టం —కొందరు విపరీతార్థాలనే మన నెత్తిన రుద్దుతున్నారు. పరమార్థాన్ని వదలి పరస్పర ద్వేషాన్ని పెంచుకొంటున్నాం. పరమాత్మకు దూరంగా, బహుదూరంగా పోతున్నామని గ్రహించటంలేదు.

"బ్రహ్మైవాహ మిదం జగచ్చ సకలం
చిన్మాత్ర విస్తారితం
సర్వం చైత దవిద్యయా త్రిగుణయా
శేషం మయా కల్పితం
ఇత్థం యస్య దృఢామతిః సుఖతరే
నిత్యే పరేనిర్మలే
చండాలోస్తు సతుర్ద్విజోస్తు గురు
రిత్యేషా మనీషామమః"

అంతా బ్రహ్మమేనంటూ అస్పృశ్యత పాటించటం సముచితమా?
మనీషాపంచకం వల్లించే నోట
తగునా—"చండాలుడా! తొలగు"—అన్నమాట!

—ఒక్కసారి ఆలోచించుకోండి! సద్బ్రాహ్మణునైనా,
చండాలునైనా సమంగా చూచే వాడే ఆత్మజ్ఞాని.

ఇంతటి పరిణతి చెందిన మతం నేడెంతగా దిగజారిందో?

అన్ని మతాలు బోధించే ఉత్కృష్ట ధర్మం మరొకటి వుంది. అదే త్యాగం. మానవుడు త్యాగంవల్ల ప్రకాశిస్తాడు. 'నప్రజయా ధనేన త్యాగేనైకే అమృతత్వ మానశుః' — సంతతిద్వారా గాని, సంపదద్వారా గాని అమృతత్వమును పొందలేవు. త్యాగంవల్ల మాత్రమే అది సాధ్యం; కురాన్ దాన ధర్మాలను ఒక పవిత్ర విధిగా బాధ్యతగా చెప్పింది. ఉన్నవాడు లేనివాణ్ణి ఆదుకోవాలన్నది. ఆర్తులకోసం నీ సంపదను వెచ్చించు. అది భగవంతుని వద్ద భద్రంగా దాచబడుతుంది—అని వివరించింది. బైబిల్ తీసికొనండి! సూది బెజ్జంనుండి ఒంటెను దూర్చవచ్చు. కాని, ధనవంతుని స్వర్గానికి

చేర్చలేము అన్నాడు ఏసుప్రభువు. నీ ధనాన్ని బీదలకు పంచి నావద్దకు రా, ముక్తిమార్గం చూపుతాను అని బోధించాడు.

'అభ్యాగతః స్వయం విష్ణుః,' అని అతిథి దేవులను మర్యాద చేయ వలసిన తీరును మన శాస్త్రాలు వర్ణించాయి. పరమ పవిత్రమైన స్ఫూర్తిదాయకమైన సక్తుప్రస్తుని కథ, రంతిదేవుని చరిత్ర మీకుతెలుసు. ఈరోజు మనముందు లక్షలాది అభ్యాగతులు నిలుచొని వున్నారు. వరదలలో సర్వం కోలుపోయి కట్టుబట్టలతో మిగిలారు. లక్షలాది ఎకరాల పంట నాశనమై నోటిముందు కూడు ఏటిపాలైన రైతన్నలున్నారు. వారిని ఆదుకోవటం మన కర్తవ్యం. వారికి సాయపడటంలోనే మన సంపదలకు సార్థక్యత వుంది అని మనవిచేస్తున్నాను.

ముగింపుగా —స్వామీ వివేకానందులు పదేపదే చెప్పి మనలను హెచ్చరిస్తూ వచ్చిన ఉపనిషద్వాక్యం విన్నవిస్తాను.

"ఉత్తిష్ఠత! జాగ్రత! ప్రాప్యవరాన్నిబోధత!"
"లేవండి! మేలుకొనండి! గమ్యం చేరేవరకు ఆగకండి!"

*'శ్రీ రామకృష్ణ—వివేకానంద*
*ఉద్యమ సమగ్ర అధ్యయనం'*
*పై హైదరాబాదులో అక్టోబరు 20న జరిగిన జాతీయ*
*గోష్ఠిలో.........*

# ఆగని పయనం

1956 లో ఇదే నెల, ఇదేరోజు అవతరించింది ఆంధ్రప్రదేశ్— స్వతంత్ర భారతావనిలో ప్రత్యేక రాష్ట్ర ప్రతిపత్తితో తెలుగు వారందరకూ.

వరద వచ్చినా, నీరు పొంగినా, గండ్లు పడినా ఈ రోజు మనం స్మరించుకోకుండా వుండలేము. ఇది మన ప్రత్యేక రాష్ట్ర అవతరణ శుభదినమని. కష్టసుఖాలలో, చీకటి వెలుగులలో పయనించేదే జీవితం.

కారుతున్నాయి ఒక కంట ఈరోజు కన్నీళ్లు—

కనీవినీ యెరుగని వరద భీభత్సంలో తోడుపోయి, నీడపోయి, కూడుపోయి కడగండ్లపాలయిన లక్షలాది నిరుపేద సోదరీసోదరుల మూగవోయిన బాధ నర్తం చేసికొనగలిగినా

కారుతున్నాయి మరో కంట ఆనందబాష్పాలు—

ఉప్పెనను మించిన ఉత్సాహంతో పొంగి, ఉదారంగా విరళాలివ్వడానికి ముందుకు వస్తున్న అశేష ప్రజావాహినిని తిలకించి.

ముఖ్యంగా బజార్లు పట్టి, జోలెకట్టి, కదం తొక్కుతూ, పదం పాడుతూ ఆర్తులనాదుకోటానికి పైసకు పైసా, రూకకు రూక సేకరించి తెచ్చిన నా చలనచిత్ర కళారంగ సోదరీ సోదరుల సామాజిక సేవాతత్పరతకు మేను పులకించి పరవశిస్తున్నాను—కళా ప్రయోజనాన్ని గుర్తించి.

కళకు ఆదర్శం ఆదాయం కాదు—వ్యధితులై, బాధితులై, నిక్ర్పష్టులై, నిరాశులై ప్రకృతి వైపరీత్యాలతో నడుం విరిగి, ఆదరువు కోల్పోయిన కోట్లాది విధి తాడితులకు అండగా వుండటమే, తోడుగా నిలవటమే. పరమోత్కృష్ట సేవాభావంతో కళా పరమార్థాన్ని ప్రయోజనాత్మకంగా

చాటి చెప్పిన నటీనట సాంకేతిక నిర్మాణ నిపుణులకు, చలన చిత్ర పరి
శ్రమలోని ప్రతివొక్కరికీ నా కళాభినందనలు. మీ యీ సేవ చరితార్థమై,
చిరస్మరణీయమై కళ కళ కోసమే కాదు, మానవసమాజ సంస్కృతి
వికాసానికే అంకితమైన పరమార్థ కృషిగా, భావితరాల కళాస్రవంతి ఉద్దీ
పనకు వెలుగుబాట చూపే జీవనాడిగా, ప్రగతిపథంగా గురుతుండగలదని
నా విశ్వాసం. మరొక్కసారి ఈ కళావాహినికి నా కృతజ్ఞతాపూర్వక
ఆశీస్రవంతులు, అభివందనములు.

మధురం. ఇది మధురం. ఆర్తుల కన్నీరు తుడిచే మీ జీవితమే
సఫలం. ఇదే నాకూ, మీకూ, మనకందరకూ జీవితపరమార్థం. కళకు
అర్థం.

ఔను గరపించే దెబ్బే తగిలింది తుఫాను వల్ల, వరదల వల్ల తెలుగు
నాటికి, నాటివారికి. కాని తాడిత కందుకంలా తిరిగిలేస్తాడు తెలుగు బిడ్డ.
కొట్టుకొనిపోయిన యిల్లు కట్టుకొంటాడు. మట్టమయిపోయిన ఆర్థిక
స్థితిని చక్కబెట్టుకుంటాడు. గుండెదిటవుతో, నడుం కట్టి శ్రమి
స్తాడు. అంతిమ విజయం తనదేనని నిరూపిస్తాడు. ఈ మహాప్రస్థానంలో
ఆసేతు హిమాచలం, మానవజాతే మనకు చేదోడు, వాదోడు.

గతించిన చరిత్ర పుటలలో ఎన్ని దెబ్బలు తగులలేదు తెలుగుగడ్డకు
ఎన్ని అడ్డంకులు, అవాంతరాలు ఎదురవలేదు?

ఈ నాటిదా తెలుగుతేజం? శాతవాహనుల నాడే అన్నది—గోదావరి
పావనోదార వాఃపూరము అఖిల భారతం మాదని. కాకతీయులనాడే ప్రతి
ధ్వనించాయి తెలుగుజోదుల కరవాలాల కణకణలు దిగ్దిగంతాలలో. విజయ
నగర రాజ వీధులలో రతనాల రాసులు పోసుకొని సాగించారు వ్యాపార
బేహారులు. ఆ వైభవమంతా ఏమయింది? మరువలేని, మరపురాని తీయని
గాధగా మిగిలిపోయింది.

ముక్క చెక్కలైపోయింది తెలుగునాడు పరాయి పాలనలో. మూలా
బడ్డాయి మన గ్రామీణ పరిశ్రమలు. సస్యశ్యామలంగా వెలిగి, ధాన్యా

గారంగా పేరొందిన తెలుగుసీమ వెలవెల పోతోంది. పెచ్చుమీరిన అవినీతి, గూడుకట్టుకొన్న స్వార్థం, దేశాభ్యుదయాన్ని, జాతి అభ్యుదయాన్ని, మానవాభ్యుదయాన్ని కబళింపజూస్తున్నాయి.

తిరిగి తెలుగువారంతా ఒక త్రాటిపైకి రావాలని, ఒక నీడకు చేరాలని, తెలుగుభాషా సంస్కృతీ ప్రాభవాలను పునరుజ్జీవింప జేసుకోవాలని ఆకాంక్షించారు మనపెద్దలు. పట్టుదలతో పరిశ్రమించారు ప్రత్యేక రాష్ట్రం కోసం.

తెలుగుబిడ్డ అల్లూరి సీతారామరాజు వంటి స్వాతంత్ర్య యోధ కిశోరాల మహత్తర త్యాగ ఫలితంగా దేశానికి స్వాతంత్ర్యం లభిస్తే, అమర జీవి పొట్టి శ్రీరాములు ఆత్మబలిదాన ఫలితంగా మనకు ప్రత్యేకరాష్ట్రం సిద్ధించింది. ఇదే మార్గదర్శకమై, భాషాప్రయుక్త రాష్ట్రాల నిర్మాణానికి శ్రీకారం చుట్టింది.

ఎన్ని కలలు కన్నారు తెలుగుప్రజలు— ఈ ప్రత్యేకరాష్ట్ర సాధన ఫలితాన్ని ఊహించుకొని! ఎన్ని ఆశలు పెంచుకొన్నారు—ప్రత్యేకరాష్ట్రం పేదరికానికి విమోచన కలిగిస్తుందని! ఆర్తితో, అన్నార్తితో డొక్క లెండుతూ, విజ్ఞాన హీనులై అంధకారంలో అలమటిస్తున్న తమ బిడ్డల భవిష్యత్తు బాగుంటుందని బంగారు కలలు కన్నారు, గుడిసెలలో మగ్గుతున్న ఆడబిడ్డలందరూ. యుగాలు దాటినా, తరాలు గడచినా తలరాత మారలేదన్నట్లుగా అస్వతంత్ర జీవనులై, అవమానాలపాలౌతున్న మహిళలు ఎదురుచూశారు, వారి జీవితాలకు ఒక నిలకడ ఏర్పడుతుందని.

స్వార్థం, అసమానత్వం, కులవిభేదం, మతతత్వం మాసిపోయి మన రాష్ట్రంలో మనుషులంతా ఒకటిగా మనగలిగే మంచిరోజు వచ్చిందని అనుకున్నారందరూ. శ్రమజీవులాశించారు తమ స్వేదానికీ, అశ్రువులకూ తగిన ప్రతిఫలం ముట్టచెప్పబడుతుందని. సంబరపడ్డారందరూ అన్నానికి లోటుండదనీ, కట్టుబట్టకు కరువుండదనీ, నిలువ నీడ ఉంటుందనీ. హాయిగా పాడుకొన్నారు—

'ఏ దేశమేగినా ఎందు కాలిడినా

తలపరా నీ తెలుగు తల్లి భారతిని, —అని.

ఆ ఆశ లేమయినాయి? ఆ తరువాత ఏం జరిగింది? రాష్ట్రం ఏర్పడి 27 సంవత్సరాలయినా ఇంతవరకు తెలుగుభాష అధికారభాషగా తన ప్రతిపత్తిని సంతరించుకోలేకపోయింది. అవినీతి, అసమర్థత, అధికార వ్యామోహం పెల్లుబికి పిశాచాల్లా సమాజం మీదికి ఎగబడ్డాయి. స్వైర విహారం చేస్తున్నాయి. హద్దుల నతిక్రమించాయి. తానూ, తానన్న భావంతో పొరుగునఉన్న పేదవారిపట్ల జాలి చూపలేకపోతోంది సంపన్న సమాజం. 'సొంత లాభం కొంతమానుకు పొరుగువాడికి తోడుపడవోయ్, దేశమంటే మట్టి కాదోయ్, దేశమంటే మనుషులోయ్' – అన్న మహాకవి వాక్కులకు కేవలం చప్పట్లు మాత్రమే మిగిలిపోయాయి. ఈనాటికీ సమాజంలో నూటికి 50 శాతం ప్రజలు దరిద్రరేఖకు దిగువన భారంగా బ్రతుకు లీడుస్తున్నారంటే దీని అర్థమేమిటి? అనుకుంటున్నది పేదప్రజానీకం బొంగురు పోయిన గొంతుతో, వెలికిరాని సవ్వడితో మా మొరాలకించే నాథుడే లేడని, నాయకుడే రాడని.

విసిగి వేసారి ఉస్సురన్న కష్టజీవులు కస్సున లేచారు. మిన్నకుంటే మనుగడ లేదని మార్పు తేవటానికి యత్నించారు. ఆ ప్రయత్న ఫలితమే తెలుగుదేశం పార్టీ అధికార బాధ్యతలు స్వీకరించటం. మానవజాతి చరిత్ర పుటలలో చిరస్థాయిగా సువర్ణ అక్షర లిఖితంగా మిగిలిపోతుంది ఆ చారిత్రాత్మక ఘట్టం. అది అద్వితీయం. అపూర్వం.

మెదులుతోంది అనుక్షణం గుండెలలో, రగులుతోంది రక్తంలో— ఆనాడు నా అన్నదమ్ములు, అక్కచెల్లెళ్లు, నా మీదుంచిన విశ్వాసం, నమ్మకం. ఈ రోజు ఆ గురుతుతో, అంకితమైన భావంతో, కృతజ్ఞతతో తెలియజేస్తున్నాను—ఈనాటికీ, ఏనాటికీ నేను చేసిన వాగ్దానాలు వమ్ము కావని, నేను వాటికి బద్ధుడనని.

ప్రజలిచ్చిన గౌరవాన్ని నిలబెట్టుకొంటానని.



కరీంనగర్ జిల్లా దుర్షిద్ గ్రామంలో 1983 మార్చి 28న
ఇళ్ళస్థలాల పట్టాల పంపిణీ

గుంటూరులో 1983 ఏప్రిల్ 11న బలహీన వర్గాల వారికి ఆర్థిక సహాయం



నిజామాబాదులో వాచ్‌మన్ సాయిలుతో సహపంక్తి భోజనం



బలహీన వర్గాల మహిళలకు కుట్టు మిషన్ల పంపిణీ

దీని ఫలితమే ప్రభుత్వం తీసికొన్న విప్లవాత్మక చర్యలూ, పరిష్కారాలూ, ఈనాడు తీసుకొంటున్న నిర్ణయాలూ.

రెక్కలు ముక్కలుచేసికొన్నా, డొక్కా నిండని పేద ప్రజానీకానికి ఉచిత ఆదరవు కల్పించటానికి కిలో బియ్యం రెండు రూపాయలకే లభించే ఏర్పాటు చేసినా—

ఎండా వానా లేకుండా, రేయి పగలు అనకుండా కండలు కరిగిస్తూ, రక్తాన్ని స్వేదంగా చెమరిస్తూ నిరంతరం శ్రమించే నిరుపేద కార్మికులకు నిలువనీడ చూపించడానికి 2,20,000 శాశ్వత గృహ నిర్మాణపథకాన్ని చేపట్టినా—

పట్టిన మేడి వదలకుండా దేశానికి పట్టెడన్నం పెట్టే రైతన్న తాను శ్రమించి పండించిన పంటకు సరయిన గిట్టుబాటు ధర లభింప చేయాలన్న ప్రయత్నం చేసినా—

అన్నదాతకున్న అవసరాలన్నీ ఎరువులు, విత్తనాలు, పరపతి, మార్కెటింగ్ సౌకర్యాలను ఒకేచోట ఏర్పాటుచేయాలనుకున్నా—

యుగాలు మారినా, తరాలు గడిచినా వరకట్నంలాంటి సాంఘిక దురాచారాలతో, ఆదరవు లేక, అవమానాల పాలవుతున్న కోట్లాది ఆడపడుచుల జీవన స్వాతంత్ర్యం, ఆత్మాభిమానం నిలపడానికే ఆనాడన్న మహిళా విశ్వవిద్యాలయం ఈనాడు ప్రారంభించినా—

ఆస్తిలో మగవారితోపాటు ఆడవారికి కూడా సమాన హక్కులుండాలన్న నిర్ణయం తీసికొన్నా—

బీడువారిన రాయలసీమ ప్రాంతాన్ని సస్యశ్యామలంగా, పచ్చని పైరులతో పరిమళించేటట్టు చేయటానికి, కృష్ణవేణీ జలాలు తరలించినా—

తమిళసోదరుల దప్పిక తీర్చడానికి మంచినీరందించే మానవతా పథకాన్ని దానితో చేర్చి 'తెలుగు గంగ'గా రూపొందించినా—

విద్యను వెలగట్టి, బజారులో పెట్టి అమ్ముకునే అమానుషకరమైన, అనాగరిక విధానానికి స్వస్తిచెప్పి అర్హతకు తగిన గుర్తింపు లభించేలా చేయడానికి విద్యాలయాల్లో కేపిటేషన్ విధానాన్ని రద్దు చేసినా—

బడుగు వర్గాలవారి జీవితాలలో కాంతిరేఖలు ప్రసరింపజేయడానికి సంక్షేమ, సేవా పథకాలకు నిధుల కేటాయింపు రెట్టింపు చేసినా—

ప్రజాసేవ ప్రతిఫలం కోరదన్న భావంతో శాసన సభ్యుల పింఛనును రద్దుచేసినా —

కుళ్లిపోయిన కులవ్యవస్థ నంత మొందించడానికి అర్జీలలో కులమన్న పదాన్ని తొలగించినా—

రెక్కాడితేగాని డొక్కాడని స్థితిలో బిడ్డలకింత పెట్టుకోడానికి నోచుకోని బడుగువర్గాలపిల్లలకు మధ్యాహ్న భోజన పథకం అందించినా—

సమాజ సంక్షేమానికి, సమగ్రాభివృద్ధికి పదిహేను సూత్రాల కార్యక్రమం 'ప్రగతి పథం' అమలు పరచినా—

ఏది చేసినా, ఎంతచేసినా అదంతాచేసిన బాసలు చెల్లించడానికే,

ఇచ్చిన వాగ్దానాలు నెరవేర్చడానికే,

నా తెలుగువారి సంక్షేమం పెంపొందించడానికే,

నా తెలుగు రాష్ట్రం అభివృద్ధి కోసమే

—అని అంకిత భావంతో తెలియజేస్తున్నాను, నా బాధ్యతగా,

నా ధర్మంగా.

ఏమరలేదు అన్నమాట అని చెప్పటానికే గాని ఏకరువు పెట్టడానికి కాదు ఈ జాబితా.

ఎన్ని పనులు చేసినా, యింకా ఎన్నెన్నో వున్నాయి చేయవలసినవి, ఎంతో ఆశవుంది చేయాలని.

ఈ చేసినవే కాక, ఈనాడు చేయాలని తీసికొన్న ప్రభుత్వ నిర్ణయాలను తెలియజెప్పటం ఈ శుభ సందర్భానికి ఉచితం.

నిరుద్యోగ రక్కసి కోరలలో చిక్కి, నిరాశా నిస్పృహలతో క్రుంగి, భారంగా బ్రతుకులు వెళ్లదీసే యువత జీవితాలలో ఆనందనందనాలు వెలయించాలన్న ఆకాంక్షతో, కేంద్ర సహాయంతో, ప్రవేశపెడుతున్నది ప్రభుత్వం 'గ్రామోదయ' కార్యక్రమాన్ని.

చీకటిలో మ్రగ్గుతున్న నిరుద్యోగ గ్రామీణ యువ సోదరుల జీవితాలను జ్యోతిర్మయం చెయ్యటానికే 'దీప' కార్యక్రమం.

నికృష్టమైన వృత్తిని స్వీకరించినా, సమాజానికి అత్యంత ముఖ్యమైన విధంగా సేవ చేస్తున్న పాకీపనివారి హేయమైన జీవన విధానాన్ని మార్చటానికే 'విముక్తి' కార్యక్రమం. దీని ప్రధానాశయం మహిళలకు గౌరవప్రదమైన సౌకర్యం కలిగించటానికి ప్రతిచోట ఆధునిక మరుగుదొడ్ల నిర్మాణం.

ఉత్సాహంతో, ఉల్లాసంతో ఉరకలు వేస్తున్న యువతను వృత్తివిద్యా విధానంలో తీర్చిదిద్ది, గ్రామీణాభివృద్ధి కార్యక్రమాలలో నిమగ్నం చేయటమే 'యువశక్తి' కార్యక్రమం.

అపారంగావున్న వనరులను ప్రకృతిసిద్ధమైన నిక్షేపాలను మలచి, పరిశ్రమల పెంచి, మన రాష్ట్రాభివృద్ధి కార్యక్రమాలను క్రమబద్ధం చేయడానికి నిష్ణాతులైన నిపుణులతో రాష్ట్ర అభివృద్ధి సంఘాన్ని ఏర్పాటు చేయటం.

ఆర్థికంగా వెనుకబడినవర్గాలవారికి, గిరిజన, హరిజన, దళిత వర్గాల వారికి ఉత్తమ పద్ధతుల్లో విద్య లభింపజేయటానికి ప్రతి జిల్లాలో నాలుగు నివాస పాఠశాలలు నిర్మించే నిర్ణయం తీసికోవటం.

పట్టణాలలో ఉద్యోగం చేసుకొంటున్న వనితలకు భద్రమైన నివాసం కల్పించటానికే ప్రతి జిల్లా కేంద్రంలో కనీసం ఒక శ్రామిక మహిళావసతి గృహాన్ని నిర్మించబూనటం.

ప్రాథమిక విద్యావ్యాప్తికి నిరుద్యోగ సమస్యా పరిష్కారానికి ఈనాడు 16,000 మంది ఉపాధ్యాయులను ప్రత్యేక ప్రాతిపదికపై క్రొత్తగా నియమిస్తున్నారు.

ప్రతి వూర ప్రాథమిక పాఠశాలకు ఒక భవనం ఉండాలన్నది ప్రభుత్వ లక్ష్యం. ఈ లక్ష్యసిద్ధికే పాఠశాల భవనాల నిర్మాణ నిర్ణయం.

మన రాష్ట్రంలో ప్రతిభగల యువక్రీడాకారులకు సరయిన అవకాశం కల్గించి, ప్రోత్సహించి, మన రాష్ట్ర గౌరవాన్ని జాతీయంగా, అంతర్జాతీయంగా పెంపొందించడానికే క్రీడామండలి పునర్వ్యవస్థీకరణం.

సమాజంలో నూటికి 50 శాతం మించివున్నా, అవకాశం లేక, అదను దొరకక, అస్వతంత్రులుగా బ్రతుకుతున్న సోదరీమణులకు స్వతంత్ర జీవనోపాధిని కల్పించడానికే అర్హమైన ఉద్యోగాలలో వారికి నిర్ణీతశాతం కేటాయించటం.

ప్రతిభ, సమర్థత, నిజాయితీతో ప్రశంసార్హమైన ఉత్తమ కృషిని కొనసాగించే ప్రభుత్వోద్యోగుల సేవలను గుర్తించడం, ప్రోత్సహించడం.

అవినీతికీ, అక్రమానికీ పాల్పడి సామాజిక సంక్షేమాన్ని మరచి వ్యవహరిస్తున్న స్వార్థపరులకు తగిన శిక్షాస్మృతిని లభింపజేయడం.

ఏ కార్యక్రమాన్ని ప్రారంభించినా, ఏ పథకాన్ని చేపట్టినా స్వచ్ఛమైన పరిపాలన అందించనిదే, పటిష్టమైన అధికార యంత్రాంగంలేనిదే ప్రయోజనం లేదు. అందువల్లనే పరిపాలనలో అవినీతికి తావులేకుండా చేయటం అత్యంత అవసరం. ఉన్నత స్థాయిలో అవినీతిని నిర్మూలించడానికి, నిరోధించడానికి 'లోకాయుక్త' చట్టాన్ని నేటినుండే అమలు చేయటం జరుగుతోంది.

తెలుగునేల యిది. తెలుగువారం మనం. అయినా 'తెలుగదేల?' అన్న ప్రశ్న ఈనాటిది కాదు. 'తెలుగులో కావ్యరచనా?' అని హేళనచేసే పండితులనెదిరించి, మహాంధ్ర భారతాన్ని విరచించి, తెలుగుకు కావ్య గౌరవం చేకూర్చాడు నాడు నన్నయ భట్టారకుడు. ధన్యజీవి ఆ ఆదికవి. తిరిగి కృష్ణరాయల కాలంలో 'తెలుగదేల' అన్నప్రశ్న ఉత్పన్నమైనప్పుడు

"తెలుగదేలయన్న దేశంబు తెలుగేను
తెలుగు వల్లభుండ, తెలుగొకండ
ఎల్లనృపులు గొలువ ఎరుగవే బాసాడి
దేశ భాషలందు తెలుగు లెస్స"—

అని సమాధానమిచ్చాడు శ్రీకాకుళ ఆంధ్రమహావిష్ణు దేవుడు కృష్ణరాయునికి కలలో కనిపించి.

తేనెలొలుకు తియ్యదనం తెలుగుభాష సొత్తు. తెలుగుభాషా సంస్కృతుల పునరుజ్జీవనం మన విధి, బాధ్యత. 'తెలుగులో పరిపాలనా?' అని అవ హేళనచేసే తెలుగు ప్రబుద్ధులు వుంటే వుందురుగాక— వారిని సరకు గొనకుండా, తెలుగును ప్రధానభాషగా, అధికార భాషగా అన్ని స్థాయిలలో అమలు చేస్తున్నాము. ఎన్ని అడ్డంకులు ఎదురైనా, ఎన్ని అవాంతరాలు వచ్చినా పట్టుదలతో పట్టింది విడువక గమ్యం చేరేవరకు ఈ ప్రయాసం ఆగదని తెలియజేస్తున్నాను, కృర నిశ్చయంతో.

తెలుగు సంస్కృతి విస్తరించాలి. తెలుగు బావుటా రెపరెపలాడాలి. కరువు, కాటకం రానీ, వరదలే పొంగనీ, ఎన్ని అవాంతరాలు వచ్చినా ఎదురొడ్డి గుండెబలంతో, నిండుదనంతో, ఐక్యభావంతో తెలుగుజాతి పురోగమిస్తుంది. మీ అందరి సహాయ సహకారాలతో తెలుగునాడు వెలుగు నాడుగా రూపొందిద్దాం. అలనాడు తెలుగునాట మ్రోగిన విజయ దుందుభులు మరోసారి దిగ్దిగంతాలలో నినదించాలి.

తెలుగుతల్లి తన ముద్దుబిడ్డల కేరింతలలో ఆనందమయి కావాలి, పరవశించాలి. తెలుగుతేజం వెలుగు నిత్యం.

*రాష్ట్రావతరణ దినోత్సవాల సందర్భంగా*
***1983 నవంబరు 1న హైదరాబాదులో***

# జాతికి అంకితం

చరిత్రాత్మకమైన స్థలం కొండపల్లి. శత్రువుల కభేద్యంగా పేరొందిన యిక్కడి ఖిల్లా సుప్రసిద్ధం. జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో గణుతికెక్కినవి కొండపల్లి బొమ్మలు—ఇక్కడి పనివారి హస్త కళాకౌశలానికి తార్కాణాలు. చరిత్ర ప్రసిద్ధమైన ఈ చోటు నేడు మరోవిధంగా చరిత్రను సృష్టిస్తున్నది. ఈనాడు యిక్కడ తయారయ్యేవి అందాల బాలలకు ఆనందాలుపంచే రంగురంగుల బొమ్మలు కావు, బ్రహ్మాండమైన పారిశ్రామిక కర్మాగారాలకు పనికివచ్చే భారీయంత్రసామాగ్రి. ఎంతో అభివృద్ధిచెందిన దేశం సోవియట్ రష్యాకే యంత్ర పరికరాలను ఎగుమతి చేసే స్థాయికి, తొలిదశలోనే చేరుకొన్న ప్రజల సంస్థ—హెవీ మెషినరీ అండ్ ఇంజనీరింగు కర్మాగారానికి కొండపల్లి పుట్టినిల్లు కావటం తెలుగు నాడంతా గర్వించదగిన శుభ పరిణామం. ప్రగతి పథంలో పురోగమిస్తున్న ప్రజల సంస్థ హెవీ మెషినరీ అండ్ ఇంజనీరింగు కర్మాగారాన్ని జాతికి అంకితం చేయటానికి నాకెంతో ఆనందంగా వుంది నేడు.

ఈ సంస్థ సాధించిన అసాధారణమైన అభివృద్ధి ఎంతో ప్రశంసనీయమని చెప్పక తప్పదు. సామాన్యంగా పారిశ్రామిక సంస్థలు నిర్మాణం పూర్తి అయిన కొన్నాళ్లకు గాని, కొన్ని సందర్భాల్లో కొన్ని ఏళ్లకు గాని ఉత్పత్తిని ప్రారంభింపజాలవు. అటువంటిది నిర్మాణం యింకా పూర్తి కాకుండానే ఈ సంస్థ ఉత్పత్తిని సాధించడం ఎంతో అరుదైన సంగతి. అంతేకాదు. మొదటిదశ పూర్తయిన సంవత్సరంలోనే ఉత్పత్తి లక్ష్యాన్ని సాధించడం ఎంతో అభినందనీయం.

ఉత్పత్తి లక్ష్యాన్ని అందుకోవడమే కాదు, ఉత్తమ స్థాయిని అందుకోవడం కూడ మహత్తర విశేషం. 1981 లోనే మద్రాసులో జరిగిన అంతర్జాతీయ ప్రదర్శనలో పూర్తిగా దేశీయ పరిజ్ఞానంతో ఈ సంస్థ రూపొందించిన Splitting మెషిన్ అత్యుత్తమమైనదిగా ఎంపిక కావడం ఇందుకు నిదర్శనం.

ఏ ప్రాజెక్టును చేపట్టినా అనుకున్న అంచనాకన్నా అనేక రెట్లుగా నిర్మాణ వ్యయం పెరిగిపోవడం మనకు తెలుసు. నిజానికి ద్రవ్యోల్బణం కారణంగా నిర్మాణ వ్యయం ఏటా 15 శాతం పెరుగుతున్నది. అయి నప్పటికీ నిర్ణీత పద్ధతిలో ముందుగా అంచనా వేసిన పెట్టుబడితోనే ఈ ఫ్యాక్టరీ మొదటిదశ నిర్మాణం పూర్తికావడం ఒక ప్రత్యేకత, విశిష్టత.

దేశంలోగల హెవీ మెషినరీ సంస్థలన్నీ డోలాయమాన స్థితిలో వుండగా, ఆంధ్రప్రదేశ్ సంస్థ మాత్రం వినూత్న ఉత్సాహంతో ముంద డుగు వేస్తూ వుండడం, మనందరకూ గర్వకారణం. ఇందుకు గర్వ కారణమైన, ప్రశంసాపాత్రమైన ప్రగతిని సాధించిన మీ అందరికి ఇవే నా అభినందనాంజలులు.

ఆంధ్రప్రదేశ్ ప్రధానంగా వ్యావసాయిక రాష్ట్రమని మీకు తెలుసు. ప్రకృతి మనకు అపారమైన వనరులను ప్రసాదించింది. పరిశ్రమలకు ఎంతో అవసరమైన నల్ల బంగారం—బొగ్గు మన సొత్తు. తెలుగుతల్లి ఒడిలో ఎంతో విలువైన ఖనిజ సంపద దాగివుంది. గోదావరి, కృష్ణ, పినాకినుల వంటి జీవనదులు తెలుగునాటిని పరమపావనం చేస్తున్నాయి. విద్యుత్తు ఉత్పాదనలో మనరాష్ట్రం చక్కటి ప్రగతిని సాధించింది. తెలుగు బిడ్డ కష్టపడి పనిచేయడానికి, తన కర్తవ్యాన్ని నిర్వహించడానికి పేరెన్నిక గన్న శ్రామికరత్నం. రాష్ట్రంలో పారిశ్రామిక శాంతి నెలకొనివుంది. ఇంతగా అనుకూల వాతావరణం వున్నా, పరిశ్రమలను సక్రమ పద్ధతిలో పెంపొం దించడానికి జరుగవలసినంతగా కృషి జరుగలేదని చెప్పడానికి విచారిస్తు న్నాను. సహజ సంపదలను సక్రమంగా వినియోగించుకొని దరిద్రంపై దాడిని ఉధృతం చేయడానికి, సౌభాగ్య సంపదలను సాధించుకోడానికి పారిశ్రామికీకరణం ఏకైకమార్గం. ఉత్సాహంతో ఉరకలువేస్తూ, ముందుకు సాగవలసిన మన యువతను నిరాశా నిస్పృహలలో ముంచెత్తి నీరసింప జేస్తున్న నిరుద్యోగరక్కసిని నిర్మూలించడానికి పరిశ్రమలను పెంపొందించు కొనవడంకన్నా వేరే మార్గంలేదు. అయితే స్వరాజ్యం వచ్చినా, స్వరాష్ట్రం వచ్చినా మన పరిస్థితిలో ఏం మార్పు కలిగింది? ఆశతో, ఆకాంక్షలతో నిరీక్షించే జాతికి ఏం జరిగింది? నాగార్జున ఎరువుల కర్మాగారం గురించి మంగళగిరి పైర్ల కర్మాగారం గురించి దశాబ్దాలుగా వింటూనే వున్నాం.

అంచనాల వంచనలకు బలియై, అకారణ ఆలస్యానికి గురియై అట్టడుగున పడివున్న ఈ కర్మాగారాల నివేదికలను వెలికితీసి, వాటినిర్మాణానికై అవసరమైన అన్ని చర్యలను తీసుకొంటున్నాం. లోగడ జరిగిన ఆలస్యాలను, లోపాలను సవరించుకొని, చక్కదిద్దుకొని అచిరకాలంలోనే ఈ కర్మాగారాలను నిర్మించడానికి ప్రభుత్వం చురుకుగా కృషిని కొనసాగిస్తున్నది. తెలుగు వారి ఆశలకు, ఆకాంక్షలకు ఆలంబన ఈ పరిశ్రమలు. మీ అందరి అండదండంతో, సహాయసహకారాలతో ఈ కర్మాగారాలను త్వరలోనే నిర్మించుకోగలమన్న పూర్తి విశ్వాసం నాకుంది. ఈ సందర్భంలో కేంద్ర ప్రభుత్వం ముందుకు వచ్చి అవసరమైన సహాయాన్ని అందజేస్తుందని ఆశిస్తున్నాను.

వ్యావసాయిక రంగంలో సుప్రతిష్ఠితమై, భారీ పారిశ్రామికీకరణ మార్గంగా ఇప్పుడు మన రాష్ట్రం పురోగమిస్తున్నది. మనం 'గ్రామోదయ' కార్యక్రమాన్ని చేపట్టినా, 'దీప' కార్యక్రమాన్ని అమలు పెట్టినా, నిరుద్యోగ యువతకు ఉపాధి కల్పించే పరిశ్రమలను స్థాపించటం మన ధ్యేయం. నిజానికి ఏ భారీ కర్మాగారాన్ని మనం చేపట్టినా, ఆ మహా నిర్మాణం చుట్టూ అల్లుకొనిపోగల అనుబంధ పరిశ్రమలను ముందుగానే యోచించుకొని, స్థాపించుకోవాలి—యువత స్వయం ఉపాధి పథకాల రూపంలో. అప్పుడే భారీ పరిశ్రమల స్థాపనవల్ల నిజమైన ప్రయోజనం, ఉపయోగం సిద్ధిస్తాయి.

పారిశ్రామికీకరణ సందర్భంలో మనం గుర్తుంచుకోవలసిన అంశం ఒకటుంది. అభివృద్ధి ఎంత వాంఛనీయమైనా అభివృద్ధితోబాటు పిలవని పేరంటంలా అడుగిడే వాతావరణ కాలుష్యం విషయంలో మనకు ఎంతో జాగరూకత వుండాలి. పరిశ్రమల నిర్మాణ పథకాలలోనే కాలుష్య నివారణ అంతర్భాగంగా రూపొందాలి. ఈ విషయంలో ఆంధ్రప్రదేశ్ హెవీ మెషినరీ సంస్థ ఆదర్శవంతంగా ముందడుగు వేయగలదని ఆశిస్తున్నాను. కాలుష్య నివారణకు ప్రత్యేక శ్రద్ధ చూపుతుండడమేగాక, అసలు ఈ కర్మాగారంలోనే కాలుష్య నివారణకు ఉపయోగపడే యంత్రాల నిర్మాణాన్ని చేపట్టడం విశేషించి హర్షదాయకం.

పారిశ్రామికీకరణ జరగాలంటే ఆ మహత్తర ప్రయత్నంలో ప్రజలంతా భాగస్వాములు కావాలి. ఈ హెవీ మెషినరీ సంస్థ విషయంలో ప్రజతో

ముందుకు వచ్చి, పెట్టుబడి పెట్టి, ఈ సంస్థను నిజమైన ప్రజల సంస్థగా తీర్చిదిద్దారు. ఈ సంస్థ ప్రతిష్ఠాత్మకమైన బంగారు బాట ఇతర కర్మాగారాలకు, నిర్మాణాలకు ఆదర్శప్రాయం కావాలని ఆకాంక్షిస్తున్నాను. ఈ కర్మాగార స్థాపనకు వాటాలు తీసికొని సహకరించిన ప్రజానీకానికి, ఈ పరిశ్రమ క్రమాభివృద్ధిలో పాలుపంచుకొన్న అధికార, అనధికార ప్రముఖులను, ఉద్యోగులను ప్రధానంగా కార్మిక సోదరీ సోదరులను ఈ శుభ సందర్భంలో హృదయపూర్వకంగా మరొక్కసారి అభినందిస్తున్నాను.

ఈ కర్మాగార స్థాపనలో సహకరించి, సహాయపడిన ఆర్థిక సహాయసంస్థలకు, సాంకేతిక పరిజ్ఞానం సమకూర్చిన విదేశీ సంస్థలకు నా కృతజ్ఞతలు తెలియచేస్తున్నాను.

ప్రజల తోడ్పాటుతో, ప్రజల సంస్థగా పేరుపొంది జాతీయ, అంతర్జాతీయ మార్కెట్లలో అచిరకాలంలోనే మంచిపేరు గడించి ముందడుగు వేస్తున్న ఈ సంస్థను—అత్యంత శ్రద్ధాసక్తులతో, అనంత పునీతభావంతో జాతికి అంకితం చేస్తున్నాను.

*ఆంధ్రప్రదేశ్ హెవీ మెషినరీ, ఇంజనీరింగ్ సంస్థ అంకితోత్సవ సందర్భంగా విజయవాడలో **1983** నవంబరు **9** న...*

# నూతన సంస్కృతీ కేంద్రాలు

భారతదేశంలో ముఖ్యంగా తెలుగునాట గ్రంథాలయోద్యమానికి ఒక ప్రత్యేకత, విశిష్టత వున్నాయి. గ్రంథాలయోద్యమం భారత స్వాతంత్ర్యో ద్యమంలో, జాతీయోద్యమంలో అంతర్భాగంగా నిర్వహించబడింది. వూరూర, వాడ వాడ జాతీయోద్యమాన్ని ప్రచారం చేయడంలో గ్రంథా లయాలు ప్రముఖ పాత్ర వహించాయి. గ్రంథాలయోద్యమం జాతీయోద్య మానికి పట్టుగొమ్మగా విలసిల్లింది.

స్వాతంత్ర్యం వచ్చింది. ఒకటి కాదు. రెండు కాదు. 35 సంవత్సరాలు గడిచిపోయాయి. అయితే ఒకనాడు జాతీయోద్యమంలో, గ్రంథాలయోద్యమంలో గోచరించిన అమూల్యమైన త్యాగ, సేవా భావాలు ఎక్కడ? ఒకనాడు స్వాతంత్ర్యోద్యమంలో ముందుకు వురికి ధన మాన ప్రాణాలను వొడ్డి దేశం కోసం అష్టకష్టాలు ఆనందంతో సహించిన ఆ త్యాగమూర్తులు ఎక్కడ? ఏ స్వాతంత్ర్యం కోసం మనం కలలు కన్నామో ఆ స్వాతంత్ర్యం వచ్చినా స్వాతంత్ర్యం తెస్తుందనుకున్న స్వర్గం దివినుండి భువికి దిగి రాలేదు సరికదా పేద నిరుపేదై, ధనికులు అతి ధనికులై, మితిమీరిన ఆర్థిక వ్యత్యాసాలతో, దుర్భర దారిద్ర్యంతో, వేదనతో సంఘం నీరసించిపోయింది.

అజ్ఞానంలో, దారిద్ర్యంలో కొట్టుమిట్టాడిపోతున్న సమకాలీన సమాజాన్ని ఉద్ధరించి, ముందుకు నడిపించి, తిరిగి జాతిలో నూతన జీవం పోయడానికి నేటి ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చురుకుగా పట్టుదలతో కృషి ప్రారంభించింది. అనేక కార్యక్రమాలను సంఘ సంక్షేమం కోసం, రాష్ట్రాభివృద్ధి కోసం అమలు చేస్తున్నది. ఈ కార్యక్రమాలన్నీ గ్రామ గ్రామాన, విరివిగా ప్రచారం కావలసిన ఆవశ్యకత ఎంతైనా వున్నది. ఈ మహోద్యమంలో గ్రంథాలయాలు ప్రధానపాత్ర వహించాలి. ప్రతి గ్రంథాలయం ఏవో నాలుగు పుస్తకాలను, రెండు పత్రికలను వుంచే స్థలంగా కాకుండా గ్రామ జీవితంలో, గ్రామ సౌభాగ్యంలో, గ్రామ

చైతన్యంలో పాలుపంచుకొనే మహోన్నత సంస్థగా, ముఖ్యంగా యువశక్తి కార్యస్థానంగా రూపొందాలి. ప్రభుత్వం సాగిస్తున్న అనేక కార్యక్రమాలను ప్రజలకు వివరించి ప్రజల సహాయసహకారాలను అభివృద్ధి కృషికి లభ్యమయ్యేలా ప్రతి గ్రంథాలయం ఒక సమాచార కేంద్రంగా, ఒక సమాజాభివృద్ధి కేంద్రంగా, ఒక సంస్కృతీ కేంద్రంగా విస్తరించాలి.

గ్రంథాలయోద్యమం నాడు జాతీయోద్యమ అంతర్భాగంగా ఎలా వేళ్ళు పాతుకుపోయిందో, జాతి సేవ చేసిందో ఆ విధంగానే నేడు జాతి పునర్నిర్మాణ కార్యక్రమంలో, గ్రామీణాభివృద్ధి ఉద్యమంలో, సమాజ సంక్షేమ ప్రగతి కార్యక్రమంలో ఒక భాగంగా రూపొందాలి.

గ్రంథాలయోద్యమం పురోగతికి ప్రభుత్వం తన శాయశక్తులా చేయ కలిగింది తప్పక చేయగలదు.

*గ్రంథాలయాల వారోత్సవాల సందర్భంగా 198౨*
*నవంబరు 20 న హైదరాబాదులో*

# గురవే నమః

భారత జాతి చరిత్రలోనేగాక మానవ జాతి చరిత్రలోనే సువర్ణాక్షరాలతో లిఖించదగినది ఈరోజు. సిక్కు మత ప్రవక్త, యుగపురుషుడు, భగవాన్ గురునానక్ జన్మించిన శుభదినం ఈ రోజు.

పుణ్యభూమి, కర్మభూమి అయిన భరతఖండంలో ఎందరో మహామహులు, మహాత్ములు జన్మించారు. ఆదర్శమూర్తి శ్రీరామచంద్రుని పాదధూళితో పవిత్రమైన పుణ్యభూమి ఇది. భగవద్గీత సందేశాన్ని లోకానికి అందించిన శ్రీ కృష్ణభగవానుడు జన్మించిన పవిత్ర స్థలం యిది. శాంతి, అహింసామూర్తి బుద్ధభగవానుడు పుట్టిన పునీత దేశం యిది. మత సామరస్యాన్ని ప్రబోధించి, పవిత్ర భావాలతో వున్నత ఆదర్శాలతో ముక్తి మార్గాన్ని చూపిన జగద్గురువు శ్రీ నానక్ అవతరించిన పుణ్యభూమి యిది.

గురునానక్ ఆత్మసాక్షాత్కారాన్ని పొంది, అనంతజ్ఞాన జ్యోతిని దర్శించిన అవతారపురుషుడు. భగవత్ స్వరూపి. పొగడ్తలకు పొంగిపోకుండా, విమర్శలకు కృంగిపోకుండా తాను నమ్మిన సిద్ధాంతాలతో, ఆదర్శాలతో నిర్భయంగా ముందుకు సాగిన మహనీయుడు ఆయన. అజ్ఞానాంధకారంలో పడి కొట్టుమిట్టాడుతున్న లక్షలాది ప్రజానీకానికి భక్తి సందేశాన్ని అందించి వెలుగుబాట చూపిన ధన్యజీవి ఆయన.

కోరికలు తీరినకొద్దీ వృద్ధి పొందే తత్వం కలవని, అగ్నిలో ఆజ్యం పోసినట్లు కోరికలు ప్రజ్వరిల్లి నిరాశకు, దుఃఖానికి దోహదం చేస్తాయని ఆయన బోధించారు. కోరికలను కట్టడిచేసి, దృష్టిని అంతర్ముఖం చేసి అమృతాస్వాదన చేయవలసిందిగా ఆయన ప్రబోధించారు. కేవలం

శాస్త్రీయ పరిజ్ఞానంవల్ల లాభం లేదని, జీవితమే నిజమైన పాఠశాలని, అనుభవ పూర్వకంగా నేర్చుకున్న పాఠాలు ఎక్కువ విలువైనవని ఆయన చాటి చెప్పారు. మనం సంపాదించిన ఆస్తి పదిమందికి ప్రయోజనకారి అయినప్పుడే చరితార్థమవుతుందని ఆయన వివరించారు. పేద ప్రజలకు సహాయం చేయడమే, దీనులను ఆదుకోవడమే మానవుని ప్రథమ కర్తవ్యమని మానవసేవే మాధవసేవ అని ఆయన నొక్కి వక్కాణించారు.

గురునానక్ బోధనలు నాడే కాదు నేడు కూడా శిరోధార్యాలే. నేడే కాదు. ఏనాటికీ అవి మానవాళికి అవశ్యం అనుసరణీయాలే.

*గురునానక్ జయంతిసందర్భంగా హైదరాబాదులో 1983 నవంబరు 20 వ*

# మన కట్టమంచి

కట్టమంచి రామలింగారెడ్డి తెలుగువారు సగర్వంగా చెప్పుకోదగ్గ వ్యక్తి. మహా మేధావి. గొప్ప పండితుడు. ప్రముఖ విద్యావేత్త. చక్కని రచయితే కాదు విమర్శకుడు కూడా. అన్నిటినిమించి బహుముఖ ప్రతిభా శాలి, సమర్థుడైన కార్యశీలి. రాజకీయాల్లో, అర్థశాస్త్రంలో ప్రతిభా సామర్థ్యాలు గల ప్రజ్ఞావంతుడు. తెలుగుభాషకు తెలుగుసీమకు రెడ్డిగారు చేసిన సేవ ఎంతమాత్రమూ విస్మరించరానిది. సాహితీ రంగంలో ఎంత వున్నత శిఖరాలను అధిరోహించగలిగారో విద్యారంగంలోనూ అంత వున్నత స్థాయికి చేరుకోగలిగారు. ఒకవైపు సాహిత్య కృషి, మరోవైపు విద్యారం గంలో పురోగమన ప్రస్థానం, ఇంకోవైపు రాజకీయరంగంలో విరవిహారం- యిన్ని విధాలుగా బహుముఖ ప్రతిభతో తెలుగునాట తన యశస్సును మూలమూలల్లోకి ప్రసరింపజేసి చిరస్మరణీయుడైన వ్యక్తి ఆయన.

తెలుగునాట ప్రముఖ విద్యావేత్త, తత్త్వవేత్త, రాజనీతిజ్ఞుడు, ఆచా ర్యుడు అయిన డాక్టర్ సర్వేపల్లి రాధాకృష్ణన్‌తో సరిపోల్చదగినవ్యక్తి డాక్టర్ కట్టమంచి రామలింగారెడ్డి. పొట్టిగా చెప్పాలంటే సి. ఆర్. రెడ్డి. ఆయనలాగే ఆంగ్లభాషలోనూ, తెలుగులోనూ అనర్గళంగా ఉపన్యసించ గల దిట్ట. ఆచార్యత్వంలోనూ, విజ్ఞాన పీఠాన్ని అధిరోహించడంలోనూ ఇద్దరిలో పోలికలు కూడా వున్నాయి. ఈ యిరువురు మహావ్యక్తులే. తెలుగునేలలో విజ్ఞానకాంతులు యీనాడు యింతగా విస్తరించడానికి కారకులని గట్టిగా చెప్పవచ్చు.

ఆంధ్ర విశ్వవిద్యాలయం అనే మర్రిగింజ నాటి మహావృక్షంగా పెంపొందించిన ఘనత రెడ్డి గారిదే. సి.ఆర్. రెడ్డిగారు కేంబ్రిడ్జి విశ్వవిద్యా లయంలో చదువుకున్న అనుభవాన్ని, అక్కడి క్రమశిక్షణ, బోధన, పరి శోధన పద్ధతులను ఆంధ్ర విశ్వవిద్యాలయంలో వ్యవస్థాపించి, విద్యార్థు లకు విజ్ఞాన జ్యోతులను అందించే పరమ పవిత్రమైన ఆధునిక విజ్ఞాన కేంద్రంగా దానిని తీర్చిదిద్దారు.

ఆంగ్లసాహిత్యంలో, ఆంగ్లభాషలో కొద్దోగొప్పో పరిచయం వున్న వారు తెలుగుభాషా సాహిత్యాల మీద చిన్నచూపు చూడడం సర్వసాధారణం. కాని సి. ఆర్. రెడ్డిగారు దీనికి భిన్నమైన వ్యక్తి. ఆంగ్లభాషమీద, ఆంగ్ల సాహిత్యం మీద విశేషమైన అధికారాన్ని సంపాదించి కూడా వారు తెలుగు భాషా సాహిత్యాలను అలక్ష్యం చేయలేదు. వేషధారణలో ఆంగ్లేయ ప్రభావం కనిపించినా ఆంతర్యంలోనూ, అభిమానంలోనూ ఆంధ్రత్వం మూర్తీ భవించేదని పలువురు సమకాలికులు చెప్పిన మాట మనం విస్మరించడానికి వీల్లేదు. తెలుగులో వారు వ్రాసిన గ్రంథాలు సాహితీ జగత్తులో మణిదీపా లుగా నాడు, నేడు పరిగణిస్తున్నారంటే వారి ప్రతిభ ఎంతటిదో, తెలుగు భాష పట్ల వారికున్న ఆదరాభిమానాలు ఎట్టివో తేలికగానే మనం అర్థం చేసుకోవచ్చు. తెలుగులో రెడ్డిగారు మంచి పండితులు. సునిశిత విమర్శకులు. చక్కని వ్యాసకర్తలు. చివరకు స్వయంగా కవులు. వీరి కవిత్వంలో చక్కని భావుకత, వ్యాసాలలో బహు విషయ పరిజ్ఞానం, విమర్శలో నిష్పక్షపాత వైఖరితోపాటు వాడీ, వేడీ వున్నాయి.

సి. ఆర్. రెడ్డి గారు విద్యావేత్త, రచయిత మాత్రమేకాదు, రాజనీతిజ్ఞులు కూడా. విద్యారంగంలో నుంచి రాజకీయాలలోకి అడుగుపెట్టి శాసనసభలోకి ప్రవేశించి తన అనర్గళ వాగ్ధోరణితో అశేష విషయ పరిజ్ఞానంతో, నిర్భయ నిర్మోహమాటనైజంతో యావత్తు సభనూ ఆకట్టుకుని ప్రవర్తించారంటే అది ఆయనవంటి బహుకొద్దిమందికే చేత నౌతుంది. సామర్థ్యం వున్నప్పుడు, చిత్తశుద్ధి వున్నప్పుడు, స్వార్థంలేనప్పుడు, ప్రజాసేవే అంతిమ లక్ష్యంగా యోచించినపుడు—అటువంటప్పుడు మాత్రమే ఆయనలాగా వ్యవహరించడానికి వీలవుతుంది. ఇటువంటి లక్షణాన్ని బహుకొద్దిమందిలో మాత్రమే చూడగలం.

ఇంతటి బహుముఖ ప్రతిభావంతుని గురించి ఈనాటి తెలుగువారికి వివరించవలసిన అవసరం ఎంతైనా వుంది. కాలంతోపాటు విలువలు కూడా మారిపోతున్నాయి. వెనుకటి అకుంఠిత దీక్ష, ఆనాటి సేవానిరతి,

అప్పటి జ్ఞానార్జనాధోరణి గాని ఈనాడు కానరావడంలేదు. ఈనాటి యువకుల్లో నిర్మాణాత్మక కార్యకలాపాల పట్ల విజ్ఞాన పరిధులను విస్తరింపజేసుకోవడం పట్ల ఆసక్తి రేకెత్తించాలంటే అటువంటి మహనీయులను గురించి తెలియజెప్పాలి.

*శ్రీ కొల్లూరు కోటేశ్వరరావుగారు రచించిన 'మన కట్టమంచి' పుస్తకం ఆవిష్కరణ సందర్భంగా హైదరాబాదులో 1983 డిసెంబరు 10 న*



1983 ఆగస్టు 28న మెదక్ చర్చి సందర్శనం

1983 జూలై 3న నగరంలోని ముస్లిం సోదరులతో ఇఫ్తార్ విందుకు
ముందు ప్రార్థనా కార్యక్రమంలో



హైదరాబాదు లాల్‌బహదూర్ స్టేడియంలో 1984 జనవరి 9న
నూతన ప్రభుత్వ ప్రథమవార్షిక నివేదిక సమర్పణ



ప్రథమ వార్షిక నివేదిక సమర్పణోత్సవానికి హాజరైన అశేష ప్రజానీకం

# ప్రజల సేవలో పన్నెండు నెలలు

అపూర్వమైన అనురాగంతో, దూరాన్ని గమనించకుండా, శ్రమను లెక్క చేయకుండా ఈనాడు తెలుగునాడు నాలుగు చెరగులనుండి విచ్చేసి, నా జీవితంలో అనురాగపు దివ్వెలు వెలిగించిన నా ఆడబడుచులకు—

మిన్ను విరిగిందా? ఉవ్వెత్తుగా కడలి తరంగం ఆకాశాని కెగసిందా? ఆవేశం జ్వాలాతోరణంగా దిక్కుల జ్వలించిందా? అన్నట్లుగా ఆనాడు, ఈనాడు, ఏనాడూ వెన్నుకాపుండి, భావి అభ్యుదయ పథానికి దివ్వెపడుతూ 'అన్నా' అని కలవరించి, పలవరించి నాలో ఆవేశంరగిలిస్తున్న నాతమ్ముళ్లకు—

శ్వేత గులాబీల్లా, తెల్లని మల్లెపువ్వుల్లా తెలియని అమాయకపు నవ్వులతో పువ్వుల వర్షం నాపై కురిపిస్తూ, కళకళలాడుతూ, ముద్దుపలుకులు పలుకుతున్న చిట్టి చిరంజీవులకు—

అనుభవం పండిన పెద్దలకు—

నా ఆదర్శాలకు ఆశీఃపరమైన అమృతం చిలికిస్తూ, సదా నా విజయాన్ని ఆకాంక్షిస్తూ, క్రొత్తదనం ఈనాట చిగురిస్తుందని, నవ్యత సమాజానికి నాంది పలుకుతుందని ఎన్నో విధాలుగా, మరెన్నెన్నో రకాలుగా ఊహించుకొంటూ, నా గమనాన్ని గమనిస్తూ, నా ప్రగతి పథాన్ని నిత్యం జ్యోతిర్మయం చేస్తూ, నన్ను ముందుకు నడిపిస్తున్న నా వారందరకూ

స్వాగతం! మీకు సుస్వాగతం!

అనుభవాలు ఎన్నెన్నో ఈ జీవితంలో. కాని, మనసంటే మిగిలేవి కొన్నే వుంటాయి, అందులో. వాటి గురుతే మధురం. వాటి భావనే సుమధురం. అదే ఈ జనవరి 9 వ తేదీ విశిష్టత, ప్రత్యేకత. గడచిన జీవితానికి వెలుగు ప్రసాదించి ఈ క్రొత్త జీవితానికి క్రొత్త మలుపు చూపిన రోజిది. మానవశక్తి అప్రతిహతమైనదని నిరూపించిన రోజిది. మమత వెలకట్టలేనిదని నిర్వచించిన రోజిది. ఇదే నా జీవితానికి పండువైన రోజు. నిస్పృహా నిరాశలను దూరంచేస్తూ, నా మానవ సేవా పరమార్థాన్ని నాకు

ప్రబోధించిన రోజిది. ఈనాడు ఏ గడ్డమీద నిలబడి బాధ్యతతో మనసు విప్పి నా సంవత్సర అనుభవం మీకు నివేదికగా అందజేయాలని నిర్ణయించుకొన్నానో, అదే ఈ గడ్డమీద ఆనాడు మీ సమక్షంలో నా జాతికి, తెలుగు జాతికి నా జీవితాన్ని అంకితం చేసి ప్రమాణం చేసిన రోజిది.

మీరిచ్చిన బాధ్యతను, కట్టబెట్టిన అర్హతను, విశ్వాసంతో వుంచిన గౌరవాన్ని నిలబెడతానని, తెలుగువారి ఆత్మ గౌరవాన్ని పెంపొందించి, తెలుగు సంస్కృతీ వికాసాన్ని ప్రభావితం చేస్తానని ప్రమాణబద్ధంగా పదవీ స్వీకారం చేసిన రోజిది.

అధికారానికి సరయిన నిర్వచనం మానవ సేవేనని, అది ప్రతివ్యక్తికీ అందించటమే పరమార్థమని, దృఢ దీక్షతో జాతికి అంకితమైన రోజిది.

యుగాలు, శతాబ్దాలు, దశాబ్దాలు, ఏళ్లు, నాళ్లు ఎన్ని గడచినా మానవ సమాజం మనుగడ హెచ్చుతగ్గుల తూకంలో, అసమానత్వంలో, అంటరాని తనంలో, కులమత విద్వేషాలలో నలిగిపోతున్న పాత సామాజిక ఇతిహాసానికి మంగళం పాడాలని మనోనిశ్చయం చేసికొన్న రోజిది.

బడుగువర్గాలకు వారసత్వంగా, పీడిత ప్రజలకు తలరాతగా, విధి వ్రాతగా, కర్మ సిద్ధాంతంతో సరిపెట్టుకుంటున్న ఆ కుళ్లిపోయిన పాత విధానాలకు, ప్రవచనాలకు అంతు చెప్పాలనుకొన్న రోజిది.

ఆత్మార్పణతో సాధించిన స్వరాజ్యం జాతికి మేలుకొలుపు పలుకుతుందని, బలిదానంతో, పెద్దల త్యాగంతో, యువకుల రక్తార్పణతో ఎదలో వుంచుకొన్న, పెంచుకొన్న ఆశలను పండించకపోగా, భవిష్యత్తునే శూన్యం చేస్తూ, జాతీయ వికాసాన్ని కించపరుస్తూ, స్వరాజ్యానికి నిర్వచనం స్వార్థమనే చేతలు జాతిని పిండి పీడిస్తున్న నిరంకుశ విధానానికి గుండె నిబ్బరంతో ఎదురు నిలవాలని...

సామాన్య మానవునికి ప్రాథమిక అవసరాలయిన తిండి, గుడ్డ, నీడ అందివ్వాలని...కుల మత వర్గాలకు అతీతమైన, సమ సమాజానికి సరయిన నిర్వచనం చెప్పాలని...

పాత పునాదిలో విశ్వజనీనత లేకుండా చేసిన శాసనాలు సామాజిక అభివృద్ధిని సాధించలేకపోయాయని చెప్పాలని...

ఒకే కడుపున ఒకే రక్తాన్ని పంచుకొని పుట్టినా, సమాన హక్కులు లేక, పాతవై, రోతపుట్టే అనాగరిక సాంప్రదాయాలలో, అవమానాలపాలై నలిగిపోతున్న ఆడబడుచులకు స్వతంత్ర జీవనం కల్పించాలని, న్యాయసమ్మతమైన, ధర్మ సమ్మతమైన జన్మహక్కు వారికి కలిగించాలని...

గోడు వినేవారు లేక, న్యాయమందించే నాథుడు కానరాక, గుడ్లనీరు గుడ్లనే కుక్కుకుంటూ బ్రతుకు భారంగా మోస్తున్న బడుగువర్గాలకు విముక్తిపథం చూపాలని...

రక్తాన్ని చెమటగా వారపోస్తూ, హలాలుబట్టి, బీడు భూములను పగంగొట్టి దేశానికి యింత కూడు పెడుతున్న అన్నదాత రైతన్న ఊసురోమని అనకుండా క్షేమంగా ఉండాలని...

శ్రమజీవులు, కష్టజీవులు, బడుగుజీవులు, క్షుధితులు, బాధితులు, వ్యధితులు, తమతమ యిక్కట్లను మరచి ఒక్కటై క్రాంతిపథంలో దేశ సౌభాగ్యానికి కృషిచేసే విధానం కల్పించాలని...

అరుకోట్ల తెలుగు ప్రజానీకానికి, అన్ని అవకాశాలు సమంగా పంచి పెట్టాలని...

ముక్కుపచ్చలారని నిరుపేదల నిర్భాగ్యపు సంతానం అంధకారంలో, అజ్ఞానంలో, మురికివాడల్లో, మురుగు గుంటల్లో స్వార్థసమాజానికి బలై వెలై, నేరస్తులై, వ్యాధిగ్రస్తులై శూన్యంలో కలసిపోకుండా, వ భవిష్యత్ పౌరులుగా క్రాంతిపథంలో కేరింతలతో పరవళ్లు తొక్కు పరిగెత్తేలా మలచాలని...

ఎన్నో, ఎన్నెన్నో, మరెన్నో ఊహించుకున్నాను ఆనాడు. ఈనాడు, చేసిన వెన్నైనా చేయవలసిన వెన్నెన్నో...

అనుభవం లేదంటారు కొందరు. ఆవేశం ఎక్కువంటారు మరి కొందరు. ఎవరేమన్నా, ఏమనుకున్నా భావన అదే, బాధ్యత అదే. గమ్యం అదే.

సమర్థతను సమర్థించుకోను. చేసినవి చేశానని నేననను. సాక్షులు మీరు. మీకు సమాధానం చెప్పవలసింది నేను.

అందుకే వినమ్రతతో ప్రభుత్వపరంగా నిర్వహించిన సామాజిక కార్యక్రమాలను, తీరుతెన్నులను తెలుగుదేశ ప్రభుత్వ పాలన ప్రథమ వార్షిక సుముహూర్త సందర్భంలో ప్రభుత్వ వార్షిక నివేదికను మీముందుంచుతున్నాను— సహృదయంతో స్వీకరించవలసిందిగా నా ఆరుకోట్ల అన్నదమ్ములనూ, ఆడబడుచులనూ కోరుతున్నాను.

నా పోకడలో, నడకలో వచ్చిన తొలి మలుపే ఒక అవగాహన యిచ్చింది. 'అన్నదాత' అన్న పేరుండి, అపూర్వ వ్యావసాయిక కృషి ఉండి, నిక్షేపమైన నీటి వనరులుండి, ధాన్యపు గాదులు నింపే సుక్షేత్రమనిపించుకొన్న మన మాగాణములోనే చేయి నోటికందే ప్రాప్తిలేక నిత్యార్తులై, అన్నార్తులై, క్షుధార్తులై, బాధితులై, వేధితులైన పేద ప్రజానీకం ఆకర్షించింది నా తొలి చూపును.

కాలే కడుపులతో, మండే డొక్కలతో బిడ్డలగోడు వినలేక కంటనీరు కంటనే క్రుక్కుకున్న నిరుపేద ఆడపడుచుల దీన దయనీయమైన దుస్థితి, మళ్లించింది నా మనసును అటువైపు.

రెక్కాడినా డొక్కాడని కరువు జీవితంలో కడరుచు లెరుగక, చేసిన కష్టం కడుపు నింపక కటకట పడుతున్న బడుగు వర్గాల బాధారవం మేలుకొలిపింది నన్ను.

నోరు పెగలక, గోడు వినేనాథుడు లేక, తరతరాల దాస్యంలో తల దాచుకొనడానికి నీడలేని అనాథుల, నిర్భాగ్యుల, నిరుపేదల, హతాశుల, గతాశుల దురవస్థ కలచివేసింది నా మనస్సును.

ఆదినుండీ మీ ఆదరాన్ని అందుకున్న అదృష్టశాలిగా, నమ్మకాన్ని పంచుకొన్న మీ మనిషిగా ఆలోచించుకున్నాను—ఏమివ్వగలిగాను నా వారికి, నా జాతికని. ఎలా ఆదుకున్నాను ఇక్కట్లలో మునిగిన నా వారినని, ఏ పరమార్థం దర్శించుకున్నాను, నా ఈ జీవితానికని.

ఆలోచించినపుడు ఆ వేడి భావాలతో నిర్ణయించుకున్నాను నావారు మీరని, మీకు నేనని, మీ ఋణం యిసుమంతైనా తీర్చుకోవాలని, షష్టిపూర్తి నిండిందిగాని పండలేదు నా జీవితమని, ఇక మీ సేవే కర్తవ్యమని.

ఆవిర్భవించింది తెలుగుదేశం 1982 మార్చి 29 న. దూసుకు పోయింది తెలుగువారి ఎదలో— వడిగా, సుడిగా, ప్రభంజనంలా.

లిఖించింది క్రొత్త చరిత్ర, మాసిన రాజకీయ పుటలపై.

ఈ విజయం చెప్పింది— ఈనాటి సమాజానికి కావలసిన మానవతా సిద్ధాంతం. అందుకే భావించాను ముందుగా, పేదల సంక్షేమమే ప్రభుత్వ పరమార్థంగా.

కాలే కడుపులకు, మండే డొక్కలకు అన్నం అందించాలనుకున్నాను అందుబాటైన ధరకే. ఆ ఆలోచనా ఫలితమే రెండు రూపాయలకు కిలో బియ్యంపథకం. దీనికి దాదాపు 108 కోట్లు పాలీనా సబ్సిడీ పరంగా ఖర్చవుతున్నా—ప్రభుత్వం నిర్ణయించుకున్నది పట్టుదలగా ఈ పథకం అమలుపరచ వలసిందేనని.

కేవలం పైసలు లెక్కపెట్టే చిల్లరకొట్టు కాకూడదు ప్రభుత్వం. పేదల సంక్షేమాన్ని లక్ష్యంగా పెట్టుకొన్న పవిత్రమైన వ్యవస్థ కావాలది. ఈనాడు కోటి పైచిలుకు పేదల కుటుంబాలకు లభిస్తున్నదీ కార్యక్రమ ఫలితం.

తిండి, బట్ట తరువాత కావలసింది నీడ. అది నోచుకోని నిరాధారుల కుటుంబాలకే శాశ్వత గృహనిర్మాణ పథకం, ఇండ్ల స్థలాల పంపకం.

నిర్ణయించుకొన్నాము జిల్లాకు పదివేల చొప్పున 2,20,000 కుటుంబాలకు నివాసం కల్పించాలని ఈ పాలన. కట్టలేకపోయాం అను కున్న మొత్తం అడ్డు తగిలిన అవాంతరాలవల్ల, ఎదురయిన ప్రకృతి వైప రీత్యాలవల్ల. 1,40,000 పైగా గృహాల నిర్మాణం రూ. 88 కోట్ల ఖర్చుతో చేపట్టబడింది. అయినా అనుకున్నవన్నీ పూర్తి చేయలేకపోయా మన్న ఆవేదన మనసులోవుంది.

ఈనాడు కూడా కొన్ని ప్రాంతాలలో త్రాగే నీరులేక ఆడబడుచులు మైళ్లు తరబడి మండుటెండలో కుండలు భుజాన పెట్టుకొని వెళ్లడం అనాగరికం, శోచనీయం. ఇందుకే గ్రామాలలో ప్రతి నూరుమంది జనాభాకు కనీసం ఒక త్రాగు నీటి వసరు కల్పించాలన్న తాపత్రయం. ఈ సందర్భంలో ఒక వాస్తవం మీ ముందుంచుతున్నాను. 1975 నుండి

మార్చి 83 వరకు ఎనిమిది సంవత్సరాల సుదీర్ఘ కాలంలో 74,303 గొట్టపు బావులు త్రవ్వగా, ఏప్రియల్ 83 నుండి నవంబరు వరకు ఎనిమిది నెలల స్వల్ప కాలంలో 20,140 గొట్టపుబావులు వేయటం జరిగింది.

కూలి డబ్బులకోసం, కడుపుమంట చల్లార్చుకోవటం కోసం బిడ్డలను చాకిరీకి పంపించే దురదృష్ట విధానం దూరం చేయటానికే మధ్యాహ్న భోజన పథకం. అంతో ఇంతో అక్షర జ్ఞానంతోపాటు ఒక్క పూటైనా పౌష్టికాహారం వారికి లభింపజేయడమే దీని పరమార్థం. సమాదరణతో కొందరు సహకరించకపోవటంవల్లనే అనుకొన్నంత ఫలితం అందుకోలేక పోయినా, తృప్తిపడుతున్నారు ఈనాడు అందుకోగలిగిన లక్షలాది చిరం జీవులు.

అర్ధాంగి, సమభాగిని అని ఎన్నో పొగడ్తలు చెపుతున్నాం. కాని తరాలు గడచినా, యుగాలు మారినా తత్వం మారలేదు మగవారికి. స్వార్థం చావ లేదు సమాజానికి. వరకట్నంలాంటి సాంఘిక దురాచారాలకు బలియై, సామాజిక అసమానతలకు, అవమానాలకు గురి అవుతున్న ఆడబడుచులకు స్వతంత్ర ప్రతిపత్తితో కూడిన సమజీవనం కలిగించాలన్నదే ప్రభుత్వ ఆశయం. మహిళాభ్యుదయమే మానవ సమాజ నాగరికతకు సంకేతం. అందుకే ఒకతల్లి కడుపున ఒకే రక్తం పంచుకొని పుట్టినవారు— ఆడైనా మగైనా వారికి పిత్రార్జితంలో సమాన హక్కులు కలిగించాలన్నదే ప్రభుత్వ తీర్మానం.

ఈ భావనతోనే ఆడవారికి అనువైన అన్నిరకాల ఉద్యోగాలలో 30 శాతం వారికి ప్రత్యేకించడం.

మహిళల స్థితిని మెరుగుపరచడానికి అనువైన ఆదర్శ విద్యా విధానానికే తిరుపతిలో పద్మావతీ మహిళా విశ్వవిద్యాలయం. ఉపాధి కోసం పట్టణాలలో పనిచేస్తున్న ఆడపడుచుల సౌకర్యార్థం జిల్లాకు కనీసం ఒక మహిళా వసతి గృహం ఏర్పాటు.

కాలం దొర్లుతున్నా కనీస సౌకర్యాలకు నోచుకోని ఆడబిడ్డలకు గ్రామానికో ఆధునిక మరుగుదొడ్డి నిర్మాణంతోపాటు, హేయమైన

వృత్తినుండి— వారి జీవన సరళికి భంగంకాని రీతిలో, పాకీ పనివారికి విముక్తి కలిగించటానికే 'విముక్తి' పథకం.

నవ్యతకు నాంది పలుకుతోంది యువత. ఉత్సాహంతో ఉరకలు వేస్తూ ఉత్తుంగ తరంగంలా ఆకాశాన్నంటుతోంది తమ్ముళ్ళ ఆవేశం. ముందుకు సాగుతున్న యువశక్తికి స్వాగతం పలుకుతున్నది ప్రభుత్వం. భవిష్యత్ నిర్ణేతలు వారు. భావి భాగ్యవిధాతలు వారు. నవసమాజ నిర్మాతలు వారు. చైతన్య సారథులు వారు. ఈ భావనతోనే నిరుద్యోగ నైరాశ్యాన్ని నిర్మూలించి, క్రమశిక్షణా పూరితమైన రాష్ట్ర, గ్రామాభ్యుదయ నిర్మాణ శక్తిగా యువతను మలచి, అభ్యుదయ కార్యక్రమాలలో విలీనం చేయడమే 'యువశక్తి' పథక ప్రయోజనం. ఎంపిక చేయబడ్డాయి 7 జిల్లాలు— జిల్లాకు 200 గ్రామాలతో, క్రమంగా విస్తరిస్తుంది రాష్ట్రవ్యాప్తంగా.

రాష్ట్రాభివృద్ధిలో పాలుపంచుకొంటూ మోడువారిన ఊసరభూములను హలాలతో పగలదున్ని పసిడిపంటలు పండించే అన్నదాత రైతన్నకు సహేతుకమైన సంతృప్తిని కలిగించడం బాధ్యతగా భావిస్తోంది ప్రభుత్వం. అందుకే ధాన్యానికి క్వింటాలుకు కేంద్రం నిర్ణయించిన ధర రూ. 136 కాగా రైతు సోదరులకు పది రూపాయలు హెచ్చుగా గిట్టేట్లు రూ.146 గా నిర్ణయించింది రాష్ట్ర ప్రభుత్వం. పంచదార చెరకుకు రాష్ట్ర సలహా ధర కేంద్రం నిర్ణయించిన ధరకన్నా టన్నుకు రూ. 50 అదనంగా లభించేటట్లు, రూ. 185 గా నిర్ణయించబడింది. దీని ననుసరించి, చక్కెర ఫ్యాక్టరీల ద్వారా రైతులకు ప్రభుత్వం అందజేసిన సహాయం రూ. 12 కోట్లు. వేరుశెనగకు సలహా ధర క్వింటాలుకు రూ. 425 గా నిర్ణయించింది. పొగాకు అమ్మకం కాని రైతులకు వడ్డీలేని ఋణ సహాయంగా ఇచ్చినది రూ. 2 కోట్లు.

పొగాకు ఉత్పత్తిదారులు సాగించిన ఆందోళనలో, వారి సమస్యలను పరిశీలించి, పరిష్కరించే అవకాశంలేని స్వల్ప వ్యవధిలో టంగుటూరంలో కాల్పులు జరగటం దురదృష్టకరం. ఈ సంఘటనపట్ల నా శోకపూరిత విచారాన్ని వెలిబుచ్చుతూ, మరణించిన రైతుబిడ్డల కుటుంబాలకు నా ప్రగాఢ సానుభూతి సంతాపాలను మరల వ్యక్తం చేస్తున్నాను.

పాడి పంటలతో పౌర జన సంక్షేమాన్ని, పుష్టికరమైన ఆహార పంపిణీ విధానాన్ని దృష్టిలో పెట్టుకొంటూ, పాల ఉత్పత్తిదారులకు అంద జేయగలిగినంత మేరకు గిట్టుబాటు ధర లభింపజేయటం పాలక వ్యవస్థ ఆదర్శం. అందుకే పాల సేకరణ ధర పెంచి ఉత్పత్తిదారులకు ప్రయోజనం చేకూర్చడం జరిగింది. కుటుంబ బాధ్యత వహిస్తూ, పశుగణ పోషణ చూచుకొంటూ, ఆత్మీయతతో అనుక్షణం పాడిపంటల అభివృద్ధికే అంకిత మవుతున్న మా ఆడబడుచులకు సాధ్యమైనంత పుత్సాహం ఇవ్వా లన్నదే ప్రభుత్వ ధ్యేయం.

సంస్కృతీ సంస్కారాలను, చైతన్య వికాసాలను పలికేది పలుకు. భాషను గౌరవించుకోలేని జాతికి గౌరవం లేదు. భాషాప్రయుక్తరాష్ట్రాల విభజన ఫలితంగా తెలుగువారి రాష్ట్రంగా అవతరించిన తెలుగునాడులో తెలుగుభాష అన్ని స్థాయిలలో అధికారభాష చేయబడింది.

అర్హతకు గుర్తింపు లభించాలని, విద్య బజారులోపెట్టి వేలంపాడే సంత సరుకు కాకూడదని, అందరికీ అది అందుబాటులో వుండాలని, సమానావకాశాలు అందరికీ కలిగించబడాలన్న పవిత్ర భావంతో, వ్యాపా రాత్మకంగా మారిన విద్యా విధానానికి స్వస్తి చెప్పడానికే క్యాపిటేషన్ ఫీజు రద్దు చేయటం జరిగింది.

ఏ చెట్టు నీడనో, చెరువు గట్టునో విద్యాబోధన సాగకూడదన్న సత్సంకల్పంతో పల్లెపల్లెన ప్రాథమిక పాఠశాల భవనం నిర్మించాలన్నది ప్రభుత్వ నిర్ణయం. ఈ పథకంక్రింద సుమారు లక్ష పాఠశాలల భవనాలు అంచెలవారీగా నిర్మించబడుతున్నాయి.

ఉపాధ్యాయుల కొరత తీర్చడానికి వివిధ స్థాయిలలో 16,700 మందికి పైగా నియామకం జరుగుతున్నది.

సమాజంలో విద్యా సముపార్జనాసక్తిని పెంపొందించడంకోసం ఎవ రయినా వారివారి ఉద్యోగాలు, వృత్తులు నెరవేర్చుకుంటూ, తమ అభిరుచికి అనుగుణంగా ఉన్నత విద్యార్హతలు పొందడానికి దోహదం చేసే సార్వత్రిక విశ్వవిద్యాలయానికి రూపు రేఖలు దిద్దడం జరిగింది.

తెలుగుభాషా సంస్కృతి విజ్ఞాన వికాసాలకు నిలయం—స్థాపించ నున్న తెలుగు విశ్వవిద్యాలయం.

బానిస బోధనా విధానాన్ని ఆవలకునెట్టి వృత్తిపరమైన సాంకేతిక విద్యా బోధనతో విద్యార్థులు కేవలం ఉద్యోగాలకే అర్రులు చాచకుండా, స్వతంత్రంగా స్వయం ఉపాధిని ఏర్పరచుకొనే అవకాశం వారికి కల్పించ డానికే విద్యాబోధనా విధానంలో విప్లవాత్మకమైన సంస్కరణలు ప్రవేశ పెడుతున్నది ప్రభుత్వం.

ఆటవికులుగా, అమాయకులుగా అజ్ఞానాంధకారంలో మగ్గుతున్న హరిజన, గిరిజన, వెనుకబడిన వర్గాల బాల బాలికల జీవితంలో వెలుగు ప్రసాదించడానికి జిల్లాకు రెండు చొప్పున రెసిడెన్షియల్ పాఠశాలల ప్రారంభం.

అభివృద్ధి కోరుతున్న సమాజానికి అవసరమైన విద్యా సదుపాయా లను కలుగజేయడానికి ఎన్నో కళాశాలలు ఈనాడు ప్రారంభించబడ్డాయి.

నీరు నేలను తాకగానే మట్టి మాణిక్యం అవుతుంది. పసిడిపంటలతో అన్నపూర్ణమ్మ నిండుగా నవ్వుతుంది. సుభిక్షంతో దేశమాత నిండుతనం సంతరించుకుంటుంది. కృష్ణా, గోదావరి, తుంగభద్ర, వంశధార, పినాకినీ, మానేరు, మంజీరా మొదలైన నదీజలాలతో పునీతం కావడం తెలుగుగడ్డ విశేషం. ఉన్న వనరులన్నీ అనుభవానికి తెచ్చుకోవడం, పూర్తిగా వినియో గించుకోవడం మన కర్తవ్యం. అందుకే అసంపూర్తిగా వున్న ప్రాజెక్టులను పూర్తిచేయడం, క్రొత్తవానిని నిర్మించుకోవడం ప్రభుత్వం విద్యుక్త ధర్మంగా భావిస్తున్నది.

కోటి రతనాలవీణ మన తెలంగాణాను సస్యశ్యామలమైన మాగాణంగా సంపూర్ణ స్వరూపం కలిగించడానికి కాకతీయ కాలువ రెండవ దశ నిర్మాణం ప్రారంభం. శ్రీశైలం ఎడమకాలువ నిర్మాణానికి రెగ్యులేటరుతో ప్రారంభించి త్వరలోనే పూర్తిచేసే ప్రయత్నం.

అదేవిధంగా, రాయలేలిన సీమ రతనాలసీమగాని రాళ్లసీమగాదని నిరూపించడం ప్రభుత్వ ఆశయం. ఈ ఆశయం కోసమే శ్రీశైలం కుడి కాలువ నిర్మాణం పూర్తిచేయడం. ఎన్నేళ్ళుగానో ఆలోచనలోనే వుండి

ప్రకృతిని సంతరించుకోలేని—మద్రాసుకు మంచినీటిని అందించే పథకాన్ని తెలుగు గంగగా స్వరూపం నిర్ణయించడం. ఆ పరమార్థంతోపాటు ఎడారియైనా రాయలసీమలో బీటలువారిన భూములను, ఊసర క్షేత్రాలను నీటి సాగు క్రిందికి తెచ్చి నందనోద్యానవనం చేయాలన్నసంకల్పంతోనే కర్నూలు, కడప, చిత్తూరు జిల్లాలలో లక్షలాదిఎకరాలకు తెలుగు గంగను పరుగులెత్తించటం.

కర్ణాటక రాష్ట్ర ప్రభుత్వంతో సంప్రదింపులు జరిపి, నిరంతరం నీటికై తపిస్తున్న, నిర్లక్ష్యం చేయబడిన అనంతపురం, చిత్తూరు జిల్లాల బీడు భూములకు నీరు అందించే ప్రయత్నం చేయబడుతున్నది. పులి కంటి రిజర్వాయరు నిర్మాణ అవసరాన్ని గుర్తించి నిపుణులతో దానికి సంబంధించిన పథకాలను తయారుచేయించి సెంట్రల్ వాటర్ కమిషన్ వారి ఆమోదానికై ఇదివరకే పంపడం జరిగింది.

ఉత్తరాంధ్ర ఉపాధికి జీవనాడి అయిన వంశధార ప్రాజెక్టుకు సంపూర్ణ సమగ్ర స్వరూపం కల్పించడానికి ప్రభుత్వం సత్వర చర్యలు తీసుకుంటుంది.

పాలమూరు సీమకు సంపత్ప్రదాయినులైన జూరాల, భీమా ప్రాజెక్టులు, మిగిలిన ప్రాంతాలలో అసంపూర్తిగాగాని, ఆలోచనలోగాని వున్న మధ్య తరహా నీటిపారుదల ప్రాజెక్టులను, ఎత్తిపోతల పథకాలను, ఇతర నీటి వనరులను చేపట్టి మోడువారిన రైతుల ఆశలను చిగురింప జేయ డానికి ప్రభుత్వం కృషి చేస్తున్నది.

వెలుగు కావాలి—చీకటి కోణాలను ఛేదించటానికి. ఆ వెలుగు ప్రసరించాలి దశదిశలా. నిండాలి—ఇంటింటా, వాడవాడల, సీమసీమల. అధికంగా ఆహార పదార్థాలను పండించి, దేశానికి తిండి కరువు తీర్చాలన్న భావనతో వ్యవసాయ అవసరాలకు విద్యుచ్ఛక్తిని సాలుకు ఒక హార్సుపవర్ 50 రూపాయల స్లాబు రేటుకు సరఫరా చేస్తున్నది.

విద్యుత్ సరఫరాలో ఓల్టేజిలోని హెచ్చుతగ్గులతో సతమతమవుతున్న రైతుల యిబ్బందులను, ట్రాన్స్ఫార్మర్ల మొదలైనవాటి విడిభాగాల కొరతను ప్రభుత్వం గుర్తించి, వీటి నివారణ మార్గాలను అన్వేషించి, అమలుచేస్తుంది.

అపారంగా భూగర్భ జల సంపద వుండికూడ సరైన విధంగా అభివృద్ధి చెందని ఆదిలాబాదు, అనంతపురం, విజయనగరం మొదలైన వెనుకబడిన ప్రాంతాలలో ఆ జలనిక్షేపాన్ని వెలికి తీసి, ఆయా ప్రాంతాలను సస్యశ్యామలం చేసే అభివృద్ధి పథకాలకు అవసరమైన విద్యుచ్ఛక్తిని సరఫరా చేయడానికి ప్రభుత్వం అత్యధిక ప్రాధాన్యత యిస్తున్నది.

నిరుద్యోగ నిర్మూలనకు పరిష్కార మార్గం ప్రధానంగా పారిశ్రామికీకరణం. ఇంతవరకు కాగితాలమీదే వుండి, స్వరూపం సంతరించుకోని గోదావరి ఎరువుల కర్మాగారం, మంగళగిరి టైర్ల ఫ్యాక్టరీ మొదలైన భారీ పరిశ్రమల నిర్మాణానికి కృషి సాగుతున్నది. ఇక నాగార్జున ఎరువుల ఫ్యాక్టరీ సత్వర నిర్మాణానికి కావలసిన ఏర్పాట్లు చురుకుగా జరుగుతున్నాయి. అదేవిధంగా ఈ సంవత్సరం సహకారరంగంలో 5 చక్కెర ఫ్యాక్టరీలు ఉత్పత్తి ప్రారంభించనున్నాయి.

ఇంతవరకు అడుగున పడివున్న పరుచూరు స్పిన్నింగ్ మిల్లు నిర్మాణ కార్యక్రమం వెంటనే చేపట్టబడింది. ఇంకా తవుడు నూనె కర్మాగారాలు మొదలయిన పరిశ్రమలు రూపం దిద్దుకొంటున్నాయి. లఘు, గృహ, కుటీరపరిశ్రమలు వేలాదిగా ప్రారంభించబడ్డాయి.

గ్రామీణ పారిశ్రామికాభివృద్ధి కార్యక్రమాలలో భాగంగా, నిరుద్యోగులుగావున్న విద్యావంతులకు ఉపాధికల్పనకై చేపట్టబడిన జాతీయపథకం 'గ్రామోదయం'.

తరతరాలుగా తమ వృత్తుల కంకితమయి, సామాజిక ప్రగతికై తమ వంతు కృషిని సాగిస్తున్న కమ్మరి, కుమ్మరి, వడ్రంగి, మేదర్లకు, రజక, నాయీబ్రాహ్మణులకు, చర్మకార, చేనేత, మత్స్యపారిశ్రామికులకు, గొర్రెల పెంపకందారులకు, గీత పనివారలకు, ఇంకా ఇతర శ్రామికవృత్తి కళాకారులకు అందరికి స్వయం ఉపాధికల్పనా పథకాల ద్వారా సహాయం అందిస్తూ, వారి సంక్షేమానికై పాటుబడటం జరుగుతున్నది. ఈ కృషిని మరింత పటిష్టంగా అమలుచేయడానికి ప్రభుత్వం నూతన ప్రక్రియల నన్వేషిస్తున్నది.

ప్రతి జిల్లాలో అనుబంధ పారిశ్రామిక సముదాయాలను ఏర్పరచి విస్తృత పారిశ్రామికాభివృద్ధికి, నిరుద్యోగ నివారణకు ప్రభుత్వం చేపట్టిన మరో వినూత్న కార్యక్రమం 'దీప'.

పరిశ్రమల స్థాపనకు ఎంతో అవసరం విద్యుచ్ఛక్తి, నీరు, నేల, పారిశ్రామిక శాంతి. అవి పుష్కలంగా లభిస్తున్న మన రాష్ట్రంలో నూతన పరిశ్రమల స్థాపనకు ఔత్సాహికులైన పారిశ్రామికవేత్తలను ఆహ్వానించి, ప్రోత్సహించడానికి ఎన్నో చర్యలు తీసుకోబడ్డాయి. వారికి అందచేసే ఆర్థిక సహాయం, ఇతర సదుపాయాలు వారికి ఒకేచోట సక్రమంగా, సత్వరంగా లభించేట్లు ఏర్పాటు జరిగింది.

దేశ విదేశాలలో వున్న తెలుగువారిలో ప్రజ్ఞావంతులు, విజ్ఞానధనులు, సంపన్నులు— అందరూ దేశభక్తి పూరితులై రాష్ట్రాభివృద్ధిని కాంక్షించి ముందుకు రావాలని ప్రభుత్వం ఆహ్వానిస్తున్నది. వారికి వలయు సర్వ సౌకర్యాలు కల్పించడానికి ప్రభుత్వం సిద్ధంగా వున్నది.

తరతరాల తలరాతగా, పేదరికంలో క్రుంగుతూ, బ్రతుకే భారంగా మోస్తూ ఈనాటికీ సమాజంలో అట్టడుగున ప్రాగ్గుతున్న బలహీన, బడుగువర్గాలవారి సంక్షేమమే ప్రభుత్వలక్ష్యం. ఇందుకొరకే హరిజనులు, గిరిజనులు, వెనుకబడిన వర్గాలవారు, ఆర్థికంగా వెనుకబడినవారు— వీరందరి సంక్షేమానికి గత ఏడాది బడ్జెటులో కేటాయించిన మొత్తం కన్న ఈ ఏడాది రెట్టింపు మొత్తం కేటాయించడం జరిగింది. ఇందువలన లక్షలాది బడుగు వర్గాలవారి కుటుంబాలకు ఆర్థిక ప్రయోజనం సమకూరుతుంది.

మన రాష్ట్రంలో గుర్తింపబడిన వెనుకబడిన తరగతుల వారందరకూ మండల్ కమిషన్ చేసిన సిఫారసులను ప్రభుత్వం ఆమోదించింది, అమలు పరుస్తుంది. ఇది వారికి వరప్రసాదం వంటిది.

ఆరోగ్యకరమైన సామాజికాభివృద్ధికి, మచ్చలేని పరిపాలనకు గుర్తు అవినీతి నిర్మూలనం. అధికారం అంటే అహంకారమని, పదవంటే ప్రజలను దోచుకోవడమని నిర్వచనంగా నిరూపించబడుతున్న రోజులలో స్వచ్ఛమైన పరిపాలనకు, అవినీతికీ, అక్రమాలకూ దూరమైన పరిశుద్ధ సమా

జానికి నివాళులిస్తుంది ప్రభుత్వం. ఇది ఎన్నేళ్లుగానో పాకుడు బట్టి పూడుకుపోయిన కుళ్లు. పవిత్ర గంగా జలమంతా ఒకేసారితెచ్చి కడిగినా ఒక్క ఏడాదిలో శుద్ధికాదని అనుభవంలో తేలింది. ఎన్నో అవాంతరాలు, మరెన్నో అవరోధాలు, అడుగడుగునా అడ్డుపుల్లలు—అయినా ఆశ వుంది, మున్ముందు ఆదర్శవంతమైన పవిత్రభావాలకు, మచ్చలేని మనుగడకు అందరూ సహకరిస్తారని. ఈ ఆశయాలకు అనుగుణంగానే అవినీతి నిరోధకశాఖను పటిష్టం చేయడం, ధర్మ మహామాత్రను సృష్టించడం, ఆదర్శవంత రాష్ట్రంగా ఆంధ్రప్రదేశ్‌లో లోకాయుక్తను సమాయత్తపరచడం.

పొదుపు దుబారాకు అదుపు. మంత్రిమండలి కేవలం ప్రజాధనానికి ధర్మకర్తృత్వ వ్యవస్థమాత్రమే. ప్రభుత్వం ఖర్చుచేసే ప్రతి పైసాలో ఎందరో శ్రమజీవుల స్వేదబిందువులు, కష్టజీవుల కన్నీళ్లు కలిసి వున్నాయన్న సత్యం మరచిపోకూడదు. స్పష్టంగా చెప్పాలంటే ప్రభుత్వ ఖజానా ఘనీభవించిన ప్రజల సొత్తు.

ఈ ధనం ప్రజా సంక్షేమానికి, అన్నార్తుల, క్షుధార్తుల, బాధార్తుల వ్యథలు తీర్చడానికి వినియోగింపబడాలి. అనాడుగాని కాదు సార్థకమైన వ్యయాకర్షనం. అప్పుడు కాని లేదు ప్రభుత్వ వ్యయానికి అర్థం.

అధికార భోగాలకు, పదవీ లాలసతకు ఒక్క పైసా వినియోగించినా అది క్షమించరాని ప్రజాద్రోహం.

ఈ సందర్భంలో ఒక విషయం మీ దృష్టికి తేదలచివుంది. గత ప్రభుత్వంలో మంత్రి మండలికైన ఖర్చు దాదాపు కోటి యాభై లక్షల రూపాయలు కాగా మన ప్రభుత్వంలో మంత్రులకైన ఖర్చు రూ. 29 లక్షలు మాత్రం. గత ప్రభుత్వం మంత్రుల టెలిఫోన్లక్రింద 1982–83 లో రు. 62 లక్షల పైచిలుకు ఖర్చుచేయగా జనవరి 10 నుండి డిసెంబరు ఆఖరువరకు అయింది దాదాపు రు. 11 లక్షలు. అలాగే గతంలో మంత్రుల ప్రయాణభత్యాలక్రింద ఏప్రియల్ 1981 నుండి మార్చి 82 వరకు రు. 23.35 లక్షలు, ఏప్రియల్ 82 నుండి డిసెంబరు 82 వరకు రు. 15.46 లక్షలు కాగా జనవరి 83 నుండి

డిసెంబరు ఆఖరు వరకు 4.17 లక్షలు మాత్రం అయింది. ఇక గతంలో మంత్రుల జీతాలక్రింద 1981-82లో రు. 24.84 లక్షలు కాగా జనవరి 83 నుండి డిసెంబరు ఆఖరువరకు మన మంత్రుల జీతాలకై అయింది రు. 3.77 లక్షలు మాత్రం. మచ్చుకు కొన్ని మాత్రమే యివి. ఇంతకంటే ఏమి కావాలి నిదర్శనం—మన ప్రభుత్వ నిజాయితీకి, నిరాడంబరతకు?

ఇదీ స్థూలంగా ప్రభుత్వం నడిచిన ప్రగతిపథం.

ఈ వార్షిక శుభ పర్వదినాన నామీద నమ్మకంతో, నన్నింత అంతస్థులో వుంచి భవిష్యత్తు పురోగమనానికి వెలుగుబాట వేస్తున్న, నాపై ఎన్నో ఆశలు పెట్టుకొన్నవారిని మన ఆచార సాంప్రదాయాల ప్రకారం రిక్తంగా పంపటం నా భ్రాతృధర్మం కాదు. అందుకే రెండవ సంవత్సరంలో అడుగిడుతున్న ప్రభుత్వం అందిస్తున్నది కొన్ని చిరుకానుకలను — ప్రేమను పెనవేసుకొన్న ఆత్మార్పణ భావంతో కోరుతున్నాను అందరినీ అందుకోమని—

* అధికార వికేంద్రీకరణ ద్వారా రాష్ట్రాభివృద్ధి కార్యక్రమాలను అందరికీ అందుబాటులో వుంచాలనీ, ప్రజలందరినీ భాగస్వాములు చేయాలనీ ప్రభుత్వ పరమైన సిద్ధాంతం. కేవలం ప్రభుత్వంమీద ఆధారపడకుండా, ప్రతి విషయాన్నీ చేయిజాచి అడక్కుండా ప్రజలే వారి ప్రగతికి నిర్ణేతలుగా నిర్దేశించి ప్రజాస్వామ్య విధానానికి నూతనత్వం కల్పించాలన్నదే ప్రభుత్వ ధ్యేయం. అందుకే ఈ వార్షిక సదస్సులో అశేష ప్రజానీకం ముందు ప్రకటిస్తున్నాను—

మాండలిక రాజ్యాంగ పరిపాలనా విధానం.

35,000 నుండి 55,000 జనాభా పరిధిలో వున్న గ్రామాలన్నీ ఒక మండలంగా ఏర్పాటు చేయబడుతున్నాయి. రెవెన్యూ, సహకారం, సాంఘిక సంక్షేమం, వ్యవసాయం, పశుపోషణ, మార్కెటింగ్, క్రీడా, సంస్కృతీ విభాగం, విద్య, వైద్యం, పోలీసు కార్యాలయం మొదలైన సామాజికాభివృద్ధి కార్యక్రమాలన్నీ ఒకే పట్టున కూడబెట్టడమే ఈ మాండలిక విధాన పరమార్థం. కొద్ది పరిధిలో అతి పటిష్టమైన పరిపాలనా

సౌలభ్యాన్ని ప్రజలకు అందుబాటులో వుంచడం, ప్రజలే పాలకులుగా అధికారం వారికే అప్పగించడం ఈ వ్యవస్థ ఆదర్శం. అందుకే ఏర్పాటు చేయబడుతున్నాయి సుమారు 1200 రెవిన్యూ మండలాలు.

దీనికి ప్రారంభ చర్యగా మొదటి దశలో చేశాము గ్రామాధికార వ్యవస్థ రద్దు. నిరంకుశ బ్రిటిష్ పరిపాలనా వ్యవస్థకు, దిక్కుమాలిన నవాబుల దివాణాలకు అవశేషాలుగా మిగిలిపోయిన ఈ వ్యవస్థకు స్థానం లేదు— వినూత్న ప్రజా పరిపాలనా విధానంలో.

* దేవుడిచ్చిన భూమికి శిస్తేమిటి రైతన్నా! నీ ఆవేదన ఫలం [illegible] జేస్తూ ప్రకటిస్తున్నాను నేను ఈ సభాముఖంగా—వలస రాజ్యాధికార [illegible] వారసత్వంగా మిగిలివున్న భూమిశిస్తు విధానం రద్దు చేస్తూ.

* పీడిత, దళిత, వెనుకబడిన వర్గాలవారికి అందిస్తున్నాను శుభవార్త.

ప్రకటిస్తున్నాను ఈ సదస్సులో మీ సమక్షంలో— మండల్ కమీషన్ సిఫారసులను పూర్తిగా ఆమోదించామని, అమలుపరుస్తామని.

* ప్రకటిస్తున్నాను రాష్ట్రంలోని ముస్లిం, క్రైస్తవ [illegible] అల్పసంఖ్యాక వర్గాలవారికి, వారి సంక్షేమానికై రాష్ట్ర [illegible] మైనారిటీస్ ఫైనాన్స్ కార్పొరేషన్ నెలకొల్పనున్నదని.

* పలు భాషలు మాట్లాడే అల్ప సంఖ్యాకుల [illegible] డెక్కడ తగు సంఖ్యలో ఉంటారో అక్కడక్కడ వారి పిల్లలకు [illegible] బోధనకు అవసరమైన సదుపాయాలను, సౌకర్యాలను [illegible] కూరుస్తుంది అని ప్రకటిస్తున్నాను.

* అహర్నిశలూ దేశ సౌభాగ్యానికి, రాష్ట్ర [illegible] చెమటోడుస్తూ వివిధ పెద్దతరహా పారిశ్రామిక సంస్థలలో [illegible] వున్న కార్మిక సోదరులకు ఆయా సంస్థల యాజమాన్యాల ద్వారా [illegible] వసతి కల్పనకు నిర్ణయించింది ప్రభుత్వం. మధ్య, చిన్నతరహా [illegible] వున్న శ్రామికులకు ప్రభుత్వమే గృహనిర్మాణానికి సహాయం [illegible] తెలియజేస్తున్నాను.

* దిక్కు లేక, మొక్కు లేక, మొరాలకించే నాథుడు లేక విధి రాతనబడి నికృష్ట జీవితాన్ని గడుపుతున్న విధవ ఆడపడుచులకు సాలుసరి రూ. 1800 మించి ఆదాయం లేనివారికి నెలకు రు. 50 పింఛన్ ప్రకటిస్తున్నాను ఈ సదస్సులో.

* 'నాన్నా అన్నం తిన్నావా, బడికి పోతున్నావా' అని ఆత్మీయంగా పలుకరించి మంచి చెడులు గమనిస్తూ తన కౌగిలిలో ఓదార్చే అమృతవల్లి తల్లిని, ఆదరించే తండ్రిని దురదృష్టవశాత్తు పోగొట్టుకొని గాలిలో ఎగిరే చిగురాకులా గతితప్పిన జీవితాన్ని విధిరాతకు వదిలిపెట్టిన అనాథ బాల బాలికల సంక్షేమానికి శరణాలయాలను ఇకమీదట తానుగా నిర్మించి నిర్వహించాలన్నది ఈనాడు ప్రభుత్వం తీసుకున్న నిర్ణయం.

* మైళ్ల తరబడి విద్యా సముపార్జనకు వెళుతున్న పన్నెండు సంవత్సరాల లోపున్న చిట్టి దేవుళ్లకు, చిన్ని తమ్ముళ్లకు, చిన్నారి చెల్లెళ్లకు పాఠశాలలకు పోయి రావటానికి రాష్ట్ర మంతటా ప్రభుత్వ బస్సులలో ఉచిత ప్రయాణ సౌకర్యం కలిగిస్తున్నామని ప్రకటిస్తున్నాను.

* ప్రతి జిల్లాలో ఒక క్రీడా సాంస్కృతిక సమగ్ర వికాస కేంద్రాన్ని నెలకొల్పడానికి ప్రభుత్వం నిర్ణయించుకొంది. క్రమశిక్షణా బద్ధంగా యువ శక్తిని సమీకరించి, అభివృద్ధి కార్యక్రమాలకు మళ్లిస్తూ సాంస్కృతిక వికాసంతో అత్యున్నత స్థాయి క్రీడాకారులుగా, కళాకారులుగా మలచాలని ప్రభుత్వోద్దేశం. అదేవిధంగా బాల బాలికలను దేశభక్తి పూరితులైన మంచి నడవడిగల ఆదర్శ పౌరులుగా, ఉన్నత విద్యా విశేషాలతో తెలుగుబిడ్డ లుగా తీర్చి దిద్దాలని ప్రభుత్వ సంకల్పం. ఈ కార్యకలాపాలకు కార్యాల యంగా తెలుగు సంస్కృతికి నిలయంగా నిర్మించబడుతుంది ప్రతి జిల్లాలో ఒక విజ్ఞాన మందిరం.

* తెలుగు చలనచిత్ర పరిశ్రమను మన రాష్ట్రానికి తరలించా లన్నది చిరకాలవాంఛ. ఎంతో కృషి జరిగినా ఆశించిన ఫలితం ఇంత వరకు దక్కలేదు. ప్రజాభిమానాన్ని పొందగలిగిన నటునిగా, ఈ సముచిత మైన రాయితీలతో చలనచిత్ర కళామతల్లి తన పుట్టింటికి తరలివచ్చి,



విజయవాడలో 1984 మార్చి 23న దూరదర్శన్ కేంద్రానికి ప్రారంభో
త్సవం చేస్తున్న ప్రధాని శ్రీమతి ఇందిరాగాంధితో



హైదరాబాదులో 1984 ఏప్రిల్ 2న తెలుగు విజ్ఞాన పీఠానికి
డా॥ నీలం సంజీవరెడ్డి ప్రారంభోత్సవంచేసే కార్యక్రమంలో



1983 మార్చి 30న ఆంధ్రప్రదేశ్ వాణిజ్యమండలి 66వ వార్షికోత్సవంలో
ప్రారంభోపన్యాసం



1984 ఏప్రిల్ 28న రాయలసీమ, తదితర ప్రాంతాల సమస్యల పరిష్కారానికి
ఉద్దేశించిన అఖిలపక్ష సమావేశంలో

నయనానందమై, శోభాయమానమై సకల కళాప్రపూర్ణమై మన తెలుగునాడుకు నిత్య నీరాజనాలందిస్తుందని నా నమ్మకం, విశ్వాసం, ఆకాంక్ష. ఇది నా కర్తవ్యం.

ఇంతవరకు అమలులో వున్న సబ్సిడీ విధానానికి బదులుగా ప్రభుత్వ పరంగా పరిశ్రమకు తగిన సాయం సకాలంలో అందజేయాలన్న దృష్టితో ఈ రాష్ట్రంలో—నెలకొల్పబడిన స్టూడియో, తదితర చలనచిత్రనిర్మాణ సంస్థలకు పని కల్పించాలన్న దృష్టితో కొత్త సహాయక విధానాన్ని రూపొందించడం జరిగింది. దీనివలన నిర్మాతలకు తక్కువ ధరతో కాల్‌షీట్లు ఏరోజు కారోజు ప్రభుత్వ సహాయం అందాలన్నది ఈ పథకం ప్రధాన లక్ష్యం. ఇదిగాక చిత్ర నిర్మాణ ప్రమాణాలను హెచ్చుస్థాయికి తీసుకొని వెళ్ళాలన్న దృష్టితో, వారి చిత్రం ఒక ఏడాది లోపుగా తిరిగి మొదలు పెట్టే నిర్మాతలకు గత చిత్రం నడిచిన తీరులో వారానికి 25 వేలరూపాయల చొప్పున లక్షకు మించకుండా ప్రోత్సాహక పెట్టుబడి విధానంలో ఉచితంగా యివ్వటం జరుగుతుంది. చలన చిత్ర పరిశ్రమలో పనిచేస్తూ నెలకు రూ. 500 లకు తక్కువ ఆదాయం వున్న సాంకేతిక సిబ్బందికి ఉచితంగాను, ఆపైన వెయ్యి రూపాయలకు లోపు ఆదాయం వున్నవారికి తక్కువ అద్దెకు గృహవసతి కల్పించబడుతుంది.

నిర్మాణానికి కావలసిన అన్నిరకాల అనుమతులు, ఒకేచోట ఏమాత్రం జాప్యం లేకుండా లభింపజేయబడతాయి. నిషేధించిన చోట్లు తప్ప మిగిలిన అన్నిచోట్ల షూటింగులకు కాల్‌షీట్లకు కేవలం పది రూపాయ లకే డిపాజిట్ లేకుండానే అనుమతి యివ్వడం జరుగుతుంది.

ఈరోజు ప్రభుత్వ పరంగా నేను ప్రకటించిన నిర్ణయాలు స్వల్పాతి స్వల్పం. ఎదురొచ్చే దాడులు తట్టుకొంటూ, తప్పుదారులు తప్పుకొంటూ మానవత్వపు విలువలు పెంచుకొంటూ సామాన్య సామాజిక శక్తులను సమీకరించుకొంటూ తెలుగు తోటలో వికసిస్తున్న చిరుమొగ్గలనూ, తమ్ముళ్లనూ ఏకీకృత భావంతో ఒకే బాటపై ఒకే నాదంతో నినాదంతో నడిపించాల్సిన కార్యక్రమాలు, నిర్ణయాలు, ఎన్నో...మరింకెన్నో.

ఈ మహోన్నత లక్ష్య సాధనకు, ఈ మహా క్రతు నిర్వహణకు, ఈ చైతన్యరథం మహాప్రస్థానం చేర్చడానికి మీ అందరి అండదండలు, ఆశీస్సులు కావాలి ఎంతగానో—

తమ బాధ్యతలు నిర్వహిస్తూ ఎప్పటికప్పుడు పాలక వ్యవస్థ నిర్ణయాలను అమలుపరుస్తూ ఈ కృషికి సహకరిస్తున్న అధికారులకూ, ఉద్యోగులకూ, లక్షలాది ప్రభుత్వ సిబ్బందికీ నా కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. పెరుగుతున్న ప్రభుత్వ బాధ్యతా భారాన్ని మోసే భాగస్వాములుగా పరిశుద్ధ పరిపాలనను ప్రజలకందించాల్సిన బాధ్యత మరింతగా ఈనాడు వారిమీద వుంది. ఈ సహకారం మంచి అవగాహనతో అందిస్తారన్న విశ్వాసం వుంది నాకు.

వారి సంక్షేమం ఈ ప్రభుత్వ ధ్యేయాలలో ఒకటి. దానికి గురుతుగా—

* కేంద్ర ప్రభుత్వ సిబ్బందికి కుటుంబ నియంత్రణా పథకం క్రింద లభించే ప్రోత్సాహక రాయితీలను మన రాష్ట్ర ప్రభుత్వోద్యోగులకందరికీ లభింపజేస్తానని ప్రకటిస్తున్నాను.

చెప్పాను చేసిందీ, చేయ దలచిందీ. అంతేకాదు నానుండి మీరు ఆశించింది మరెంతో ఉంది.

వేడిగాలి వీస్తున్నది మీ గుండెలనిండా. పెద్దరికం అడ్డుపెడుతున్నది నన్ను ఆవేశపడకుండా.

గత చరిత్ర విన్నాం, తెలుగువారి వీరవైభవ గాథలు తెలుసుకున్నాం, మరో మహోజ్వల చరిత్రను సృష్టిద్దామనుకున్నాం, కాని మనమిపుడు— ఎక్కడున్నాం ?

కలుషితమైన నేటి రాజకీయ వాతావరణంలో, కుదించుకుపోయిన మానవతా విలువల్లో సగౌరవంగా జాతిమనుగడకు వీలులేని అడ్డంకులు ఎన్నో, అవరోధాలు మరెన్నో ? ఏ రాష్ట్రంలో ఏ జాతి గౌరవించబడుతున్నది ? అన్ని రాష్ట్రాలగోడు ఇదే ఈనాడు. పంజాబులో ఏమవుతున్నది ? కాశ్మీరపు మంచుకొండలు ఏమని గర్జిస్తున్నాయి ? అస్సాంలో

అగ్నిజ్వాలలు ఏమని ఘోషిస్తున్నాయి ? కర్నాటకలో జరిగే కుట్రల కర్థం ఏమిటి ? ఎక్కడున్నది శాంతి ? ఏ నాటికి లభిస్తుంది ప్రశాంతి? మూగవోయిన గొంతుతో, వెలికిరాని వేదనతో ఏమంటున్నది ఈనాడు, తెలుగు జాతి ? అభ్యున్నతి కావాలి, కావాలి అని పలవరిస్తున్నది పలుమార్లు.

అసలాలోచిస్తే ప్రజలు ఏ నమ్మకంతో మాకు కట్టబెట్టారీ పదవులు ? అప్పగించారీ అధికారాలు ? పాత విధానం పోవాలని, కొత్తదనం రావాలని. కడుపునిండా తిండిలేక, కట్టడానికి బట్టలేక, తలదాచుకోడానికి నీడలేక, తాగడానికి నీరులేక బ్రతుకే భారమై అలమటిస్తూ అడుగుతున్నారు దీనజనావళి మాకు సామాజిక న్యాయం ఏదని? ఎప్పుడని? ఎక్కడని ? ఘోషిస్తున్నారు జనం కర్మ సిద్ధాంతానికి అడ్డుకట్ట వేయాలని, తమ భవిష్యత్తు తామే తీర్చి దిద్దు కోగలగాలని.

అజ్ఞానాంధకారంలో మనుష్యులను ఉంచడం, తెలివితేటలతో సమాజాన్ని మోసంచేయడం అధికారానికి ఆదర్శంకాదు. ఏనాడయితే రాజకీయం వ్యాపారంగా మారిందో, కుటిలత్వంతో కుళ్ళిందో, ఆనాడే అంతరించాయి ప్రజాస్వామ్యపు విలువలు.

న్యాయ దేవతను మందిరాలలో బంధించి, 'పాపం! వినడానికి చెవులేకాని చూడడానికి కళ్ళులేవన్నా'రు, తెలివిగల మేధావులు, రాజకీయవేత్తలు, నేతలు, నాయకులు.

కట్టలు తెంచుకుని పొంగే కడలిలా, నింగికెగసే మహోత్తుంగ తరంగంలా ముందుకురుకుతున్నది నేటి యువత. న్యాయదేవత చెర విడిపించి, వెలికితెచ్చి గంతలు విప్పి, 'చూడు తల్లీ ! ఈనాటి సమాజ యధార్థ స్వరూపమ'ని చెప్పే రోజొచ్చింది.

అడుగుతున్నారు ఫుట్‌పాత్‌ల మీద బ్రతుకులు వెళ్ళమార్చుకొంటున్న నిరాశ్రయులు, మా గతి ఏమిటని, నీ తీర్పు ఏమిటని? చదువులేక, సంధ్యలేక విజ్ఞానపు వెలుగులేక మురికివాడల్లో మురిగిపోతున్న చిరంజీవులు చిరిగిన గొంతుతో దిక్కుతోచని చూపుతో అడుగుతున్నారు— మాకు వెలుగేదని, విమోచన ఎప్పుడని?

యంత్రాలలో యంత్రంగా మారిపోయి శ్రమిస్తూ, రక్తాన్నే స్వేదంగా సంపదలను సృష్టించే కార్మికులు, శ్రామికులూ మాడే డొక్కలతో, కాలే కడుపులతో అడుగుతున్నారు—'తల్లీ! మాకిచ్చే న్యాయం ఏమిటని, ఎప్పుడని?'

ప్రజాస్వామ్య విధానానికి మనం సరైన నిర్వచనం ఇవ్వాల్సిన రోజు వచ్చింది. ప్రజలు అధికారం యిచ్చింది—ప్రజలిచ్చిన అధికారాన్ని వినియోగించుకొని సమానావకాశాలు అందరికీ పంచిపెట్టడానికే. వికాసవంతమైన జాతి ఆవిర్భవించాలి. సమానావకాశాలు అందరికీ పంచిపెట్టాలి. అదీ నిజమయిన ప్రజాస్వామ్యం. పాలకవ్యవస్థ కేవలం ప్రజల సొత్తుకు ధర్మకర్తృత్వ సంఘం మాత్రమే.

హెచ్చరిస్తున్నాయి, పీడిత, దళిత, బడుగు వర్గాలన్నీ సామాజిక న్యాయం సమకూర్చలేని పెత్తనాలు యిలాగే సాగితే రక్తాక్షరాలతో మరో విప్లవ స్వాతంత్ర్య సమర చరిత్ర లిఖించవలసి వస్తుందని.

ఈ ఏ. సి. రూములు, అంతస్తులు, అనుభవాలు, అధికారాలు, ఆడంబరాలు ఆనాడు మిమ్మల్ని రక్షించలేవని.

ఇది ఈనాటి సమాజ విధానం. దీనికేమిటి మేధావులిచ్చే సమాధానం ?

వచ్చింది ప్రజాస్వామ్య విధానానికి మనం సరియయిన నిర్వచనం చెప్పాల్సిన రోజు.

పాలక వ్యవస్థ ప్రజల సొత్తుకు కేవలం ధర్మ కర్తృత్వ సంఘం.

అది మరచి స్వార్థంతో ప్రజాద్రోహానికి ఎప్పుడు పాల్పడతారో, సంఘ విద్రోహానికి తలపడతారో ఆనాడే చస్తుంది ప్రజాస్వామ్యం.

ఈనాడున్నాయి సమస్యలెన్నో, వస్తున్నాయి అవాంతరాలు మరెన్నో, కల్పిస్తున్నారు ఆటంకాలు యింకెన్నో. అయినా మీ ఆదరాభిమానాలు అండదండలు వున్నంతవరకు, నిరోధించలేదు ఏ శక్తీ మన ప్రగతిరథాన్ని.

మీ మనిషిగా, తెలుగు తల్లి బిడ్డగా ఈ వేదికనుండి ప్రతిజ్ఞ చేస్తున్నాను— నావారిని కించపరచే ఏ విధానాన్నీ సహించేది లేదని, జాతి గౌరవం నిలపటానికి ప్రాణాన్నైనా బలి యిస్తానని.

ఇంత ఆవేదనలోను, నన్ను అనునయించేది మధురాతి మధురమైన మీ ఆదరం.

మీ అండదండలే నాకు బలం.

మీ ప్రేమానురాగాలే నా ఊపిరి.

ఎంతగానో ఆదరిస్తున్నారు, అలనాడూ, ఈనాడూ, ఏనాడూ. మంగళారతులిచ్చి నుదుట తిలకం దిద్ది శుభం పలుకుతున్నారు ఆడ బిడ్డలు— ఎంతో విశ్వాసంతో.

కొండంత అండగా నిలిచారు తమ్ముళ్లు.

చెప్పలేను ఈ గమనం ఎటు పోతుందో— తెలియదు నాకు యీ ఆవేశం ఏ రూపం దాలుస్తుందో ! ఏది ఏమైనా— అనుకున్న సమాజాన్ని మీ ముందు నిలిపేవరకూ, పేదరికాన్ని యీ నేలనుండి తుడిచిపెట్టే వరకు, అంటరానితనాన్ని ఆవల నెట్టేవరకు, కులమత భేదాలు ప్రక్కకు పెట్టేవరకు, సమసమాజ వ్యవస్థ స్థాపన జరిగేవరకు ఆగదు ఈ గమనం. మీరు కట్టబెట్టిన అధికారం మీకే దత్తం.

తెలుగుజాతి మనది. తెలుగువాణి మనది. తెలుగుబాణి మనది. ఈ తెలుగునాడు మనది.

పార్టీలు వేరయినా, సిద్ధాంతాలు ఏమయినా అందరిదీ ఒకటే గమ్యం. అదే తెలుగుజాతి అభ్యుదయం.

*హైదరాబాదులో లాల్ బహదూర్ స్టేడియంలో 1984 జనవరి 9న నూతన ప్రభుత్వ ప్రథమ వార్షిక నివేదిక సమర్పణ సదస్సులో...*

# కొండవీటి వైభవం

ఇది చరిత్రాత్మకమైన కథ. తెలుగువారిని ఎంతో ఉత్తేజపరచే కథ ఇది కావ్య రూపంగా రావడం ఎంతో సంతోషించతగినది.

ఓరుగల్లు కాకతీయులు—గణపతిదేవ చక్రవర్తి, రుద్రమదేవి, ప్రతాప రుద్రుడు తెలుగుగడ్డ కీర్తిని అఖండంగా నిలబెట్టారు.

ఆ రాజ్య పతనానంతరం తెలుగునాడులో ఎందరో స్వతంత్ర రాజులు పొడుచుకవచ్చారు. వారిలో కొండవీటి రెడ్డి రాజులు ప్రముఖులు.

అనవేమారెడ్డి, కుమారగిరి రెడ్డి, పెదకోమటి వేమారెడ్డి, రాచ వేమారెడ్డి గొప్ప సాహిత్యప్రియులు; కవులుకూడా. వారి పరిపాలనలో కొండవీడు మూడుపువ్వులు ఆరు కాయలుగా వర్ధిల్లింది. 14వ శతాబ్దప్రాంతంలో వంద ఏండ్లకుపైన ఆ రాజ్యం ఎదురులేకుండా విహరించింది.

అనేకమంది కవులు పండితులు ఆ వంశంలో వెలసారు. వారు వామనభట్టు వంటి సంస్కృత కవిని, శ్రీనాథునివంటి కవిసార్వభౌముని తమ సంస్థానంలో పోషించి తెలుగుదేశానికే గొప్ప గౌరవ ప్రతిష్ఠలను సంపాదించారు.

శ్రీనాథుని రచనలు ఆంధ్రభాషలో ఎంతో ప్రచారంపొందాయి. దుః దృష్టవశాన కల్లోలాలతో రెడ్డిరాజ్యం అంతరించింది. ఆ వైభవమంతా యుద్ధాల తాకిడివల్ల శిధిలమైపోయింది. వేమనవంటి ప్రజాకవి ఆ ప్రాంతంవాడేనని కూడా చెబుతారు.

తర్వాత గజపతులు, కృష్ణరాయలు, మహమ్మదీయులు ఆక్రమించుకొని పాలించారు.

రెడ్డిరాజుల పాలన స్వర్ణయుగంగా ఉన్నదంటే అతిశయోక్తికాదు. వారిలో ఐకమత్యం తక్కువై రాజ్యం అంతరించింది. తెలుగువారికి అప్పుడు కలిగిన దెబ్బవల్ల కోలుకోవడం కష్టమైంది.

అటువంటి వీరగాథలను, వైభవమైన కథలను మన కవులు కవితా వస్తువుగా స్వీకరించి ప్రజలలో చైతన్యం కలిగించాలి. తమ కవిత్వాన్ని జనంలోకి దూసుకపోయేటట్టు చెయ్యాలి. అప్పుడు మనం తెలుగు వాళ్లంగా పుట్టినందుకు జన్మసార్థకమౌతుంది.

తెలుగుభాష పూర్వప్రతిష్ఠ పొందాలంటే గొప్ప ప్రయత్నం జరగాలి. తెలుగును అధికార భాషగాపొంది, ఆ భాషలో రుచిని ప్రతి తెలుగువాడు అనుభవించాలి. అందుకు ప్రభుత్వం కంకణం కట్టుకున్నది. సాహిత్యవేత్తలు సహాయపడాలి. మాటు మణిగిపోయిన ఇటువంటి ప్రశస్తమైన కథను తీసుకొని కావ్యంగా వ్రాసినందుకు కొసరాజుగారిని అభినందిస్తున్నాను.

సాహిత్య సంపన్నులైన తెలుగు కవులు ఒక్కసారి తమ కలాలకు పదునుపెట్టి మన దేశ కథలకు స్వరూపం కల్పించాలి.

ఇటువంటి మధురమైన కావ్యాన్ని కృతి స్వీకరణం చేసిన అయ్యపు రెడ్డిగారు శాశ్వతమైన కీర్తి పొందగలరని భావిస్తూ ఈ కావ్యావిష్కరణ చేస్తున్నాను.

తెలుగునాట వచ్చిన ప్రతి ప్రజా ఉద్యమాల్లోను పాల్గొని జానపద సాహిత్యాన్ని కోకొల్లగా సృష్టించిన కొసరాజుకు మూడు సంవత్సరాలనాడు మద్రాసులో జరిగిన సన్మాన సభలో నాచేతిమీదుగా కనకాభిషేకం చేశాను. ఈరోజు 'కొండవీటి వైభవాన్ని' నా చేతులమీదుగా ఆవిష్కరిస్తున్నాను. శ్రీ కొసరాజు చిరకాలం తెలుగు సారస్వతానికి తన అమూల్యసేవ లందించాలని ఆకాంక్షిస్తున్నాను.

*శ్రీ కొసరాజు రచించిన 'కొండవీటి వైభవం' కావ్యావిష్కరణ సందర్భంగా హైదరాబాదులో*

# వరద బాధితులకు చేయూత

గతవారం, నెల్లూరు, చిత్తూరు ప్రకాశం జిల్లాల్లో అకాలంగా భారీ వర్షాలు కురిసి, పంటలకు, ప్రభుత్వ ఆస్తులకు విపరీత నష్టం సంభవించిన సంగతి గౌరవనీయులైన సభవారికి తెలుసు. జరిగిన నష్టాన్ని గురించి, తీసుకొంటున్న చర్యలగురించి, యితర వివరాలను గురించి ఎప్పటి కప్పుడు గౌరవనీయులైన సభ్యులకు తెలియజేయడమౌతున్నది. అకాలంలో భారీ వర్షాలు కురిసాయి. సాధారణంగా ఫిబ్రవరిలో వర్షపాతం 10 మిల్లీ మీటర్లు మాత్రమే వుండగా మొన్న 300 నుంచి 400 మిల్లీ మీటర్ల వరకు కురిసింది. ప్రత్యక్షంగా చూసి అంచనా వేయడానికై వీలయిన సహాయం అందించడానికై, బాగా దెబ్బతిన్న కొన్ని ప్రాంతాల్లో నిన్న నేను పర్యటించాను. దెబ్బతిన్న ప్రాంతాల్లో పర్యటించడానికి గత గురువారమే వెళ్లిరావాలనుకున్నాను కాని యిక్కడ శాసనసభ సమావేశాలకు సంబంధించి పనుల వొత్తిడివల్ల అప్పుడు వెళ్లలేకపోయాను. దెబ్బతిన్న ప్రాంతాల్లో పర్యటనకు వెళ్లిన కారణంగా నిన్నటి రోజున శాసనసభకు హాజరుకాలేకపోయినందుకు విచారిస్తున్నాను.

నెల్లూరు జిల్లాలోని గూడూరు, నాయుడుపేట, సూళ్ళూరుపేట తాలుకాలు చిత్తూరు జిల్లాలోని శ్రీకాళహస్తి జిల్లాలను నేను సందర్శించాను. ఈ భారీ వర్షాలవల్ల వరదలవల్ల, యిళ్లు అంతగా దెబ్బతినకపోయినా పంటలకు మాత్రం చాలా నష్టం వాటిల్లింది. కోతకు సిద్ధంగా వున్న ధాన్యమూ, అంతకు ముందే కోసి యింకా పంట కళ్ళాలలోనే వుంచిన ధాన్యమూ, బాగా దెబ్బతిన్నాయి. కొన్ని ప్రాంతాల్లో వేరుశెనగ, మిర్చి, పొగాకు వంటి వాణిజ్య పంటలు నీటి ముంపుకు గురయ్యాయి. ఇంచుమించు పంటంతా నాశనమైంది. జొన్న పంట కూడా ఎక్కువగానే దెబ్బతిన్నది. చాలా సేద్యపు నీటి చెరువులకు గండ్లు పడ్డాయి. చెరువులు బాగా దెబ్బతిన్నాయి. అసాధారణమైన నీటి ప్రవాహంవల్ల వరద కట్టలు, పంట కాలువలకు అనేక చోట్ల గండ్లు పడ్డాయి. రోడ్లకు కూడా బాగా నష్టం వాటిల్లింది. పంటలకు,

ప్రభుత్వ ఆస్తులకు, ప్రయివేటు ఆస్తులకు జరిగిన నష్టం సుమారు 50 – 60 కోట్ల రూపాయల మేరకు వుంటుందని అంచనా.

ఈ ప్రాంతాలలోని ప్రజలకు సహాయపడడానికై ప్రభుత్వం తీసుకొంటున్న చర్యలగురించి నిన్నటి రోజున నా మంత్రివర్గ సహచరులైన రెవిన్యూమంత్రి గారు గౌరవనీయులైన సభవారికి తెలియచేశారు. ఇంతకు ముందు నేను చెప్పినట్లుగా వరిపంట బాగా దెబ్బతిన్నది. ఈ ధాన్యాన్ని రైతులుఅమ్ముకోడానికి వీలుగాప్రభుత్వం తగు చర్యలు తీసుకుంది.

నెల్లూరు, చిత్తూరు జిల్లాల్లో రైతు సోదరులు ఎదుర్కొన్న యీ విపత్తునుంచి వారిని ఆదుకునే ఉద్దేశంతో ప్రభుత్వం వివిధ చర్యలు తీసుకుంటున్నది.

అవేమిటంటే—

నెల్లూరు, చిత్తూరు జిల్లాల్లోని రైతులు దెబ్బతిన్న తమ ధాన్యాన్ని రాష్ట్రం వెలుపల అమ్ముకోడానికి అనుమతిస్తూ ప్రభుత్వం ఉత్తరువులు జారీచేసింది. ఈ వరద ప్రాంతాల్లో దెబ్బతిన్న ధాన్యాన్ని భారత ప్రభుత్వం ప్రకటించిన ధరలకు తక్కువ కాకుండా చెల్లించి కొనుగోలు చేసి రాష్ట్రం వెలుపలకు తరలించే ఏర్పాట్లు చేయాల్సిందిగా నెల్లూరు, చిత్తూరు జిల్లాల సహకార మార్కెటింగ్ సంఘాలను, యితర స్థానిక సహకార సంఘాలను ఆదేశించడం జరిగింది. భారత ప్రభుత్వం ప్రకటించిన ధరకు తక్కువ కాకుండా యీ దెబ్బతిన్న ధాన్యాన్ని కొనుగోలు చేసి, దీనిని ఉప్పుడు బియ్యంగా మార్చి భారత ఆహారసంస్థ ప్రమాణాలతోనూ, లెవితోనూ నిమిత్తం లేకుండా రాష్ట్రం వెలుపల మార్కెట్లలో అమ్మకం జరపవలసిందిగా తగినంతగా ఉప్పుడు బియ్యం ఆడే సౌకర్యాలు వున్న రాష్ట్రంలోని అన్ని జిల్లాల్లోని మిల్లర్లకూ ఆదేశాలివ్వడం జరిగింది.

వరి పంటా, ధాన్యం దెబ్బతిన్న యీ రెండు జిల్లాలలోనూ రైతులకు, ప్రభుత్వం తీసుకున్న యీ మూడు సహాయక చర్యలవల్లా గిట్టుబాటు ధర లభించగలదు. నెల్లూరు జిల్లాలో బహిరంగ మార్కెటులో బియ్యం ధర ఎక్కువగా వున్నట్లు కనిపించింది. ఇటీవల కురిసిన యీ

భారీ వర్షాలవల్ల నెల్లూరు, చిత్తూరు జిల్లాల్లోని మార్కెట్లలోకి బియ్యం రావడం ఆలస్యం అయి యీ ధరలు మరీ ఎక్కువ అయ్యే ప్రమాదముంది.

అందువల్ల బియ్యం ధరలు పెరిగిపోకుండా నిరోధించే వుద్దేశంతో నెల్లూరు జిల్లాలోని సూపర్ బజార్లు, సహకార స్టోర్సువంటి వాటి ద్వారా సరసమైన ధరలకు బియ్యం అమ్మడానికి వీలుగా 2,000 టన్నుల బియ్యాన్ని విడుదల చేయవలసిందిగా నేను ఆదేశాలు జారీచేశాను. నెల్లూరు జిల్లాలో పౌర పంపిణీ వ్యవస్థ ద్వారా కిలో 2 రూపాయలకు అమ్మడానికి నెలవారీ పంపిణీకి ఉద్దేశించిన 5,250 టన్నుల బియ్యం కాక యీ మొత్తం అదనం. ఈ 2,000 టన్నుల బియ్యం నిల్వలను చుట్టుపట్ల జిల్లాలనుంచి నెల్లూరు జిల్లాకు ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర పౌర సరఫరాల సంస్థ వెనువెంటనే తరలిస్తున్నది.

అదేవిధంగా చిత్తూరు జిల్లాలోని బహిరంగ మార్కెటులో బియ్యం ధరలను పెరగకుండా నిరోధించే ఉద్దేశంతో పౌర సరఫరాల సంస్థ చిత్తూరు జిల్లాకు 1,000 టన్నుల బియ్యాన్ని తరలిస్తున్నది.

మామూలుగా యీ జిల్లాలో కిలో 2 రూపాయలకు పంపిణీ చేసేందుకు ప్రతి నెల ఉద్దేశించిన 7,500 టన్నుల బియ్యం కాక యీ వెయ్యిటన్నులు అదనం.

ఈ భారీ వర్షాలవల్లా, వరదలవల్లా చనిపోయినవ్యక్తిదగ్గరి బంధువులకు 2,000 రూపాయలు, కొద్దిగా దెబ్బతిన్న యిళ్లకు 75 రూపాయలు, పూర్తిగా దెబ్బతిన్న యిళ్లకు 250 రూపాయలు చొప్పున యివ్వడానికి, ఇళ్లు మునిగి దెబ్బతిన్న కుటుంబాలకు 75 రూపాయల మేరకు విలువ గల వస్త్రాలు యివ్వడానికి ఉత్తరువులు జారీ చేశాం. పల్లపు ప్రాంతాల్లో వున్న కాలనీవాసులను మెరక ప్రాంతాలకు తరలించి, వారికి పక్కా యిళ్ల నిర్మాణం విషయంలో ప్రత్యేక ప్రాధాన్యం యివ్వడం జరుగుతుంది. వర్షాలకు, వరదలకు గురైన ప్రతి కుటుంబానికి 10 కిలోల బియ్యం అందజేయడం జరుగుతున్నది. దెబ్బతిన్న ప్రాంతాల్లో పశుగ్రాసం పెంప కానికి రైతులకు మినీకిట్లు అందజేసే ఏర్పాట్లు జరుగుతున్నాయి. నీటి తీరువాను ప్రస్తుతం రద్దు చేయడానికి, రుణాలు తదితర బకాయీల

వసూళ్లను వాయిదా వేయడానికి వీలుగా దెబ్బతిన్న గ్రామాలను ప్రకటించ వలసిందిగా ఉత్తర్వులు జారీ అయ్యాయి. రెండో పంటకు నీటిని సరఫరా చేయడానికి వీలుగా సేద్యపు నీటి వనరులకు అవసరమైన మరమ్మత్తులను చేపట్టేందుకు 13 లక్షల రూపాయలు విడుదల చేయడానికి ఉత్తర్వులు చేయడమైంది. రెండో పంట వరి వేయదలచిన రైతులకు సరఫరా చేసేందుకై తక్కువ కాలంలో పంటకొచ్చే వరి వంగడాలను రాష్ట్రం నుంచి, యితర రాష్ట్రాలనుంచి సేకరించడం జరుగుతున్నది. వాణిజ్య బ్యాంకులు, సహకార బ్యాంకుల నుంచి రైతులకు పంట రుణాలు అందించే ఏర్పాట్లు చేస్తున్నాం. దెబ్బతిన్న ప్రాంతాలకు రూ. 80 లక్షల మేరకు ఐ.ఎమ్.ఎఫ్. రుణాలను విడుదల చేయడానికి ఉత్తరువులు జారీ అయ్యాయి. పంట రుణాలతో అనుబంధిస్తూ విత్తనాలు, ఎరువుల విషయంలో సన్నకారు రైతులకు, మార్జినల్ రైతులకు వరుసగా 25 శాతం, $33\frac{1}{3}$ శాతం సబ్సిడీ యివ్వడం జరుగుతుంది.

జరిగిన నష్టం అపారంగా వున్న దృష్ట్యా సహాయం చేయవలసిందిగానూ, నష్టాన్ని అంచనా వేయడానికి ఒక పరిశీలక బృందాన్ని పంపించవలసిందిగానూ భారత ప్రభుత్వానికి ఒక వినతిపత్రం సమర్పించడం జరుగుతుంది. వెంటనే సహాయ కార్యక్రమాలకు, నీటివనరులు తదితర ప్రభుత్వ ఆస్తుల మరమ్మత్తు పనులు చేపట్టడానికి వీలుగా కోటి రూపాయలను ప్రభుత్వం విడుదల చేస్తున్నది

*నెల్లూరు, చిత్తూరు జిల్లాలలో వరద ప్రాంతాలలో పర్యటనపై రాష్ట్ర విధాన మండలిలో 1984 ఫిబ్రవరి 24 న*

# ఆశలు, ఆకాంక్షలు

ఈనాడు సమాజంలో కనబడుతున్నారు అహర్నిశలు రెక్కలు ముక్కలు చేసుకొన్నా కడుపు నిండని అభాగ్యులు—

యంత్రాల మధ్య యంత్రంలా నలుగుతున్నా నాలుగువ్రేళ్లు నోటికందని శ్రమజీవులు, కష్టజీవులు, హతాశులు, గతాశులు—

బిడ్డల దీనస్థితి చూచి, అజ్ఞాన మలినంలో మ్రగ్గుతున్న వారిఅంధకార జీవితాలను చూచి కంట తడిబెడుతున్నారు కన్న తల్లులు, అభాగినులు—

పండించిన పంటకు గిట్టుబాటు ధర లభించక బండబారిన గుండెతో గతుకుల బ్రతుకులను భారంగా ఈడ్చుకు వస్తున్నారు అన్నదాతలు, రైతన్నలు—

నిర్ధారణ లేని జీవితంలో శ్రమకు తగిన ఫలం లభించని వెలితిలో వెలవెల బోతున్నారు వ్యవసాయకూలీలు, కార్మికులు—

ఎందరో, ఇంకెందరో, మరెందరో దరిద్రనారాయణులు, నిర్భాగ్యులు ఈ నాటికీ 50 శాతం దరిద్ర రేఖకు దిగువనే వున్నారు పరిష్కారం లభించక—

ఈనాడు ప్రజాప్రతినిధులంగా, ప్రజలు కోరుకున్న, ఎంచుకున్న ప్రభుత్వంగా మా బాధ్యత వున్నది వారికి సామాజిక న్యాయం అంద జేయడానికి—

ఆశ గుండె నిండుగా వున్నది. కాని కాసులు చేతిలో లేని రీతి కనబడుతున్నది.

రాష్ట్ర ప్రభుత్వాలకు తగినంత ఆర్థిక స్తోమత, సంక్షేమ కార్యకలాపాల నిర్వహణకు తగినంత ప్రోత్సాహం—

ప్రజా సమస్యలను పరిష్కరించగలిగే పటిష్టత, ప్రజా పక్షంగా, ప్రజాస్వామ్య సువిధానంలో ప్రజాభీష్టాలను వ్యక్తపరిచే రాష్ట్ర ప్రభుత్వాల నిర్ణయాలను, అభిలాషను మన్నించే పెద్దరికం యీనాడు కేంద్ర ప్రభుత్వాన్నుంచి ఆశిస్తున్నాను. కావాలని అర్థిస్తున్నాను.

*సికిందరాబాద్‌లో క్రికెట్ స్టేడియంకు శంకుస్థాపన సందర్భంగా :*
*హిందీ ప్రసంగానికి తెలుగుసేత*

# ప్రజాసేవలో ప్రసార సాధనాలు

నిండుదనంతో, చల్లదనంతో, యీ పర్వ దినాన శుభాకాంక్షలంద జేస్తున్నది మా తెలుగింటి ఆడబడుచుల సుస్వరం, మధుర స్వరం.

ఆవేశంతో, ఆవేగంతో, ఉద్వేగంతో, ఉల్లాసంతో నింగికెగసిన కడలి కెరటంలా కట్టలు తెంచుకొని ప్రవహిస్తున్న సెలయేరులా ఉత్సాహంతో చూస్తున్నది తెలుగు యువత—మీరే కార్యక్రమం అందజేస్తారని.

మూగవోయిన పేదలు, మేధస్సు వికసించిన విజ్ఞానులు, వారు, వీరు అందరూ ఆరుకోట్ల ప్రజానీకం అభినందిస్తున్నది యీనాడు మీరు ప్రారంభం జేస్తున్న యీ ప్రసార కేంద్ర కార్యక్రమాన్ని తిలకించి, పులకించి, పొంగువారిన నిండు గుండెతో.

ఆశతో ఆశిస్తున్నది మీ నుండి ఎంతో. మా ఆశలను ఫలింప జేయడం మీ బాధ్యత.

ఈనాటి ప్రజాస్వామ్య వ్యవస్థ ప్రకారం, దేశాభివృద్ధి కార్య క్రమాలలో పాల్గొనే అవకాశం ప్రజాప్రతినిధులందరికి కల్పించబడాలని, తాము అధికారం అప్పగించే ఏ పార్టీ ప్రభుత్వం ఏర్పడినప్పటికీ వారి ద్వారా అభివృద్ధి కార్యక్రమాలు విరివిగా జరగాలని ఆకాంక్షిస్తున్నారు హృదయపూర్తిగా ప్రజలు. అట్టి ప్రజలతో ఎప్పటికప్పుడు ప్రభుత్వాన్ని సమన్వయపరచి ఏ విధమైన ప్రజా సంక్షేమ కార్యక్రమాలు ప్రభుత్వం చేపట్టుతున్నదో తెలుపడం అవసరం. అది ప్రజా ప్రతినిధుల ధర్మం.

ఈ ఆధునిక నాగరికతా ప్రపంచంలో దినదిన ప్రవర్ధమాన మవుతున్నటువంటి సర్వ సౌకర్యాలను ప్రజలకే ఉద్దేశించడమవుతున్నది గనుక, వారు అనుసరించే, ఆచరించే కార్యక్రమాల ద్వారా నిత్యం జరుగు తున్నటువంటి సామాజిక విధానాలను, ప్రజలకు ప్రబోధించవలసివున్నది. గనుక యీనాడు రేడియోకుగాని, టెలివిజనుకుగాని మరి యే యితర ప్రచార సాధనాలకుగాని యింత ప్రాముఖ్యత గలిగివున్న సంగతి అందరికీ

తెలుసు. కాబట్టి ఈ సౌకర్యాలను అన్ని రాష్ట్ర ప్రభుత్వాలు ఉపయోగించుకొనే విధానం యూనియన్ ప్రభుత్వం రాష్ట్ర ప్రభుత్వాలకు కలుగచేయాలి. కార్యక్రమాలలో మా రాష్ట్రాభ్యుదయ కార్యక్రమ ప్రసారాలకు, మా తెలుగు భాషా సంస్కృతీ వికాసాలకు అనువుగా తగినంతగా సమయం కేటాయించాలి. ప్రజలకు తృప్తి కలిగించాలి.

ఈనాటి ప్రజాస్వామ్య వ్యవస్థలో ప్రజా ప్రతినిధులచే ప్రజలకోసమే అనుసరించబడుతున్న రాజ్యాంగ విధానంలో ప్రసార సౌకర్యాలను వినియోగించుకోవడంలో తగినంత సమయం రాష్ట్ర ప్రభుత్వాలకు కేటాయించబడాలని మనవి చేస్తున్నాను.

అహోరాత్రిళ్ళు రెక్కలు ముక్కలు చేసుకొన్నా, ఆర్జించిన సంపాదన కడుపు నింపుకోవటానికి చాలక అర్ధాకలితో అలమటిస్తున్న పేద ప్రజా నీకానికి, తల్లి హృదయం వేదన కోతతో నిండిపోయి బిడ్డల ప్రగతిని చూచుకోడానికి నోచని వ్యధిత బాధిత ఆడబడుచులకు, అక్కచెల్లెండ్రకు, కళ్లలో నీరు యింకిపోయి మూగబాధతో నోరు పెగలక అలమటించే కర్షకులకు, శ్రామికులకు, కార్మికులకు, నీడలేని వారికి, కట్టుబట్ట కూడా లేనివారికి ఏ విధమైనటువంటి కార్యక్రమాలను యీ ప్రజా ప్రభుత్వం అందజేస్తున్నదో వారికి తెలియజెప్పడం కనీస ధర్మం. మాకైనా విన్నామన్న తృప్తితో, భవిష్యత్తులో మంచి జరుగుతుందన్న ఆశతో, నిరాశులు, హతాశులు నిలవరించుకొనే అవకాశం ఆ దరిద్ర నారాయణులను ఉద్ధరించే విధానం వాడల్లో, గూడేలలో, గుడిశెలలో ప్రతిధ్వనించాలి.

కనుక ఈనాడు ఎంతైనా, కొంతైనా నా ప్రభుత్వ కార్యక్రమాలు సంక్షేమ విధానాలు, ప్రగతి పథకాలు, వారికి తెలియడం అవసరం. ఆ విధాన ఫలితాలు ఎవరికోసం నిర్దేశించబడినవో, అది వివరంగా తెలుసు కొన్నప్పుడుగాని ఆచరణలో వున్న అవినీతిని, ప్రచారంలో వున్న అసత్యాన్ని అవగాహనలో వున్న అపార్థాన్ని తీసివేయడం జరగదని మనవి చేస్తున్నా కాబట్టి కేంద్రానికి యిది ఎంత అవసరమో రాష్ట్రానికి మరింత అవ వుందని మాత్రం చెబుతున్నాను. ఎంతో ఆదరంతో, ఆప్యాయ అభిమానంతో ఈ నవీన ప్రసార సాధన వ్యవస్థకు ప్రారంభ

చేయడానికి వచ్చిన గౌరవనీయురాలైన ప్రియతమ ప్రధానికి ఆరుకోట్ల ప్రజానీకం తరఫున కృతజ్ఞతలు తెలియజేస్తున్నాను. మీ ఆదరణ చూస్తే ఆపేక్ష పెరుగుతున్నది మా మనస్సులలో—ఆశలు, కోరికలు చిగురిస్తున్నాయి మా మనస్సుల్లో—

మా రాష్ట్రానికి చెందిన సమస్యా పరిష్కారంలో తెలుగుజాతి నిర్ణయించుకొని తమ ముందుంచిన విధానాలను గౌరవించాలని, ఆంధ్ర ప్రదేశ్ సర్వతోముఖాభివృద్ధికి తోడుపడాలని మా ఆశను వ్యక్తం చేస్తున్నాను.

మాకున్న వనరులన్నీ ఉపయోగించుకొని, ధర్మంగా మాకు సంక్రమించవలసిన హక్కులను పరిరక్షించుకొని జాతి తుష్టితో, పుష్టితో, నిండుగా, నిబ్బరంగా వుండాలని మా బలాన్ని స్వీకరించి, మా పరిపూర్ణ మైన సహకారం అందుకొని మన జాతీయ వ్యవస్థ యీ ప్రపంచంలో మరే దేశమూ కన్నెత్తి చూడలేనంత అంతస్థుకు ఎదగాలని, మహోన్నత జాతీయ సంస్కృతీ వికాసాలతో మనదేశ ప్రతిష్ఠ దిగ్దిగంతాలలో పరి క్రమించాలని, యీ భారతదేశంలో భాగంగా, యూనియన్ ప్రభుత్వంలో భాగస్వాములుగా భారతీయులంగా మేము నిండుగా కోరుకొంటున్నాము.

"సారే జహాఁసే అచ్ఛా, హిందూ సతా హమారా
హం బుల్ బులేహై ఇస్కే, యే గుర్ సితా హమారా"

ఈ దేశం మనది. భవిష్యత్ ప్రగతికే జాతి పురోగమనం, దేశ సమైక్యతే మా సిద్ధాంతం. మా రాష్ట్రాభివృద్ధే మా దేశాభివృద్ధే మా లక్ష్యం.

*విజయవాడలో దూరదర్శన్ ట్రాన్స్మిటరు ప్రారంభోత్సవం సందర్భంగా 1984 మార్చి 23న చేసిన హిందీ ప్రసంగానికి తెలుగుసేత*

# అడుగుజాడ గురజాడది

మహత్తర ఘట్టాలు వస్తాయి కొన్ని మానవజాతి చరిత్రలో – సువర్ణాక్షరాలతో, చిరస్మరణీయంగా లిఖించదగినవి. ప్రతి జాతి సంస్కృతీ స్రవంతిలో దిగ్దిగంతాలను ప్రకాశమానం చేసిన అత్యంత ప్రతిభాశాలుల అవతరణ అప్పుడప్పుడు జరుగుతూ వుంటుంది. సమకాలీనంగా యశస్సులు పండించుకొనేవారు కొందరు అయితే, తమ ప్రభావాన్ని రానున్న తరాలపై చెరగని ముద్రగా వేసే మహిమాన్వితులు, మహనీయులు మరి కొందరు. వారే యుగపురుషులు. మహాకవి శ్రీ గురజాడ అప్పారావుగారు తెలుగుతల్లి ముద్దుబిడ్డలలో ఒకరుగా, అనంతకాల ప్రవాహంలో జాతి సంస్కృతీ చరిత్రలో ఒక సాహితీ యుగకర్తగా, సంస్కరణాత్మక రచనా చక్రవర్తిగా ఎన్నదగినవారు.

కవుల హృదయాలు పులకరించేవి ఒకనాడు చందమామను చూచి, కలువ భామనుచూచి. వారి గంటాలలో రసగంగలు వురకలెత్తిపారేవి ఒకనాడు శృంగారబాల శిగకట్టును చూచి, పెట్టని నగ కట్టును చూచి. ఆ రోజులు పోయాయి. రేయనక, పవలనక రెక్కలు ముక్కలు చేసుకొనే బక్క జీవుల యిక్కట్లను చూచి స్పందిస్తోంది ప్రజా కవుల హృదయం యీనాడు. రక్తాన్ని స్వేదంగా చెమరించే కార్మిక సోదరీసోదరుల కన్నీళ్లకు కరగి కడలిలా పొంగుతోంది కవుల స్రవంతి ఈనాడు. ఈ ప్రగతిశీల నవ కవిత్వధోరణులకు నాంది పలికిన ఆద్యుడు గురజాడ. అందుకే ఆనాడు శ్రీశ్రీ అందరి మనసులలో వున్న భావాన్ని అందమైన గీతికలా మలచాడు, 'అడుగుజాడ గురజాడది'– అని

తాతలనాటి సంప్రదాయాలు, తరతరాలుగా బూజుపట్టిన భావాలు కాళ్లకు బంధాలయినప్పుడు ఏ జాతీ ముందుకు పురోగమించలేదని మనవి చేస్తున్నాను. అర్ధాంగి సమభాగిని అంటూ స్తుతిచేస్తూ ఆదిశక్తి, సృష్టికారిణి అంటూ ప్రస్తుతి చేస్తూ, స్త్రీకి సమాజంలో వున్న స్థాన అత్యున్నతమైనదని, అత్యంత గౌరవప్రదమైనదని స్తోత్రపాఠ

వల్లిస్తూ మన సమాజం ఆడపడుచులకు ఏం కట్టబెట్టింది ? ఏం వారగ బెట్టింది ? తాతలనాడు కన్యాశుల్కం పేరుతో కాసుల మూటల కోసం కక్కుర్తిపడి ముక్కుపచ్చలారని ముద్దుబిడ్డలను కాటికి కాళ్లు చాచిన ముదుసలి ఒగ్గులకు కట్టబెట్టుతుంటే కాదన్న మాదన్న కన్పించలేదు ఆనాడు.

సాంఘిక దురాచారాలను ఎదుర్కొనడానికి సర్వధా సన్నద్ధంగా వున్న మహాకవి గురజాడ కలానికి ఆడపిల్లల దయనీయస్థితి చూచి అంతరంగం ద్రవించింది. ఆయన ఆవేదన 'కన్యాశుల్కం' అన్న కమనీయ నాటకంగా కలకాలం నిలిచిపోయేలా కాగితంపై గూడుకట్టుకొంది. ఆయన కలం నుండి జాలువారిన పుత్తడిబొమ్మ పూర్ణమ్మ కన్నీళ్లు జాతిలో నిద్రాణంగా వున్న మానవత్వపు విలువలను మేలుకొల్పాయి. ఈ రోజు కావాలి మనకు గురజాడ వంటి కవులు– వరశుల్క దురాచారాన్ని నిర్మూలించడానికి. ఈనాడు కూడా పుత్తడి బొమ్మలైన పూర్ణమ్మలంతా కట్నం యిచ్చుకో లేక, సంతలో పెండ్లి కొడుకులను కొనుక్కోలేక నిరాశానిస్పృహలతో కృంగిపోతున్నారు. ఏదో విధంగా పెళ్లిచేసినా అత్తమామల ఆశాపాశానికి చిక్కుబడి అలమటిస్తూ, చివరికి నిలువునా దహించబడుతున్నారు. ఏది మానవత్వం ? ఎక్కడ చచ్చింది సామాజిక న్యాయం ? మనం ఆలోచించుకోవలసివుంది. అట్టి సాంఘిక దురాచారాలను కూకటి వ్రేళ్లతో పెళ్లగించి నిర్మూలించడమే మహాకవి గురజాడవంటి సంస్కరణాభిలాషు లకు, సాహితీమూర్తులకు మనం అందించగలిగిన నివాళి. ఆ మహాకవి చెప్పినట్లు 'దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్' అన్న సూక్తి మనకు నిరంతరం స్ఫూర్తిని అందించాలి.

*విజయనగరంలో 1984 మార్చి 24 న మహాకవి గురజాడ అప్పారావు గారి కాంస్య విగ్రహ ప్రతిష్ఠాపన సందర్భంగా*

# ప్రతి ఇంట నిత్యవసంతాలు చిందాలి

కొత్తదనాన్ని పుణికించి, కొంగ్రొత్త రీతులకు నాంది పలికిన రుధిరోద్గారి చేయగలిగినంత తన పనిని పూర్తి చేసుకొని నిష్క్రమించింది చరిత్ర పుటలలోకి శాశ్వతంగా.

సరికొత్త ఆశలను, ఆకాంక్షలను కల్పించి ఉవ్విళ్ళూరిస్తూ – చిరు మువ్వల సవ్వడిలో చెంగలిస్తూ – మధురంగా, మంజులంగా, మనోజ్ఞంగా పెండ్లి కూతురిలా ముస్తాబయి, సింగారంతో, విలాసంతో సాక్షాత్కరించింది – రక్తాక్షి.

కళ్లలో కాఠిన్యం తొంగి చూచినా, మనసు మెత్తనే అనిపిస్తోంది.

చూపులోని సంజకెంజాయలు క్షాళన చేయాలి – సమాజంలో పేరుకున్న అవినీతినీ, కుళ్లునూ.

మనసులోని మార్దవం మల్లెపూవులా పరిమళించాలి – మానవ కళ్యాణానికి.

ఇదే మన ఆశ – ఆకాంక్ష.

పూర్వదిశలో భానుషఃకాంతులలో పులకించి వికసిస్తోంది కమలమ్మ–

వగరెక్కిన లేచివుళ్ల తీపిదనంతో, కుహూ, కుహూ రవాల మంజుల మనోజ్ఞ నిక్వాణంతో మత్తుజల్లుతోంది కోకిలమ్మ –

పాత చేదని, కొత్త తీపని –

గతానికి, ప్రస్తుతానికి, ఆ గతానికి సుమధుర భావ వారధిగా చేదు-తీపుల మేలు కలయికతో చవులూరిస్తోంది వేపపూ ప్రసాదం.

ఎన్నో వర్షాల వసంతాల వరుసలో, మంచి చెడుల అనుభవా ముందుకు సాగే మానవ జాతి మధురంగా, మంగళకరంగా న సంవత్సరం సాగిపోవాలని మనస్సు నిండుగా కోరుకుంటోంది గడిచినా, తరాలు దాటినా తలరాత మాత్రం మారలేదని మానవ సమాజం.

దరిద్రులు నిత్య దరిద్రులు!

సంపన్నులు పరమ సంపన్నులు!!

కలిగిన వారికే అవకాశాలు, లేనివారికి నిరాశా క్లేశాలు!!!

ఎన్నో ఉగాదులు వెళ్లిపోయాయి — నిండిన ఆశాకాసారాలను ఎండ మావులుగా చేసి.

ఎన్నో ఏడాదులు గడిచిపోయాయి — మానవతనే అవహేళన చేసి.

'స్వార్థాన్ని సవాలు చేసే క్షణంకోసం, సమసమాజానికి పునాది వేసే గడియ కోసం ఎన్నాళ్లీ నిరీక్షణ'— అని లోలోన గొణుక్కొంటోంది — పేద ప్రజ బొంగురుపోయిన గొంతుతో, మూగపోయిన రొదతో. దశాబ్దాలుగా దారిద్ర్యంలో క్రుంగుతూ వచ్చిన తెలుగు ప్రజ ఎన్నుకొంది— ప్రజాస్వామ్య పద్ధతిలో తను పయనించ దలచిన దిశను —

వారి ఆశయాలకు, అభిలాషలకు అద్దం పడుతూ సాగిపోతున్నాం ముందుకు ప్రగతి పథంలో — అందరం కలిసి పరిశ్రమించి, పరిక్రమించి.

ఈ శుభదినాన ప్రజల ఆశబలంతో సంస్కారాత్మకమైన ప్రజాహిత కార్యక్రమాలను మరింత చురుకుగా అమలుపరచడానికి సిద్ధమైంది ప్రభుత్వం.

కళామతల్లి మంజీర మంజుల సింజితాలే మానవ నాగరికత వికాసానికి మధుర సంకేతాలు. సంస్కృతీ సత్సంప్రదాయాలే జాతి మనుగడకు జీవనాడులు. త్యాగయ్య గొంతులో తారాడు నాదాలు, అమరావతీనగర అపురూప శిల్పాలు, అజంతా గుహలలో ఆంధ్ర చిత్ర కారుల తూలికా విన్యాసాలు, తేనియలకు తీయందనాలు నేర్పిన తెలుగు కవితా కోకిల కూజింతాలు తిరిగి జీవం పోసుకొని, తెలుగు నేలపై వర్ధిల్లాలన్న తపన రూపం దిద్దుకొంటోంది నేడు — తెలుగు విజ్ఞాన పీఠంగా.

తెలుగు భాషా సంస్కృతీ వికాసాలకు నెలవుగా, తెలుగు విజ్ఞాన ప్రాభవ వీచికలకు కాణాచిగా అచిరకాలంలోనే అద్వితీయంగా రూపొందు కొంటుంది — శారదా నిలయంగా.

ఆరుకోట్ల ఆంధ్రప్రదేశ్ ప్రజలందరకూ –

దేశవిదేశాల్లో తెలుగు కీర్తిపతాకాలుగా వెలుగొందుతున్న మన తెలుగు ఆడపడుచులకు, అన్నదమ్ములకూ – రక్తాక్షి సుఖశాంతి సౌభాగ్య దాయిని కావాలని నా శుభాకాంక్షలు తెలియజేస్తున్నాను.

తెలుగు నేల నలు చెరగుల వెన్నెలలు విరియాలని – పాడిపంటలతో, పారిశ్రామిక వికాసంతో నిండుదనంతో పండి పరవశించాలని –

తెలుగునాట ప్రతి యింట నిత్య వసంతాలు చిందాలని –

ప్రజలకోసం అంకిత భావంతో ప్రభుత్వం చేస్తున్న కృషి ఫలవంతం కావాలని – ఆకాంక్షిస్తున్నాను.

సర్వేజనా సుఖినోభవంతు.

*రక్తాక్షి ఉగాది సందర్భంగా ఆకాశవాణి, దూరదర్శన్ కేం ప్రసారితం*

# అందరం కలిసి శ్రమిద్దాం

ఉత్సాహంతో, ఉల్లాసంతో. జరుపుకొనే పండుగ—ఉగాది. తెలుగు వత్సరానికి ఆది. తెలుగుతనం పల్లవించిన వసంతానికి నాంది.

శాతవాహనుల నాడే అలల తలదన్ని చెలగిన మహారాజ్యాల చరిత్రకు వారసులం మనం. కాకతీయులనాడే తెలుగు జోదుల కరవాలాల తళతళలతో దిక్కులు ఎరుపులు దిద్దుకొన్నాయి. తెలుగు కోయిల కూజంతాలు తేనియలకు తియ్యదనాలు నేర్పాయి. అదంతా ఒక తీయని కల. కాలగర్భంలో కలసిపోయిన ఒక కమనీయ గాథ.

తెలుగు జాతి నవనవోన్మేషం కావాలని, తెలుగునాడు సర్వతోముఖంగా ప్రగతి పథంలో ముందడుగు వేయాలని, దేశవిదేశాలలో తెలుగుభాషా సంస్కృతి వికసనం క్రొత్త పుంతలు తొక్కాలని మన ఆశ—ఆకాంక్ష.

దశాబ్దాలుగా దగాపడ్డ తెలుగుప్రజ ప్రజాస్వామ్యబద్ధంగా ఎన్నుకొంది తను పయనించవలసిన ప్రగతి పథాన్ని—తెలుగుదేశంలో చెదరని విశ్వాసముంచి. పునరంకితమయింది చిత్తశుద్ధితో తెలుగు జాతి పునరుజ్జీవనానికి.

అందరం కలసి శ్రమిద్దాం అహర్నిశలు. ఉషస్సు లెరుగని, ఉగాదులకు నోచుకోని బడుగు జీవుల చీకటి బ్రతుకులలో నూతన కాంతులు నింపుదాం. ఆంధ్రప్రదేశ్‌ను ఆసేతు హిమాచలానికి ఆదర్శప్రాయంగా తీర్చిదిద్దుదాం. సమైక్యతతో, సమధిక కృషి సాగించి సాధిద్దాం సర్వతోముఖాభివృద్ధిని. మీ అండదండలే, ఆశీస్సులే మాకు కొండంత బలం.

రక్తాక్షి ఉగాది శుభసందర్భంగా ఆరుకోట్ల ఆంధ్రప్రదేశ్ ప్రజ లందరకూ, వివిధ రాష్ట్రాలలో, వివిధ దేశాలలో తెలుగు కీర్తి పతాకలుగా వెలుగొందుతున్న తెలుగు ఆడబడుచులకూ, అన్నదమ్ములకూ నా నూతన సంవత్సర శుభాకాంక్షలు తెలియజేస్తున్నాను. రక్తాక్షి మీకు సుఖశాంతి సౌభాగ్యదాయిని కావాలని, మీ కుటుంబాలు పచ్చగా, పరిమళంగా పది కాలాలపాటు పరిఢవిల్లాలని ఆకాంక్షిస్తున్నాను.

# నవసమాజానికి నాందీ ప్రవచనం

స్వాగతం సుస్వాగతం

రక్తాక్షికి స్వాగతం. తెలుగు ఆడపడుచులకు, అన్నదమ్ములకు, వివిధ రంగాలలో తమ ప్రజ్ఞా పాటవంతో తెలుగు తల్లికి నీరాజనమిచ్చిన, తెలుగు ప్రతిభను దిగ్దిగంతాల ప్రతిధ్వనింపచేసిన మేధావులకు, శాస్త్రజ్ఞులకు, స్రష్టలకు, వాగ్గేయ కళాకారులకు, దేశభక్తులకు, పూజ్యులకు స్వాగతం శుభ స్వాగతం.

తెలుగునేల గుబాళిస్తోంది వేపపూవు పరిమళంతో. తెలుగు జనత పరవళ్లు తొక్కుతోంది—కొత్త ఆశలతో, కొంగ్రొత్త భావాలతో.

వగరు చిగుళ్లను మేసిన కోకిలమ్మ మత్తుగా, మధుర మంజుల మనోజ్ఞ నిక్వాణంతో గిలిగింతలు పెడుతోంది నవయుగ మహోదయ సంకేతంగా.

గంటల సవ్వడితో సాగింది—చైత్ర రథం ముందుకు పూర్ణకుంభంతో, ఇక్షుధ్వజంతో, జయ జయ ధ్వానాల సందడితో, నవ వసంతాగమన సంరంభంతో.

బంధుమిత్రుల పరస్పరాభివందనాలతో, ప్రేమలాలస సౌహార్ద్ర భావనలతో, పండుముత్తయిదువు పాల పొంగులతో పొంగించిన పరవాన్నపు వడ్డింపులతో, వేపపూవు ప్రసాదం ఆరగింపులతో, మధురంగా, మధురాతి మధురంగా, నిండుగా, వయ్యారంగా, సింగారంగా, ఓరకంటి చూపు గిలిగింతలు పెడుతూ ఆశలు పెంచుతూ అనురాగాలు పంచుతూ పెళ్లికూతురిలా ముస్తాబయి సాక్షాత్కరించింది రక్తాక్షి. తీరిపోయిందని పాత ముత్తయిదువులా రుధిరోద్గారి నిష్క్ర చరిత్ర పుటల్లోకి చల్లగా మెల్లగా.

ఈ కేరింతలలో పులకింతలలో ఎక్కడో గగనం మూగవోయిన గొంతుతో, ఎండిపోయిన స్వరంతో—"స

మానుకు పొరుగువాడికి తోడుపడవోయ్ దేశమంటే మట్టికాదోయ్ దేశమంటే మనుషులోయ్'', — ఎవరదీ ఎవరదీ అని చూస్తే అమరజీవి గురజాడ గొంతు అడుగుతోంది ''నా ప్రబోధం జాతిని మేల్కొల్పలేదా'' అని ఆవేదనతో.

ఎన్నో ఉగాదులు గడిచినయ్. ఎందరెందరో మహానుభావులు పుట్టారు పునీతులయ్యారు. ఎన్నెన్నో సంఘటనలు ఎన్నెన్నో సంస్కరణలు. ఎన్నో గొంతులు అంటున్నాయి—అదే పనిగా ప్రజాస్వామ్యం కావాలి, పేదరికం పోవాలి అని. పేద గుడిసెలో అంటగాగిన బక్క డొక్కలతో మూలుగుతున్న శ్రామికుడు తొంగి చూచాడు బైటకి యిదంతా నాకోసమేనా అని—నాకు మంచిరోజు వస్తుందా అని—నా పక్కనున్న భవంతి వంటిది కాకపోయినా ఎండావానలకు నీడిచ్చే గృహవసతి నాకు కలుగుతుందా అని. ఆకలితో శోషపోయిన అజ్ఞానపుటంధకారంలో మునిగిపోతున్న నా బిడ్డల జీవితానికి సుంతయినా, కూసంతయినా వెలుగు వస్తుందా, విజ్ఞానం కలుగుతుందా అని. వట్టి కుండతో నీరు పెగలని కంటి తడితో కడలంటి వున్న కొన వూపిరితో అభాగిని ఆడబడుచు వెలికి వచ్చింది ''యిగిరిపోయిన మా బ్రతుకులకు మోక్షం వచ్చిందా'' అని.

వచ్చింది స్వాతంత్ర్యం. ముప్పయ్యేడేళ్ళు యీ కలల మగతలోనే నిలిచింది జాతి కదులుతున్న యీ కాల ప్రవాహంలో, కడలేని నిరీక్షణలో. రాక్షస, నల, పింగళ, కాళయుక్తి, సిద్ధార్థి, రౌద్రి, దుర్మ్మఖి, దుందుభి, రుధిరోద్గారి—ఎన్నో ఉగాదులు గడిచిపోయాయి, ఈ ప్రతీక్షణలో.

కాలం మారుతోంది. కాని కష్టాలు, సమస్యలు పెరుగుతూనే వున్నాయి. బాధలు మెండవుతున్నాయి. బ్రతుకే తీవ్ర సమస్యగా మారింది. మానవత్వం మరుగైన నేటి యీ సమాజంలో తాను ఒక మానవుడా అన్న అనుమానం వస్తోంది. సామాన్య మానవుల జన్మహక్కయిన కనీస అవసరాలు తనకు తీరనందున సామాజిక పరమైన న్యాయం తమకు దక్కుతుందా అని అనుమానం వస్తోంది బాధిత తాడిత పీడిత సామాన్య ప్రజానీకంలో.

అటు పక్క ధనం మూలుగుతోంది మత్తెక్కి వెలుగులోకి రాలేక నల్ల చీకటి మాటున మరుగున. బలిసిన దేహంతో పెరిగిన ఆశతో అనుభవమవుతోన్న భోగ విలాస లాలసతతో కంపయినా యింపుగానేవుంది, స్వార్థ

మైనా తీపిగానే వుంది. దోపిడీ అయినా శ్రమ లేకనే వస్తోంది. మోసమైనా చలామణీ అవుతోంది. లంచమైనా అన్యాయమైనా అక్రమమైనా చెల్లుబడి అవుతోంది. పదవా గుప్పెట్లో వుంది. అధికారమా హస్తగతమయింది. అన్నిటికి నేనే నేనే నేనే అన్న ఆ స్వార్థమే వరదలై ముంచెత్తుతోంది వర్తమాన రాజకీయాన్ని. పాపం! ఊహించుకోలేకపోయారు యీ పరిణామాన్ని స్వాతంత్ర్యాన్ని తెచ్చిన సమర యోధులు అమరవీరులు. ఏమో అనాటి కన్నుమూతల్లోనే తృప్తి కలిగిందేమో—యీనాడే వుంటే, యీనాటి యీ పరిణామం చూస్తే యిందుకా, యీ విధానానికా ఆనాడు తుపాకీ గుళ్లకు రొమ్ముఒడ్డి వ్రేను నిలిచింది. యిందుకా కుళ్లాయి గట్టి భారతమాత ఒడిలో కుంచించుకు పోయిన పేద సమాజంలో నేనొక నిరుపేదనని చెప్పుకున్నది. అంటరానితనం, కులం, మతం, కుమ్మరించిన విషజ్వాలలను ఆర్పుతానని, హాలాహలం నించి అమృతం పండిస్తానని జాతి గౌరవం పెంపొందిస్తానని అన్నది, ఊహించుకున్నది. సమ సమాజం సర్వతోముఖ వికాసం సమైక్యతా సిద్ధాంతం అందరి చెవుల్లో గింగురు మనేలా ఎన్నో సార్లు ధ్వనించింది ప్రచారం చేసింది—యీ పరిణామానికేనా? యీ తీరుకేనా? యీ తెన్నుకేనా? అని రెప రెప లాడుతున్నవి నింగినించి తొంగిచూస్తున్న అమరవీరుల ఆకృతులు. ఘోషిస్తున్నాయి ఆత్మలు. ముఖం జేవురిస్తోంది చిన్నబోయిన కవళికలతో.

రక్తాక్షికి మనం సరైన నిర్వచనం యివ్వాలా—ఆ అరుణ కెంజాయ క్రోధ చూడ్కుల మంటలలో సమాజాన్ని సలసలా కాగించాలా, ఈ బాధిత పీడిత తాడిత ప్రజానీకాన్ని వంశపారంపర్యంగా వస్తున్న అతిహీనమైన దీనస్థితిలోనే వుంచాలా—

పెరిగిపోతున్న బొజ్జల ధనరాసుల ధీమాతో యింకా యింకా మెండుగా నిండుగా పెరుగనివ్వాలా? ఏదీ ఏదీ ఏదీ ఉన్న ప్రశ్న అనుక్షణం దిగలాగుతోంది దిగులు పడుతున్న నన్ను.

అర్థాలకు పెడర్థాలు, యీ గమనంలో ఎదురు దెబ్బల ఎదురవుతోన్న అవరోధాలు ఎన్నో యింకెన్నో—

అయినా నా వెనక నా తమ్ముళ్లు, అక్క చెల్లెళ్లు అండగా వున్నా రన్న ధైర్యంవుంది గుండె నిండుగా. అవరోధాల అతిక్రమించగలనన్న ధీమా వున్నది—మనస్సులో మెండుగా.

జేవురింపుతో వొంటినంటిన కాషాయం సర్వపరిత్యాగంతో ధీరత్వంతో నిస్వార్థపరమైన పవిత్ర భావంతో. గడచిన ఏడాది నెమరు వేసుకుంటే తృప్తి కలుగుతోంది కూసంతైనా మేలు చేయగలిగానని. విశ్వాసంతో నమ్మకంతో అన్నగా ఆదరించి యీ పదవీ బాధ్యతలు నాకప్పగించిన నా వారికి నిస్వార్థ సేవలను అందించగలిగానని.

ఫలితంగా మగతలో మూలుగుతున్న జాతి నిద్ర లేచింది. హక్కులను పరిరక్షించుకొనే ధైర్యంతో పేద జనం కాలు నిలదొక్కుకుంటున్నది. మా ఓట్ల వల్ల మా కేమి జరిగింది, ఏమి వొరిగిందని, మాకు కావలసింది యిదని తెల్లకాలర్లను పట్టి నిలదీసి అడుగుతున్నది. ఇచ్చాం ఇచ్చాం అంటే ఎవరిదిచ్చావ్ ? నీ అబ్బ సొత్తుగాదిది. ప్రజాస్వామ్యం ప్రజల సొత్తు, మా పాలు మా శ్రమకు లభించవలసిన ఫలం, రాజ్యాంగ పరిధిలో మా బలహీన వర్గాలకు రక్షణ, మా సంక్షేమం చూడవలసిన బాధ్యత ప్రభుత్వ వ్యవస్థది. అది మరచిపోతే, కళ్లు మసకవేస్తే నీ అధికారం చూపును నడినెత్తికి తెస్తే ఫలితం అనుభవించే రోజు వస్తుందని సవాలు చేస్తున్నది సింహకిశోరంలాగా ప్రళయ ఘర్జనతో.

స్త్రీని అబల అని ఒక పక్క అధిక్షేపిస్తూ సహధర్మచారిణి, అర్ధాంగి అని ఎన్నెన్నో బులిబుచ్చకపు యిచ్చకాలతో మమ్మ వంచించిన రోజులు పోయాయి, సమాజంలో సమ శాతంగా వున్న మాకు సమాన హక్కులు ఆస్థిలో అన్నింటిలో కావాలి, డబ్బుతో భర్తలను కొనుక్కునే ఆ దౌర్భాగ్యం అంతరించాలి—అన్న హెచ్చరికలతో పలనాటి నాగమ్మ, రాణి రుద్రమ్మ, మగువ మాంచాల, సింహపురి చానమ్మలను గుర్తుచేస్తున్నది మహిళాలోకం.

బ్రిటీష్ వాసిన విద్యావిధానమా యీ నాటికీ అని ఎంగిలి మెంగిలి చదువులతో నాలుగు గోడల మధ్య బిగించిన బ్రతుకులో కేవలం పొట్ట పోసుకునే ఉద్యోగ పరిధిలో బ్రతకడమేనా బోధనాపరమార్థం, బ్రతుకు తెరువు కల్పించని వ్యర్థ నిరర్థకపు డిగ్రీల మూటలు భుజాన వేసుకొని

ఎక్కే దిగే గడపల నిరాశ్రయులుగా నిర్భాగ్యులుగా నిరుద్యోగులుగా యువతను దిగజార్చే యీ అవశేషపు చదువులా యింకా యీ దేశంలో అని వెక్కిరిస్తోంది—నేటి నిరుద్యోగ సమస్య పెరుగుతోన్న అసంతృప్తితో రగులుతోన్న దావానలంలా.

మట్టిలో మాణిక్యాలు పండించినా శ్రమకందని రీతిలో తన పంటకు తగినంత విలువ లభించని దగా బజారులో అసంతృప్తితో, అన్యాయంతో ముడుచుకుపోతున్న రైతన్న అడుగుతున్నాడు యీ చిల్లర పెంకులా నా బంగారు పంటకని. సబ్బు బిళ్లకో సెంటుబుడ్డికో తన ధరను తానే నిర్ణయించుకునే అధికారం పారిశ్రామికవేత్తకున్నప్పుడు, మరి తాను పండించిన పంటకు తానెందుకు ధర నిర్ణయించుకోలేకపోతున్నానని నిలదీసి అడుగుతున్నాడు అన్నదాత రైతన్న. నిర్ధారణలేని బ్రతుకులో గిట్టని కూలి పైసలలో ఎదుగూ బొదుగు లేని జీవితంతో అంధకారం ఆవరించిన బ్రతుకుతో తన యిల్లాలు చంటిపాప బాగోగులు నిండుగా చూచు కున్నానన్న తృప్తిలేని కొరవడ్డ బ్రతుకుతో, తృప్తిలేని జీవితంతో, పడి మారిన ఆశలతో అనాదరణతో, వంచనతో మొండిగా బ్రతుకీడుస్తున్నారు వ్యవసాయకార్మికులు, కూలీలు. కుత్తుకబంటి పేదరికంతో కూరుకు పోయిన కార్మికులు, శ్రామికులు, బడుగువర్గాలు, కష్టజీవులు, శ్రమజీవులు అసంతృప్తితో మూలుగుతున్నారు యీనాటికీ పూర్తిగా మారనిపెత్తందారీ విధానానికి రోసి. చినికిన ఆశలతో, చిరిగిపోయిన బ్రతుకులతో చీదరించు కుంటున్నారు యీస్వార్థపూరిత సమాజాన్ని, యీ ద్రోహవిధానాన్నిచూచి.

వీరి ఆశలు తీర్చాలి, బ్రతుకులలో బంగారు బాటలు వేయాలి, అంధకారంలో ఆశాజ్యోతులు వెలిగించాలి, నిత్యం ఊరుతున్న జాతిని ఊబిలోకి లాగుతున్న సమస్యలను పరిష్కరించాలి. సమాజంలో రాక్షసిలా, నరమాంసానికి మరిగిన పెద్దపులిలా నానాటికీ పెచ్చు మీరుతున్న, హెచ్చి పోతున్న అక్రమాన్నీ అన్యాయాన్నీ దౌర్జన్యాన్నీ లంచగొండి విధానాన్నీ రూపుమాపే వరకు సమాజంలో శాంతి లేదు, క్రాంతి రాదు.

మత్తెక్కిన భూతంలా నరసమాజం మీద విరుచుకుపడి అందిన అసహాయులను నములుతున్న నరరూప రాక్షసులను జాతి విద్రోహులను

మతోన్మాదులను తుదముట్టించి సమాజంలో శాంతిభద్రతలకు సోపానం వేయాలి. అల్ప సంఖ్యాకులకు, హరిజన, గిరిజన వెనుకబడిన తరగతుల వారికి పరిపూర్ణమైన రక్షణ కలిగించాలి. అభివృద్ధి కార్యక్రమాలతో వారి బ్రతుకులు పండించాలి. సంతృప్తితో వారి జీవితాలు నిండించాలి. పాలక వ్యవస్థమీద వారికి నమ్మకం కలిగించాలి. సౌభ్రాతృత్వం, సమానత్వం, సమగ్ర ఆర్థిక సముద్ధరణ విధానం వంటి పవిత్ర మానవతా సిద్ధాంతాలతో వారి మనుగడకు మంచి విధానాలందించిన నాడే దేశ సమైక్యతా, సామాజిక శాంతి, జీవిత సంతృప్తి అందివ్వగలుగుతాం అన్ని విధాలా. ఈ దోపిడీ వ్యవస్థ నశించాలి. పెట్టుబడిదారీ విధానం నశించాలి. అన్ని రంగాలలో దళారీ పద్ధతి సమసిపోవాలి. సామాజికపరమైన బాధ్యత ప్రతి ఒక్కరూ గుర్తించాలి. అప్పుడే...అప్పుడే...నిజమైన ఉగాదికి సరైన నిర్వచనం. అప్పుడే...అప్పుడే...ప్రతి యింటా వసంతం. అప్పుడే...అప్పుడే...బడుగు వర్గాలలో క్రాంతి కిరణం. అప్పుడే...అప్పుడే... నవ సమాజానికి నాందీ ప్రవచనం.

ఇది జరగనినాడు, యీ ఉగాదులు కేవలం ఊహాలేనని తేలిననాడు... ఆనాడు 1947లో వచ్చింది...కాదు నిజమైన స్వాతంత్ర్యం. అసంతృప్తితో, అసహనంతో, అశాంతితో కుతకుత లాడుతున్న యీ అభాగ్య నిర్భాగ్య పీడిత ప్రజానీకం తెస్తుంది మరో విప్లవం. లిఖిస్తుంది మరో స్వాతంత్ర్య చరిత్ర రక్తాక్షరాలతో. ఏది మన ధర్మం, ఏది మన రీతి, ఏది మన నీతి—మానవతను ముందుంచుకొని మనసుతో జవాబియ్యవలసిన తరుణం వచ్చింది. ఈ వేదిక నుండి యీ ఉగాది పర్వదిన శుభ సందర్భంలో అశేష ప్రజానీకానికి మనవిచేస్తున్నాను—తెలుగు జాతి మనది, తెలుగు సంస్కృతి వికాసాలకు వారసులం మనం.

పలనాటి బ్రహ్మన్న అలనాడే నేర్పాడట సమానత్వం చాపకూటితో. తేట తెలుగులో ఆటవెలదిలో జాతకి నీతులు నేర్పాడట వేమన్న. కాసులకు కవితను కుదువబెట్టక పరమపవిత్ర భాగవత రచనలో పరవశించాడట పోతన్న. కందుకూరి వారి సంస్కారం, గురజాడవారి ప్రబోధం, అల్లూరి విప్లవం, టంగుటూరి నిబ్బరం, అమరజీవి త్యాగం పెంచాలి జాతిలో. పెంపొందాలి తెలుగువారిలో జాతీయ భావం. రగిలించాలి గుండెల్లో సేవా

భావం. పరిక్రమించాలి ప్రగతి వీరులై ప్రతి ఒక్కరు బాలచంద్రులై, ఖడ్గ తిక్కనలై, తాండ్రపాపయలై.

నిండుదనంతో తనువు పులకించి పరవశురాలు కావాలి ఆనాడు తన బిడ్డల ప్రాభవాన్ని చూచుకొని తెలుగుతల్లి. మెండుగా దండిగా వర్షించాలి తనవారిపై మంగళ ఆశీఃస్రవంతులు. అదే తెలుగువారికి నిజమైన ఉగాది. అదే నిజమైన వేపపూ ప్రసాదం. అదే వగరుచిగుళ్లను మేసిన కోకిలమ్మ కాకళీ కూజితం. అదే మధుర మంజుల మనోజ్ఞగీతం. "అదుగో! అమర కవి కంఠం వినిపిస్తోంది......

దేశమనియెడి దొడ్డ వృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయ్
నరుల చెమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలెనోయ్
ఆకులందున అణగి మణగి
కవిత కోకిల పలకవలెనోయ్
పలుకులను విని దేశ మం
దభిమానములు మొలకెత్తవలెనోయ్

*రక్తాక్షి ఉగాది సందర్భంగా ఏప్రెల్ 2, 1984న హైదరాబాద్ లాల్‌బహదూర్ స్టేడియంలో చేసిన ప్రసంగం*

# శాంతి పథంలో

ఎంతో సుదినం ఈ రోజు. భగవాన్ మహావీరుడు అవతరించిన శుభ దినం ఈనాడు. మానవాళికి తరించే మార్గాన్ని చూపించేందుకు అవతరించిన తీర్థంకరులలో భగవాన్ మహావీరుడు సుప్రసిద్ధుడు. ఆయన జయంతి సందర్భంగా జైన సోదరీ సోదరులందరికీ నా శుభాభినందనలు తెలియజేస్తున్నాను.

భగవాన్ మహావీరుడు మోక్షమార్గ అన్వేషణలో రాజ్యాన్ని, సిరిసంపదలను, భార్యా పిల్లలను వదలి తపోమార్గానికి వెళ్లిన పుణ్యమూర్తి. ఆయన ప్రబోధించిన విశ్వమానవ ప్రేమ, అహింస, సత్యం, శాంతిమార్గం మానవాళికి అవశ్యం అనుసరణీయం. ఆ మహనీయుని ఆదర్శం—తను ప్రబోధించిన దానిని ఆచరించి చూపడం. ఆయన ఆదర్శాన్ని మనమందరం పాటించవలసిన అవసరం ఎంతైనా వున్నది.

ఈ రోజు సమాజం ఏ పరిస్థితిలో వుందో మీ అందరికీ తెలుసు. ద్వేషాసూయలతో రేగిపోతూ, స్వార్థ చింతనతో కుళ్లిపోతూ, పరస్పర అనుమాన భయాలతో కొట్టుమిట్టాడుతున్న వర్తమాన సంఘానికి వర్ధమాన మహావీరుడు ప్రబోధించిన ప్రేమ, అహింసల కన్నా వేరే తరుణోపాయం ఏమి వుంటుంది?

మతం పేరిట మానవుని దానవునిగా మారుస్తూ ఒకరిగొంతు ఒకరు నరుక్కుంటూ మానవత్వం కోల్పోయి వికృత రూపాలను ప్రదర్శిస్తున్న వర్తమాన సమాజానికి మతం అంటే మానవత్వాన్ని, దైవత్వస్థాయికి తీసుకొనిపోవడమేనని ప్రబోధించిన అవతార పురుషుడు శ్రీ మహావీరుడు.

ఒకనాడు జైనమతం ఆంధ్రప్రదేశ్‌లో ఎంతో వ్యాప్తిలో వుండేదని చరిత్ర మనకు చాటుతున్నది. ఈ రోజు కూడా నాటి వైభవానికి కొండ గుర్తులుగా మిగిలిన అవశేషాలు అనేకం మనకు కన్పిస్తాయి. అయితే

ఈనాడు మన కర్తవ్యం భగవాన్ మహావీరుని బోధనలను అనుసరిస్తూ మానవ సేవే మాధవ సేవ అన్న పరమార్థాన్ని ఆచరణలో చూపడం. ఇందుకు జైన సోదరీ సోదరులందరూ పూనుకొంటారని ఆశిస్తున్నాను. భగవంతుడు మనకిచ్చిన ధనంలోనే కొంత సమాజ శ్రేయస్సుకై కేటాయించుకొని, ఆ విధంగా సేకరించుకొన్న ధనంతో పేద ప్రజలకు ఉపయోగపడే ఆసుపత్రులు, మంచి నీటి వనరులు, విద్యా సంస్థలు, సాంస్కృతిక సంస్థలు మొదలైనవి నెలకొల్పుకునేందుకు కృషి చేయగలరని ఆశిస్తున్నాను. ఇందుకు ప్రభుత్వ సహాయ సహకారాలు తప్పక లభిస్తాయని హామీయిస్తున్నాను.

ఈ శుభ సందర్భాన భగవాన్ మహావీరునికి నా హృదయ పూర్వక అర్చనాంజలి ఘటిస్తూ, నమస్సుమాలు అందజేస్తున్నాను.

*మహావీర జయంతి సందర్భంగా 1984 ఏప్రిల్ 13న*
*హైదరాబాదులో—*

# అభినవ మనువు అంబేద్కర్

ఈ రోజు ఎంతో సుదినం. మానవజాతి చరిత్రలో చిరస్మరణీయులైన మహామహుల కోవలకు చెందిన ఒక మహనీయమూర్తి డా॥ అంబేద్కర్ గారు అవతరించిన మహత్తర దినం ఈనాడు.

భారతీయ సమాజానికి తీరని కళంకం అంటరానితనం అని పూజ్య బాపూజీ ఏనాడో ప్రవచించిన విషయం అందరికీ విదితమే. అస్పృశ్యత వంటి ఘోరమైన సాంఘిక దురాచారాన్ని రూపుమాపడం, అట్టడుగున పడి అజ్ఞానంలో, దారిద్ర్యంలో, అంధకారంలో అలమటిస్తున్న అసంఖ్యాక దళిత జనావళిని ఆదుకోడానికి, వారి అభ్యున్నతికి కృషి చేయడానికి అవతరించిన పవిత్ర మూర్తి బాబా సాహెబ్ అంబేద్కర్ అంటే అతిశయోక్తి లేదు. తాను చిన్నతనం నుండి ఏ బాధలకు, ఏ అవమానాలకు, ఏ అలక్ష్యానికి గురియై, ఏ సాంఘిక అసమానతలకు వ్యతిరేకంగా పోరాడుతూ స్వశక్తివల్ల, స్వయం ప్రతిభవల్ల పైకి వచ్చారో, ఆ అసమానతలను, ఆ అవమానాలను, ఆ సాంఘిక దురాచారాలను తన తుది శ్వాసవరకు ప్రతిఘటిస్తూనే వున్నారు బాబా సాహెబ్. ఆయన అచంచలమైన దీక్ష, పట్టుదల మనకు ఆదర్శం కావాలి. ఆయన ఏ ఆశయాలకై తన జీవితాన్ని ధారపోశారో ఆ ఆశయాలు మనకు మార్గదర్శకాలు కావాలి.

తరాలు గడచినా తలరాత మారలేదన్నట్లు మనం 20వ శతాబ్దపు చివరి భాగంలో వున్నా, ఎంతో శాస్త్రీయమైన అభివృద్ధిని సాధించినా మనం మనిషికీ మనిషికీ మధ్య గీసుకొన్న గళ్లు చెదరిపోలేదు. మనం పెంచుకొన్న బ్రహ్మజముడు ముళ్లదళ్లు చెదిరిపోలేదు. మన సమాజాన్ని పీల్చి పిప్పిచేస్తూ అనైక్యతకు దారి తీస్తూ, పరస్పర విద్వేషాలకు, అనుమానాలకు, అసూయలకు అవకాశం యిస్తూ వున్న విషవృక్షం కుల వ్యవస్థను సమూలంగా పెకలించి వేయవలసిన అవసరాన్ని గురించి బాబా సాహెబ్ నిరంతరం బోధిస్తూనే వున్నారు. మనిషి చంద్రమండలంలోకి అడుగు పెట్టగలిగాడు. ఒక భారతీయుడు అంతరిక్షంలోకి ఎగిరి మన

దేశ పతాకను వ్యోమపథంలో ఎగురవేయ గలిగాడని మనం ఎంతో గర్వ పడుతున్నాం. అయినా మన మధ్యనే వున్న అంతరాలను చెరిపివేయలేక, అడ్డు గోడలను పడగొట్టలేకపోతున్నాం. ఈ విషయంలో విద్యావంతులైన వారంతా ముందు వచ్చి సమాజంలో చైతన్య కాంతులు ప్రజ్వరింప జేయాలి. కాలం చెల్లిన పాత సాంప్రదాయాలకు, ఆచారాలకు సాంఘిక బంధాలకు స్వస్తి చెప్పాలి. ఆనాడే అంబేద్కర్ వంటి మహనీయులకు మనం నిజమైన భక్త్యంజలి అర్పించ గలుగుతాం. అదే వారికి నిజమైన నివాళి అని మనవి చేస్తున్నాను.

తరతరాలుగా కాలం చెల్లిన కర్మ సిద్ధాంతం పేరుతో సాంఘికంగా ఘోరమైన అన్యాయాలకు, అవమానాలకు గురవుతూ, ఆర్థికంగా దుర్భర దారిద్ర్యం అనుభవిస్తూ కాలం గడుపుతున్న కోట్లాది షెడ్యూల్డు కులాల సోదరీ సోదరులకు నూతన జీవితం ప్రసాదించడానికి, వారి రాజ్యాంగం ప్రసాదిస్తున్న సమాన హక్కులు వాస్తవంగా వారికి లభింపజేయడానికి మనమందరం నడుం కట్టుకోవాలి. డా॥ అంబేద్కర్ కృషి కారణం గానే మన రాజ్యాంగంలో ఒక ముఖ్యమైన అధ్యాయం 'ఫండమెంటల్ రైట్స్' సంబంధించింది చేర్చబడిందన్న సంగతి మనం మరువరాదు. ఆ మహనీయుని నిరంతరం కృషి వల్లనే సర్వ పౌరజన సమానత్వం ప్రాతిపదికగా సంక్షేమ రాజ్యస్థాపనకు పునాది వేయబడిందని మనం విస్మరించరాదు. ఆ మహా సంస్కర్తపూనిక వల్లనే హిందూ ధర్మశాస్త్ర క్రోడీకరణ సంస్కరణ సాధ్యమయ్యాయి. ఆయన కలలుకన్న సంక్షేమ రాజ్యాన్ని స్థాపించుకొన్ననాడే అంబేద్కర్ వంటి మహనీయుని కలలు నిజంచేయగలుగుతాం. ఆ దిశగా మనమందరం నిరంతరం ప్రయాణం సాగించాలని మనవి చేస్తున్నాను.

బాబా సాహెబ్ వంటి మహనీయులు ఏ ఒక్క కులానికో, ఏ ఒక్క ప్రాంతానికో, ఆ మాటకు వస్తే ఏ ఒక్క దేశానికో చెందినట్లు భా[illegible] అది సంకుచితత్వం అవుతుందని మనవి చేస్తున్నాను. డా॥ అం[illegible] వంటివారు సర్వ మానవాళికి విశ్వజనీనులైన ఆదర్శమూర్తులు. ఆశయం సర్వమానవ శిరోధార్యం.

ఈ శుభ సందర్భంలో ఆ మహనీయుని ఆశయాల సాధనకు మన మందరం పునరంకితం అవుదాం. అందుకు దీక్షతో కృషి కొనసాగిద్దాం.

*బాబాసాహెబ్ డా॥ భీమారావు అంబేద్కర్ 93వ జయంతి సందర్భంగా హైదరాబాద్ లో 1984 ఏప్రిల్ 14న*

# ఆకాంక్ష

శాతవాహనుల నాడే అలల తలదన్ని వెలిగింది తెలుగు తేజం. కాకతీయుల కరవాలాల ఖణఖణలలో దిగ్దిగంతాల నినదించింది తెలుగు శౌర్యం. విజయనగర రాజవీధులలో రతనాలు రాసులు పోసి వ్యాపారం సాగించింది తెలుగు వైభవం.

గాసట బీసటే చదివి గాథలు ప్రవ్వ తెనుంగు వారికి తొలి కావ్యాన్ని అందించడానికి ఆంధ్రమహాభారత సంహిత రచన బంధురుడయినాడు ఆనాడు ఆదికవి నన్నయ్య. ఆ మహనీయుని ప్రయత్నాన్ని సాఫల్యం చేస్తూ మహాభారతాన్ని రాజనీతి శాస్త్రంగా, నవరస మధు మందాకినిగా మలచాడు కవి బ్రహ్మన్న తిక్కన. కావ్య సరస్వతిని కాసుకోసం కక్కుర్తి పడి అమ్ముకోనని బాస చేసి భగవదర్పితంగా భాగవతాన్ని తెనిగించాడు భక్త పోతన. 'దేశభాషలందు తెలుగు లెస్స'ని చాటి అపూర్వ రస బంధుర కావ్యం ఆముక్తమాల్యదను అందించాడు శ్రీకృష్ణదేవరాయలు. ఆటవెలదులలో తేట తెలుగులో అనేక జీవిత సత్యాలను ప్రకటించాడు అలనాడే మన వేమన.

త్యాగయ్య సుమధుర సంగీత వేదికా నాదాలు, క్షేత్రయ్య సులలిత మొవ్వ గోపాల శృంగార భక్తి పదాలు, అన్నమయ్య అనన్య సామాన్య భక్తి భావనా గీతికలు, అభినవ నటరాజు సిద్ధేంద్రుని అభినయ భంగిమలకు తాళం వేసిన కూచిపూడి భాగవతుల మంజుల మంజీర విన్యాసాలు, అమరావతి, లేపాక్షి, రామప్ప ఆది దేవాలయాల అద్భుత శిల్ప విన్యాసాలు, అజంతా గుహలలో అపురూప చిత్రాల నావిష్కరించిన తెలుగు చిత్రకారుల తూలికా విలాసాలు పుణికి పుచ్చుకున్న పునీతమైన జీవగడ్డ—తెలుగునాడు.

ఆ మహత్తర సంస్కృతీ సంపదకు మనం వారసులం. తేట పదాలతో, తేనియలొలుకుతూ తియ్యదనాలు చిందే తెలుగు వెలుగులతో దశదిశలను ప్రకాశమానం చేయడానికి తెలుగుమహాసభలు దోహదం చేయ గలవన్న ఆశాభావం నాకుంది. మన పూర్వ వైభవాన్ని కన్నులకు కట్టేలా

ప్రదర్శించి, తెలుగు వారందరికి స్ఫూర్తి అందించిన వారందరినీ ఆత్మీయతతో, ఆప్యాయతతో, ప్రేమానుబంధంతో సమైక్యపరచి, ఒక వ్యక్తిగా, ఒక శక్తిగా రూపొందే బృహత్ ప్రయత్నంలో తెలుగు మహాసభలు విశిష్టమైన పాత్ర వహిస్తాయన్న విశ్వాసం నాకుంది.

ఈసారి తెలుగు మహాసభలను నిర్వహిస్తున్న చెన్నపట్టణంలో తెలుగు వారికి గల చిరస్మరణీయ మధురానుబంధం సర్వజన విదితమే. ఆంధ్ర కేసరి ప్రకాశం బ్రిటీషు తుపాకి గుండ్లకు రొమ్ము ఒడ్డి నిలచింది మద్రాసు నడి బొడ్డులోనే. అమరజీవి పొట్టి శ్రీరాములు ఆత్మ త్యాగం చేసింది చెన్నపట్టణంలోనే. తెలుగు సారస్వత సముద్రంలో నిగూఢంగా దాగి వున్న అనేక అనర్ఘ రత్నాలను వెలికి తీసి, పదిమందికి తెలిసేలా ప్రచురించిన వావిళ్లవారి కార్యస్థానం ఈ పురమే. తెలుగు వారి స్వాతంత్ర్య సమరచరిత్రకు అద్దం పడుతూ, ఆంధ్రోద్యమ వీచికలకు ఆలంబనగా వెలిగిన ఆంధ్ర పత్రిక, స్వరాజ్య వంటి అనేక పత్రికలకు పుట్టినిల్లుగా ఈ గడ్డ తెలుగు భాషా సంస్కృతీ చైతన్య స్రవంతులకు జీవగడ్డగా వెలుగొందింది. ఇట్టి పరంపరాగతమైన, ఉదాత్తమైన, ప్రేమానుబంధమైన బంధాన్ని మరింత విస్తృతపరచి, పటిష్టపరచి జాతి సమైక్యతకు బీజం వ్యాపింపజేసేలా ఈ సభలను యిట్టి చారిత్రాత్మకమైన క్షేత్రంలో నిర్వహించడం ఎంతో ప్రశంసనీయం.

ఈ మహాసభలకు తమిళనాడు ముఖ్యమంత్రి, నా ప్రియసోదరుడు శ్రీ ఎం.జి. రామచంద్రన్ గారు ముఖ్య అతిథిగా పాల్గొనడం ఎంతో ముదావహం. వారికి నా హృదయపూర్వక అభివందనాలు. తెలుగువారికి, తమిళ సోదరీ సోదరులకు ఉభయులకు ఆనందదాయకమైన ఉమ్మడి పండుగలా ఈ సభలు జరుగుతుండడం అభినందనీయం. జాతీయ సమైక్యతకు భూమికగా, ఒక కుటుంబానికి చెందిన తెలుగు—తమిళ భాషా ప్రాంతాల మధ్య తరతరాలుగా, శతాబ్దాలుగా నెలకొన్న మధుర సాంస్కృతిక అనుబంధ బాంధవ్యాలకు చక్కని వేదికగా ఈ సభలు నిర్వహించ బడుతూ వుండడం ప్రత్యేకించి అభిలషణీయం.

కృష్ణమ్మకు కావేరికి వున్న సంబంధం ఈనాటిదా? రెండు దక్షిణ గంగలే— ఆ దరినుండి ఈ దరికి మరో గంగ- తెలుగుగంగ త్వరలోనే

అవతరించి తెలుగు—తమిళ సోదరుల పవిత్ర స్నేహానుబంధాన్ని మరింత దృఢతరం చేసే రోజు సమీప భావిలోనే వున్నదని మనవి చేయడానికి ఎంతో సంతోషిస్తున్నాను.

తెలుగు-తమిళ సంస్కృత సాంస్వతానుబంధానికి నాటికి నేటికి ఏనాటికీ చెరగని మధుర స్మృతి చిహ్నాలు మధురలోని తిరుమల నాయకమహల్‌లోని వాస్తు సౌందర్యాలు, తంజావూరు సరస్వతి మహల్‌లోని తాళపత్ర గ్రంథాలు.

తమిళ సోదరీ సోదరుల గళాలలో నిత్యం వినిపించే మధుర కృతులు మన త్యాగరాజస్వామివి కావడం మనకు ఎంతో గర్వకారణం. త్యాగయ్య తెలుగు బిడ్డ అయినా తమిళనాడు ఆయన గాన వీచికారోచిస్సులతో వెలిగిన గడ్డ.

తెలుగునాట సాంకేతిక విప్లవంతోపాటు సాంస్కృతిక పునరుజ్జీవనం తేవాలన్నది మా ఆశయం. ఒక్క తెలుగునాడులోనే కాదు, తెలుగు వారుండే ప్రతి ప్రాంతంలోనూ తెలుగు సంస్కృతిని సముజ్జ్వలంగా ప్రకాశింప చేయాలన్నది మా సంకల్పం. రాష్ట్రేతర ప్రాంతాలలో తెలుగు పీఠాలను నెలకొల్పే పథకంలో భాగంగా ఇటీవలే కర్ణాటక విశ్వవిద్యాలయంలో వేమన పీఠం నెలకొల్పడానికి ఆర్థిక సహాయం మంజూరు చేశామని తెలియజేయడానికి సంతోషిస్తున్నాం. తెలుగు మహనీయుల పేరిట తెలుగు జాతి కలకాలం భక్తితో గౌరవించాల్సిన మహానుభావుల పేరిట, స్మరించుకోదగిన తెలుగు కళాకారుల పేరిట యిట్టి పీఠాలను మరికొన్ని విశ్వవిద్యాలయాలలో కూడా నెలకొల్పాలనే ఆలోచన వున్నది. తెలుగువారు ఎక్కడున్నా అక్కడ తెలుగు పలుకును నిల్పుకోడానికి, తెలుగుదనం పెంపొందించుకోడానికి చేసే ప్రతి ప్రయత్నానికి మా తోడ్పాటు వుంటుంది ఎప్పుడూ.

ఏ దేశమేగినా, ఎందు కాలిడినా తెలుగు తల్లిని మరవని మీరని నాకు తెలుసు. తెలుగు భాషా సంస్కృతుల వికాసానికి కొనసాగించే కృషి భారత జాతీయ స్రవంతిని మరింత చేసేందుకు వుద్దేశించబడిందని మనవి చేస్తున్నాను. శరీరంలో అవయవాలు పుష్టిగా, బలంగా వుంటేనే శరీరం బలంగా

దేశంలోని వివిధ రాష్ట్రాలు బలంగా, సౌభాగ్యంగా వున్నప్పుడే జాతి పరిపుష్టంగా వుంటుంది.

ఆవులు ఎన్నో రంగులలో వున్నా వాటి పాలు మాత్రం తెల్లగానే వున్నట్లు, మనం ఏ భాష మాట్లాడినా, ఏ దేవుని కొలచినా, ఏ రాష్ట్రంలో వున్నా అందరం భారతీయులమే. భాషలు భిన్నమయినా భారత జాతి ఒక్కటే.

అమరకవి గురజాడ ఆశ్వాసించినట్లు—

"దేశమనియెడి దొడ్డ వృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయ్
నరుల చెమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలెనోయ్
ఆకులందున అణగిమణగి కవిత కోకిల పలుకవలెనోయ్
పలుకులను విని దేశమందభిమానములు మొలకెత్తవలెనోయ్."

*మద్రాసులో 1984 మే లో జరిగిన అఖిలభారత ద్వితీయ తెలుగు మహాసభలకు పంపిన సందేశం*

# అడుగడుగున కనిపించాలి భగవానుడు

ఈ మహా పర్వదినాన కైంకర్యమైన మనస్సుతో స్వామిని మనసులో అహర్నిశలు ధ్యానించుకుంటూ నలుమూలలనుండి విచ్చేసిన భక్తవరేణ్యులకు—పూజ్యులకు, పెద్దలకు, సోదరీ సోదరులందరికీ నా హృదయపూర్వకమైన నమస్కారాలు. మతం అన్నది ఈ నాటిదికాదు. ఎప్పుడో మానవుడు పుట్టినప్పుడే మనస్సులో మెదిలినటువంటి పవిత్రభావము మతము. నాకన్నా శక్తి ఈ ప్రపంచంలో యేమున్నదో దానిని నేను ఆరాధిస్తాను. అదే నా మతము అనేటటువంటి రోజులవి. ఎన్నో యుగాలక్రితం సృష్టి తర్వాత మానవుడు మానవుడిగా పరిగణించబడటానికి పరిపూర్ణమైన ఆకృతిని రూపొందించటానికి నీతిదాయకమైన సామాజిక పరమైన సంస్కారాత్మకమైన జ్ఞానం అతని మనస్సులో ఉద్భవించడానికి ఎన్నో యుగాలు గడిచాయి. కాబట్టి ఏ మతాన్ని మనం ఆరాధించాలి అనేది మన విజ్ఞానానికి, స్ఫూర్తికి అనుగుణంగా మనం నిర్ణయించుకోవాల్సిన విషయం. ఏ భగవంతుడూ మతాన్ని గురించి చెప్పలేదు. కేవలం శిష్టరక్షణ దుష్టశిక్షణకోసం 'సంభవామి యుగేయుగే'—అని "ఏ యుగములోనైనా సరే అధర్మం ఎప్పుడైతే పెచ్చుపెరిగిపోతుందో, అన్యాయం ఎప్పుడైతే మితిమీరుతుందో, దుర్మార్గం ఎప్పుడైతే అన్నిటికంటె సర్వవ్యాప్తంగా వస్తుందో అప్పుడే ఆ దుష్టులను శిక్షించటానికి శిష్టులను రక్షించటానికి నేను అవతారాన్ని ఎత్తుతాను" అని చెప్పాడు గీతా వాక్యాలుగా ఇది స్వరూపుడైన పరమాత్మ. ఆనాడు శ్రీరామచంద్రమూర్తి బోధించిన సత్యాలు: మానవులలో మానవులకు భేదాలులేవు, సర్వసమాజం ఒక్కటే, భేదాలు లేనటువంటి సమానమైనటువంటి సమాజం కావాలిమనది అని. తనకు నల్గురుఅన్నదమ్ములు పుట్టారు కాని ఆయన ఏమన్నాడు గుహుడ్ని చూసినపుడు—నాయనా గుహా! నీతో మేము ఐదుగురము సోదరులము అన్నాడు ఆయన. అదే విధంగా సుగ్రీవుడిని చూసినపుడు— 'నాయనా సుగ్రీవా! నీ విరహమేమిటో నాకు తెలుసు. నీకు జరిగిన అన్యాయమేమిటో నాకు తెలుసు. ఆ దుర్మార్గాన్ని నేను ఖండిస్తాను. మేము యిప్పటికి ఐదుగురు సోదరులం

అయినాము. యీనాటితో ఆరుగురం కాబోతున్నాము అన్నాడు ఆ మహానుభావుడు. అదేవిధంగా విభీషణున్ని చూసినపుడు 'నీ సోదరుడు నీమీద ఏ విధంగా అన్యాయం చేస్తున్నాడో నాకు తెలుసు కాబట్టి నీకు సరియైన ధర్మరక్షణ కలిగిస్తాను. నీతో మేము ఏడుగురం సోదరులం అన్నాడు ఆయన. ఒకాయనజ్ఞాని, ఒకాయనేమో వన్యజాతిలో ఉన్నటు వంటి ఒక మర్కట స్వరూపుడు సుగ్రీవుడు. అట్టడుగున ఉన్నటువంటి బడుగువర్గాల ప్రతినిధి ఒక పల్లెకారు. మరి వీరందర్నికూడా సోదర భావంతో తమతో చేరదీసుకున్నాడంటే ఆయన స్వరూపం ఏమి చెప్పింది. సమాజంలో ఏమయినా భేదాలు ఉన్నాయని చెప్పిందా? మీరే ఆలోచించండి ఒకసారి. ఏవి పనికివస్తాయో, మన స్వార్థానికి ఉపయోగపడతాయో వాటినిమాత్రం మనం ఉంచుకుంటున్నాం, మిగిలినవాటిని మనం చెప్ప కుండా ఎగురవేస్తున్నాం— కేవలం అసూయతో స్వార్థంతో అని నేను మనవి చేస్తున్నాను. ఈనాడు రామచంద్రమూర్తి ధర్మపరాయణుడై నటువంటి భగవత్ స్వరూపుడు అని చెప్పతాం కాని సర్వమత సమన్వయ, సామాజిక సంస్కర్త అని ఎందుకు చెప్పకోలేకపోతున్నాం ఆలోచించమని మీ అందరికి సవినయంగా మనవి చేస్తున్నాను.

ఆ తరువాత కృష్ణపరమాత్ముడు వచ్చాడు. కృష్ణపరమాత్ముడు వచ్చినప్పుడు ప్రపంచంకూడా మారింది. ఆనాడు త్రేతాయుగంలో ఉన్నటువంటి పవిత్రత తగ్గిపోయింది. శబరి రామచంద్రమూర్తిని లాలించిన విధానం, ఆమె ఎంగిలి పండ్లను ఆ మహానుభావుడు నిండు ఆదరంతో, ఆప్యాయతతో ఆరగించిన విధానం, జటాయువుకు సంస్కారం చేసిన విధానం ఆ మార్గాలన్నీ కూడా పోయాయి. ధర్మం మూడు పాదాలుగా నడిచే మార్గం పోయి రెండు పాదాలతో నడచే ద్వాపరయుగం వచ్చింది. ఆ ద్వాపరంలో కేవలం ధర్మం, న్యాయంకంటే లౌక్యం, తెలివి తేటలు పెరిగాయి. కొంచెం రాజకీయం ఎక్కువయింది ఆనాడు. ఆయన చెప్పకున్నాడు నేనే దేవుడనని, యిక దానికి అడ్డేలేదు. 'సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణంవ్రజ' అని. అన్నిటిని వదలి నన్నే శరణు జొచ్చు, రక్షిస్తానన్నాడు. అసలు నీవెవరు ? నిమిత్తమాత్రుడివి. నీ విద్యుక్తధర్మాన్ని నీవు చేయి. చేయించేవాడ్ని నేను. ఆ ఫలితాన్ని యిచ్చే

వాడ్నికూడా నేను కాబట్టి సర్వం నేనే, నేనే భగవంతుణ్ణి అని చాటి చెప్పుకున్నాడు శ్రీకృష్ణ పరమాత్ముడు. అనాటికది అవసరం అయింది. ఎందుకంటే ఎప్పుడైతే అర్జునుడు మాయామోహితుడై ఈ ప్రతిబంధాలకు దాసుడై, అంతా నావాళ్ళు, నా సోదరులు, నా తాతలు, తండ్రులు, వారిని నేను చంపలేను అని అస్త్రసన్యాసం చేసినప్పుడు, చేయడానికి నీవెవరు, చేయించేవాణ్ణి నేను అని బోధించాడు శ్రీకృష్ణ పరమాత్ముడు.

ఆ తర్వాత శ్రీ వెంకటేశ్వరస్వామి కలియుగంలో వేంచేసారు. ఈ కలియుగంలో మానవులకు మోక్షం ఇవ్వడానికి ప్రత్యక్షంగా వెలసినటువంటి దేవుడు శ్రీ వెంకటేశ్వరస్వామి. కలియుగంలో ఆచరణ అక్కరలేదు. తపస్సు అక్కరలేదు. స్మరణచేస్తే, ఆ వెంకటేశ్వరస్వామి స్మరణచేస్తే చాలు పాపాలన్నికూడా పోతాయనిచెప్పి ఆ భగవంతుడికి, ఆ ఏడుకొండల మీద ఉన్న స్వామికి మనవారు ఒక విధమైనటువంటి సమన్వయపరమైన భక్తిదాయకమైన అర్థం చెప్పారు. కాబట్టి ఈ వెంకటేశ్వరస్వామి ఈనాడు ఆరుకోట్ల ఆంధ్ర అశేషప్రజానీకానికే కాకుండా మన భారతదేశంలో ఉన్నటువంటి అనేక జాతులవారికి, అనేక మతాలవారికి, అనేక కులాల వారికి అందరికీకూడా ఆదర్శవంతమైనటువంటి దేవుడయ్యాడు, ఆరాధ్యుడయ్యాడు. కాబట్టే ఏనాటికానాడు స్థలమహత్యం పెరుగుతోంది. స్వామి ప్రభావం వెలుగుతున్నది. అందుకే ఆదాయంకూడా ఎప్పటికప్పుడు పెరిగిపోతున్నది. కాబట్టి అటువంటిస్వామి దీక్షలో, ఆరాధనలో తరించ వలసిన బాధ్యత మనందరికి ఉన్నదని నేను మనవి చేస్తున్నాను.

ఆయన కలియుగంలో పుట్టాడు గనక మాయామోహితాలు మాత్రం ఆయన నుంచి దూరం కాలేదు. ప్రేమ ఉన్నది. పెండ్లి జరిగింది ఆయనకు. మీకందరకూ తెలుసు. పర్వతరాజు కుమార్తెను పద్మావతీ దేవిని ఆయన శ్రీనివాసుడుగా పరిణయం ఆడాడు. కాని ఆ తర్వాత సవతులపోరు కూడా తప్పలేదు మహానుభావుడైనప్పటికీ కూడా ఆ లక్ష్మీదేవికి.

ఇక్కడ మహత్తరమైనటువంటి మనకు ఆదర్శం తిరుపతిక్షేత్రం. ఎందుకంటే ఎంతోమంది దాడులు చేశారు. ఎన్నో మహామహా శక్తి వంతమైన దేవాలయాలను కూడా ఛిన్నాభిన్నం చేశారు. మహా ప్రసిద్ధ వంతమైనటువంటి ఆ సోమనాథాలయాన్ని కూడా వదలలేదు. ఈ

వెంకటేశ్వరస్వామికి సంబంధించి ఎవరూ ద్వేషభావంతో ఆ స్వామిని చూడలేదే. ఆ స్వామి సన్నిధికి దురుద్దేశంతో వెళ్లలేదే. ఎవ్వరూకూడా దేవాలయానికి హాని చేయలేదే. అదే ఒక పవిత్రమైన విశేషభావంగా మనం గుర్తించాలని, ఆ స్వామి ప్రభావాన్ని మరొక్కసారి గుర్తు చేసుకోవాలని నేను మనవి చేస్తున్నాను.

ఆ తర్వాత బ్రిటిష్ వారు వచ్చారు. ఎన్నో మార్పులు కూడా చేశారు. కానీ, మన ఈ తిరుమల స్వామి దేవాలయాన్ని వారు తాకలేదు. ఏ మాత్రం విగ్రహానికి మలినం కల్గించలేదు. అటువంటి పవిత్రత స్వామిలో ఉన్నదని మరొక్కసారి భక్తబృందానికి మనవి చేస్తున్నాను.

మీకందరకి తెలుసు. ఈనాడు సమాజ సంక్షేమానికి అంకితమైన ప్రజాస్వామ్య విధానానికి అనుగుణ్యమైనటువంటి పరిపాలన జరిగితీరాలి. ఇంతడబ్బు స్వామికి వస్తుందన్నారు. ఎక్కడినుంచి వస్తున్నది? భక్త పరాయణులైన సామాన్య మానవులు, స్వామివారు తామనుకున్నది కలుగ జేసారని, ఆశీర్వదించారని భక్తి భావంతో యిచ్చిన ముడుపులు, హుండీలో వేసిన డబ్బులు యివన్నీ. ప్రజలనుంచే స్వామికి అందుతున్నది, కాబట్టి ప్రజా స్వామ్యానికి ఆరాధ్యుడైన దేవత వెంకటేశ్వరుడే. ప్రత్యేకంగా ఆయన ఏడు కొండలమీదే ఉంటున్నాడంటే నేను నమ్మను. ఏడుకొండలమీద ఎక్కి కూర్చుంటే అక్కడే ఉండేవాడు. అందరి హృదయాలలో ఈనాడు ఉండేవాడు కాదు. ఈ అఖిల భారతంలో కాకుండా యితర దేశాలలో కూడా వెంకటేశ్వరస్వామిని ఆరాధిస్తున్నారంటే ఆయన నా నిర్వచనంలో ఒక దైవమూర్తి అయినటువంటి ప్రజా ప్రతినిధి. ప్రజలకు కలిగిన కష్టాలను, వారికి ఉన్న యిబ్బందులను ఈనాడు ప్రభుత్వం ఏ విధంగా గమనించాలో అదేవిధంగా ఆయన ఆ అంతస్థనుండి ఎప్పటికప్పుడు గమనిస్తూ, తన భక్తులకు అందరికీ ఎప్పుడుకూడా శ్రేయోదాయకమైన వాతావరణాన్ని కలిగిస్తుండే దివ్యమూర్తి శ్రీ వెంకటేశ్వరస్వామి.

ఈ దేవాలయ నిర్మాణమైన తర్వాత శివాజీ మహారాజుగారు వచ్చి ఇక్కడ స్వామికి కైంకర్యాలు, పూజలు, కానుకలు సమర్పించాడు. అదే విధంగా కర్ణాటకాంధ్ర మహా సామ్రాజ్యాధినేత శ్రీకృష్ణదేవరాయలు వచ్చి

వారికి సేవలు చేశాడు. అదేవిధంగా స్వామివారి ఎదుట తెరతీయగరాదా అని సుమధుర సుస్వరాన్ని గానం చేశాడు ఆనాడు త్యాగరాజు. అటువంటి మహనీయులందరూ పునీతం చేసినటువంటి పుణ్యక్షేత్రం యిది.

తెరతీయగరాదా అనేదానిలో అర్థం ఎంతైనా ఉన్నది. ఈనాడు మనం చూస్తున్నాం సుప్రభాతానికి వెళ్ళినప్పుడు తెర తొలగిస్తారు. స్వామిని మనకు ప్రత్యక్షింపచేస్తారు. అది భౌతికపరమైన తెర. మానవుని కళ్లకున్నటువంటి మాయ తెరను తొలగించి మహానుభావుడైన నిన్ను దివ్యంగా చూసేటటువంటి ఆ పరివర్తన మానవ హృదయంలో వచ్చేట్లు చేయు స్వామీ అని ఆరాధించడం కూడా కావచ్చు. అది ఆధ్యాత్మభావన. ఏమో మహానుభావుల హృదయాలలో ఏమేమి ఉన్నదో కాని ఎప్పటికప్పుడు ఆ స్వామి యొక్క ఆరాధనలో పునీతమైనటువంటి మహానుభావులు వారందరూ.

బుద్ధుడు ప్రవచించాడు "సంఘం శరణం గచ్ఛామి, ధర్మం శరణం గచ్ఛామి, బుద్ధం శరణం గచ్ఛామి" అని. సంఘం శరణం గచ్ఛామి అని ఎందుకు అన్నాడు ? నువ్వు సంఘంలో పుట్టావు, సంఘం చేత మనిషిగా గుర్తింపబడ్డావు, ఏ సంఘంలో నువ్వు మనిషిగా గుర్తింప బడ్డావో ఆ సంఘానికి ఎప్పుడూ నువ్వు బద్ధుడవే. సంఘానికి శరణు జొచ్చాలి అన్నాడు. ఈనాడు మనిషి జన్మ ఎత్తినటువంటి ఒక జీవి, తన తల్లి ఎవరో పెళ్ళాం ఎవరో తెలుసుకోగలిగిన విచక్షణా జ్ఞానం ఉన్న మనిషి ఎప్పటికప్పుడు ధర్మబద్ధుడు కూడాను. ఎప్పుడైతే మానవుడు మానవ జన్మ ఎత్తాడో, సమాజం చేత ఒక మనిషిగా గుర్తింపబడ్డాడో ఆ మానవుడు ధర్మబద్ధుడుకూడ అయ్యాడు. కాబట్టి ధర్మానికి మనం శరణుజొచ్చటం తప్పదు అన్నాడు ఆ బుద్ధభగవానుడు. బుద్ధమంటే ఏమిటి ? బుద్ధభగవానుడు తాను దేవుడనని చెప్పుకోలేదు—కృష్ణ పరమాత్మ చెప్పినట్లుగా. బుద్ధమంటే ఆలోచన. మంచి మనిషికి మంచి ఆలోచన రావాలి. నేను మంచిపని చేయాలి. సమాజ శ్రేయస్సు కోరాలి. నేను నాకున్నటువంటి ఈ యొక్క విజ్ఞాన విశేష ప్రభావాలన్నిటిని కూడ సమాజ క్షేమానికి సమాజం శ్రేయస్సుకు అంకితం చేయాలి అని అనుకునే వ్యక్తికి సరియైనటువంటి భావన, ఆలోచన రావాలి. దుష్టమైన ఆలోచన

రాకూడదు. దొంగతనం చేద్దామనో మరొకటి చేద్దామనేటటువంటి అప్రాచ్యమైన ఆలోచన లేకుండా తాను సంఘానికి ఉపయోగపడేటటువంటి ఒక వ్యక్తి కావాలి. అదే బుద్ధం శరణం గచ్ఛామి.

ఆ తరువాత ఎందరో ధర్మయోగులు వచ్చారు— వీరబ్రహ్మేంద్ర స్వామి వంటివారు. వారందరూ కూడ ఏమి చెప్పారంటే కేవలం దేవుడంటే ఎక్కడో లేదు నువ్వు చేసే భజనలోను, మొక్కే ప్రసాదాలలోను దేవుడు లేడు. దేవుడనేవాడు నీ ఆత్మలోనే ఉన్నాడు. అదివరకు వేదాంత పరమైనటువంటి నిర్వచనం దేవుడికి యిచ్చాడు. ఆత్మ సంయమనంతో కూడినటువంటి ఆ ఆత్మస్వరూపుడు భగవంతుడు అన్నాడు. దానికి దీనికి ఎంతో చక్కని పోలిక ఉంది.

దేవుడనేవాడు మీ మనసుల్లోనే వున్నాడు. కాని అది తెలుసుకోలేని మూఢత్వంతో, మమకారంతో, ఆశలతో, స్వార్థంతో మానవుడు తనను తానే మోసం చేసుకుంటున్నాడు. ఈనాడు తనలో ఆ దేవుడిని చూడగల్గినప్పుడు, తన ముందున్న వారి అందరిలో కూడా దేవుడిని చూడగల్గినప్పుడు ఆ మానవుడు ఎప్పుడు యిక తప్పుచేయలేడు. అటువంటి ఆలోచన రాదు. అటువంటి విజ్ఞానపరమైనటువంటి ఆలోచనలను మనం పెంపొందించుకోవాలి.

కేవలం మతమనేది మన ఒంటికి పూసుకున్న బురద. ఈ కులమనేది కేవలం పశుత్వంతో మనం అనుకున్నటువంటి ఒక భావం. కులం లేదు, మతం లేదు, మానవులందరూ ఒక్కటే. అందరిలోనూ దేవుడున్నాడు. అటువంటి సరియైన మానవతా వాదానికి మనందరం కైంకర్యం కావాలి, అంకితం కావాలి.

అందరిని బిడ్డల్లా చూసుకొనే ఆ భగవంతుడు కొంతమందిని పస్తు ఉండమంటూ కొంతమందిని కేవలం పంచభక్ష్యపరమాన్నాలు తినమంటూ ఆశీస్సులు అందించడు. ప్రతివారికి తనపేర మేలు జరగాలనే దివ్యమైన భావన ఆ దేవదేవుడిలో వుందనే నేను నమ్ముతున్నాను—ఆయన భక్తుడిగా. ఎన్నో కార్యక్రమాలు ఈనాడు దేవస్థానంవారు చేపడుతున్నారు. విద్యా వ్యవస్థలు ఏర్పరుస్తున్నారు. సంక్షేమ కార్యక్రమాలు చేపడుతున్నారు.

ఊరు ఊర వాడ వాడ స్వామి యొక్క ఈ దివ్య క్షేత్రాలు ఆలయాలుగా కట్టిస్తున్నారు. ఎన్నో కళ్యాణమండపాలు ఏర్పరుస్తున్నారు. ఎంతో మహత్తరమైన ప్రజాస్వామ్య విధానాలకు వారు అంకితమౌతున్నారు. ఈనాడు ప్రత్యేకంగా మీకు మనవి చేసేది ఏమిటంటే నేను ఈ తిరుపతి శాసనసభ్యుడిగా ఎన్నుకోబడివుండటం నా అదృష్టం. ఎప్పటికీ నేను స్వామికి సన్నిహితుడ్ని, స్వామికి అంకితుడ్ని— అని మరొక్కసారి ఈ సభాముఖంగా మనవి చేస్తున్నాను.

ఈ తిరుపతి క్షేత్రం దివ్యక్షేత్రం. ఎంతో మహత్తరమైన పవిత్ర స్థలంగా మనందరమూ దీనిని రూపొందించుకోవలసిన అవసరం ఎంతైనా వుంది. ఆ స్వామికి వస్తున్న యీ ఆదాయాన్ని మానవ కళ్యాణానికి వాడటం మనందరి యొక్క అభిమతం కావాలని నేను మనఃపూర్వకంగా కోరుకుంటున్నాను. అందుకే నేను కొన్ని నిర్మాణకార్యక్రమాలు చేపట్టాలనే ఒక నిర్ణయానికి వచ్చాను. ఆ నిర్ణయాలు ఈ సదస్యులముందు తెలియజేయటం యీ వేదిక మీద ఉన్నటువంటి పెద్దలు అందరికి తెలియపర్చటం నా విధ్యుక్తధర్మంగా నేను భావిస్తూ వాటి నన్నిటిని ఈనాడు ప్రకటిస్తున్నాను.

వెంకటేశ్వర ఆధునిక విశిష్ట చికిత్సాలయాన్ని యిక్కడ ఏర్పాటు చేద్దామనే నిర్ణయం తీసుకోవటం జరిగింది. చికిత్సకై మనవాళ్లు యితర దేశాలకో, యితర రాష్ట్రాలకో వెళ్లటం అప్రతిష్ఠాకరం. అటువంటి ఆధునిక చికిత్సా విధానాలను మనం ప్రోత్సహించటం, పేదప్రజలకు అందించడం మనయొక్క విధ్యుక్తధర్మంగా భావిస్తూ సూపర్ స్పెషాలిటీ హాస్పిటల్ ఒకటి యిక్కడ వెంటనే ఒక 5 కోట్ల వ్యయంతో నిర్మించటానికి నిర్ణయం తీసుకొన్నామని మనవి చేస్తున్నాను.

వికలాంగులు ఎందరో ఉన్నారు మనలో పాపం. పూర్వజన్మ పాపపరిపక్వం అంటావా, లేకపోతే విధిరాత అంటావా...కొంతమంది సోదరులు అంధులై అవయవాలు లేక మన ముందు నిరాశ్రయులుగా జీవితం గడుపుతున్నారు అంటే వారికేదైన చక్కని ఒక మార్గం, జీవితాన్ని గడుపుకునేటట్టు ఒక విధానం కల్పించటం మన అందరి ధర్మం. మనం తింటే

చాలదు. మనం అనుభవించితే చాలదు. మన ప్రక్కన లేనివాడిని, అవిటివాడిని చేరదీసి చేయూతనిచ్చి మనతోపాటు నడిపించ గలిగిననాడే మానవత వెల్లివిరుస్తుంది. మన ధర్మం మనం నెరవేర్చిన వారమౌతామనే భావంతో ఈనాడు 1కోటి వ్యయంతో శ్రీ బాలాజీ వికాలాంగుల సంక్షేమ సంస్థ ఒకటి యిక్కడ ఏర్పాటు చేయబడుతుందని మీ అందరికీ నేను సవినయంగా మనవి చేస్తున్నాను. అవిటివారికి, వారికి పోయిన అవయవాలను జైపూర్ విధానంలో తయారుచేసి యివ్వటమే కాకుండా వారి జీవనాన్ని సక్రమంగా గడుపుకోవటానికి, భృతిని సంపాందించుకోవడానికి అనువైనటువంటి ఒక వృత్తివిద్యావిధానం కూడా బోధించబడుతుంది. వారి జీవితానికి ఒక వెలుగు చూపబడుతుంది. అదే విధంగా టి.టి.డి. రక్తనిధి ఒకటి ప్రారంభించాలి అనుకుంటున్నాము. యిక్కడకు వచ్చే భక్తులు కూడా రక్తదానాన్ని చేయదలచినవారు చేస్తే అది ప్రాణ రక్షణకు ఉపయోగించ బడుతుంది. అటువంటి రక్త నిధిని 5 లక్షల పెట్టుబడితో ఏర్పాటు చేయడానికి ఈనాడు నిర్ణయం తీసుకోబడింది. మీ అందరికీ నేను మనవి చేస్తున్నాను. కేవలం పరమాత్ముడికి దండం పెడితేనే భక్తులు కారు. మానవతాదృక్పథంతోపాటు మానవుడికి సాయపడటమే మానవతా ధర్మం. మానవసేవే మాధవసేవగా నిరూపించబడ్డది ఎందరి మహనీయులచేతో. కాబట్టి ఈ మానవసేవ కూడా మాధవసేవగా ఒక కైవల్యానికి దారితీసేటటువంటి పవిత్ర విధానంగానే ఉండబోతుందని భక్త బృందానికి, భక్త శ్రేష్ఠులకు, భక్త వరేణ్యులకు నేను సవినయంగా విజ్ఞప్తి చేస్తున్నాను, మనవి చేస్తున్నాను. తిరుపతి మహాపట్టణం ఒక నిశ్శబ్దమైన ఒక పవిత్రమైన స్థలంగా భక్తులకు యిది అంతరాయం కలిగించకుండా ఉండే విధంగా లారీలు పెద్దవాహనాలు ప్రక్కగా వెళ్లే విధంగా ఒక రింగురోడ్డు వేసి, ట్రాఫిక్ ఆ రింగు రోడ్డు మీదుగా వెళ్ళాలి తప్ప కేవలం పట్టణంలో ఉన్నటువంటి ప్రశాంతిని భంగం కల్గించకూడదు, ఎవరికీ ఏ ఆపద కల్గించకూడదు అనే ఉద్దేశంతో 32 కి.మీ. రింగురోడ్డును 6 కోట్ల రూపాయల వ్యయంతో నిర్మించటానికి నిర్ణయం తీసుకోబడింది.

ఈ పవిత్ర క్షేత్రాన్ని అతి ఆరోగ్యవంతంగా, నిర్మలంగా వుంచడం, పరిశుభ్రంగా ఉంచుకోవటం మనధర్మం. నాడు డ్రైనేజిలన్నికూడ

ఈ రోడ్లమీదే ఉన్నాయి. ఆ మురుగు నీరంతా రోడ్లమీదకు వస్తుంది. ఒకవిధమైన దుర్గంధం, ఒక విధమైన అనాగరిక విధానం ఈనాడు మనం చూస్తున్నాం. వెంటనే రు. 3 కోట్ల వ్యయంతో తిరుపతిపట్టణానికి డ్రైనేజి స్కీమును కూడ చేపట్టాలనే నిర్ణయం తీసుకోబడింది.

వృత్తివిద్యా పరమైనటువంటి ఆధునిక విద్యావిధానంతో, వారికి సరియైనటువంటి విజ్ఞానాత్మకమైన బోధనా దృక్పథంతో, వారి భవిష్యత్తుకు ఉద్దీపమైన ఒక వృత్తి పరమైనటువంటి విద్యతో వారిని సంస్కరించాలనే భావంతోనే ఈనాడు ఈ తిరుపతి దివ్యక్షేత్రంలో పద్మావతీ మహిళా విశ్వవిద్యాలయం ఏర్పరచడం జరిగింది. వెంకటేశ్వరుని విశ్వవిద్యాలయం ఉన్నది. దాని ప్రక్కనే అమ్మవారిపేరిట పద్మావతి విశ్వ విద్యాలయం ఉండాలి అని నేను భక్తిభావంతో యీ నిర్ణయం తీసుకోవడం జరిగిందని సోదరీమణులందరికీ నేను మనవి చేస్తున్నాను.

ఈనాడు ఆర్థికంగా చితికివున్నవారికి కానీ, పేదవారికి కానీ, సరియైన విజ్ఞానాత్మకమైన విద్యాబోధనం, లలితకళలో శిక్షణ, అన్నీ ఇక్కడ ఉంటాయి కాబట్టి అందరూ ఈ అవకాశాన్ని పురస్కరించుకుని ఆ దేవి పేరిట స్థాపించబడిన ఈ విశ్వవిద్యాలయంలో వారికి తగిన వృత్తిపరమైన విద్యను స్వీకరించి, వారి జీవితాలను స్వతంత్రంగా తమ కాళ్లమీద వారు నిలబడేటటువంటి శక్తితో మహిళలందరూ రూపొందించబడాలని నా కోరిక. ఒకనాటి పల్నాటినాగమ్మ కాదు, ఈనాడు రాణీరుద్రమ్మ కాదు, తెలుగు గడ్డ మీద పుట్టిన ప్రతి ఆడబడుచు ఒక రాణీరుద్రమ్మగా ఈ దేశానికి ఉద్దీపన కలిగించే ఒక జ్యోతిగా వెలగాలని నా పరిపూర్ణమైన విశ్వాసం. దానికే మేము దోహదం చేస్తున్నామని మనవి చేస్తున్నాను.

ఇకపోతే తిరుపతి దివ్యక్షేత్రాన్ని చాలాకాలం బాలాజీ జిల్లా అనీ అదీ ఇదీ అనీ, ఏదో రూపం దిద్దాలని అనుకుంటున్నారు పెద్దలందరూ. కాని ఈనాడు నా భావన అంతకుమించి పైకే వెళ్లింది. వాటికన్ సిటీ అని మీరు చదివే ఉంటారు ఇంగ్లీషు చదివేవారు, అది పవిత్రమైనటు వంటి క్రైస్తవ మహానగరంగా, పవిత్రమైన స్థలంగా రూపొందించబడింది. ఈనాడు వెంకటేశ్వరస్వామి కేవలం ఆంధ్రులకే కాదు. ఇతర రాష్ట్రాల

వారిచేత, అందరిచేత ఆరాధించబడుతున్నటువంటి వ్యక్తి. అటువంటి మహనీయుని క్షేత్రం, అటువంటి పవిత్రతత కలిగించబడిననాడే మనకి బాగుంటుంది.

ఈనాడు కేవలం ఎవరి యిష్టం వచ్చినట్టు వారు ఈ క్షేత్ర అధికారాన్ని వినియోగించటం— అటు ప్రభుత్వం కానివ్వండి యిటు అధికారులు కానివ్వండి వారి వారి స్వభావాలను బట్టి భావాలను బట్టి వినియోగించటం—మంచిది కాదని నాభావన. అటువంటి దివ్యక్షేత్రానికి దివ్యత్వం మనం కల్పించాలి. కాబట్టి ఈ తిరుపతిక్షేత్రాన్ని బాలాజీ దివ్యక్షేత్రంగా నేను రూపొందించాలని అనుకొంటున్నాను. ఇక్కడ అడుగు పెట్టిన ప్రతివ్యక్తికి అడుగడుగునా ఆ భగవానుడు కన్పించాలి. అటు వంటి పవిత్రతత రూపొందించాలి. ఈనాడు ప్రతి ఒక్కరు వుద్వేగమైన భక్తిభావంతో, పని శ్రద్ధతో, ఇంకా ఎక్కువ ఉత్సాహంతో మనం పని చేసినప్పుడుకానీ మనం అనుకున్న ఆలోచనలకు ఒక రూపం ఇవ్వలేమని, అటువంటి ఆలోచనలకు మీ అందరూ కూడా తోడ్పడాలని ప్రతి ఒక్కరికి నేను విజ్ఞప్తి చేస్తున్నాను. ఈ పవిత్రమైన తిరుపతి తిరుమల దేవ స్థానం స్వర్ణోత్సవాలు జయప్రదం కావాలని ఆకాంక్షిస్తున్నాను.

*తిరుమల తిరుపతి దేవస్థానం స్వర్ణోత్సవాల సందర్భంగా*
*1984 ఏప్రిల్ 22న చేసిన ప్రసంగం*

# విదేశాల్లోని తెలుగు వారికి...

సుదూర సాగర తీరాల దాటి ఖండాంతరాంలో తెలుగు భాషా సంస్కృతీ దీపికలు వెలిగించి మాతృభూమికి ఖ్యాతి ఆర్జించుతున్న నా తెలుగింటి ఆడపడుచులకు, అన్నదమ్ములకు ఆరుకోట్ల తెలుగు ప్రజల పక్షాన, ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ పక్షాన, నా పక్షాన యివే నా శుభాకాంక్షలు, శుభాభినందనలు, నమస్సుమాంజలులు.

మీ మీ శేముషీ ప్రాభవంతో, సాంకేతిక విజ్ఞానంతో, వైద్యశాస్త్ర ప్రావీణ్యంతో, వివిధ విషయ పరిజ్ఞానంతో వివిధ దేశాలలో ఉన్నత పదవుల నలంకరించి, భగవంతుని అనుగ్రహంవల్ల లబ్ధ ప్రతిష్ఠులైన తెలుగు తల్లి గర్భశుక్తి ముక్తాఫలాలు మీరు. మీ కర్తవ్యదీక్ష, కార్యదక్షత, నీతి, నిజాయితీ, సంస్కారం, సహృదయత మీకు అక్కడి ప్రజలలో ప్రేమానురాగపూరిత గౌరవస్థానాలను ఆర్జించి పెట్టాయి—శాశ్వతంగా. మీతోపాటు మీ మాతృభూమికి కూడా వన్నెతెచ్చాయి—సమధికంగా.

'ఏ దేశమేగినా ఎందు కాలిడినా'— ప్రబోధకవి రాయప్రోలు చెప్పినట్టు— తల్లినేలను మరువని మనీషులు మీరని నాకు తెలుసు. మరువ సాధ్యమా తెలుగు తల్లిని?

ఏనాటిదీ తెలుగు తేజం?

శాతవాహనులనాడే అలల తలదన్ని చెలగింది తెలుగు శౌర్యం. కాకతీయుల కరవాలాల కణకణలు దిగ్దిగంతాల ప్రతిధ్వనిస్తూనే వున్నాయి— 'విన నేర్చిన మనసుంటే వినవోయి తెలుగు బిడ్డా'— అంటూ.

విజయనగర రాజవీధులలో, రతనాలు రాసులుపోసి వ్యాపారం సాగించారట బేహారులు నాడు.

'గాసట బీసటే చదివి గాథలు త్రవ్వ తెనుంగువారికే' ఆదికావ్యాన్ని అందించాలని ఆంధ్రమహాభారత సంహితారచన బంధురుడయ్యాడ ఆదికవి నన్నయ్య ఆనాడు.

ఆ మహనీయుడారంభించిన బృహత్ప్రయత్నానికి సాఫల్యంసాధిస్తూ మహాభారతాన్ని రాజనీతి శాస్త్రంగా, నవరస మధు మందాకినిగా మలచాడు కవిబ్రహ్మ తిక్కన్న.

'కాటుక కంటినీరు చనుకట్టు బయింబడ ఏల ఏడ్చెదో కైటభదైత్య మర్దనుని గాదిలి కోడల!' కాసుకోసం కక్కుర్తిపడి నిన్ను కీచకుల కమ్ముకోనని బాసచేసి, కావ్య సరస్వతి నోదార్చి, భగవదర్పితంగా మహాభాగవతాన్ని రచించాడు భక్తపోతన.

'తెలుగదేలయన్న దేశంబు తెలుగు, ఏను తెలుగువల్లభుండ, తెలుగొకండ, ఎల్లనృపులు గొలువ ఎరుగవే బాసాడి దేశభాషలందు తెలుగు లెస్స' అని శ్రీకృష్ణదేవరాయలతో సెలవిచ్చాడు సాక్షాత్తు శ్రీకాకుళాంధ్ర మహావిష్ణువు ఏనాడో. ఆ రసమయ స్వాప్నిక ప్రసాదంగా అవతరించింది అపూర్వ రసబంధుర మహాంధ్రకావ్యం ఆముక్తమాల్యద.

ఆటవెలదుల రోసి, ఆశుకవితలు దూసి అలవోకగా జీవితసత్యాల నందించాడు ఆటవెలదులతో తేట తెలుగులో అలనాడు వేమన్న.

—అట్టి మహత్తర సాహితీ సంపదకు మనం వారసులం. ఆ మహా సారస్వత సంప్రదాయాలను ఎలా మరవగలం?

త్యాగయ్య సుమధుర సంగీతలయవీచికా రవళులు—

క్షేత్రయ్య సులలిత మొవ్వగోపాల శృంగార భక్తిమయ జావళీలు—

అభినవ నటరాజు సిద్ధేంద్రుని అంగాంగ భంగిమానంద లాస్యాలు, మంజుల మంజీర విలాస్యాలు—

అమరావతీ, లేపాక్షి, రామప్ప దేవాలయాల అద్భుత శిల్పవిలాసాలు—

అజంతా గుహలలో అపురూప రీతిలో తెలుగు చిత్రకారుల తూలికా విన్యాసాలు—పుణికి పుచ్చుకుని పునీతమైన జీవగడ్డ మనది.

'కోహం' అన్న జిజ్ఞాసతో ప్రారంభించి, 'తత్వమసి' అన్న ఎరుకను సంపాదించి, 'అహం బ్రహ్మాస్మి' అన్న స్థాయికి ఎదిగిన ఆధ్యాత్మిక భావ

సంపద మనది. 'తొలగు తొలగు ఛండాలుడా!' అన్న అహంకారాన్ని నిలవేసి 'తొలగవలసింది ఎవరు? అనిత్యమైన దేహమా, అనశ్వరమైన ఆత్మయా?'—అని ప్రశ్నించిన జ్ఞానం సమాధాన మిచ్చింది—చండాలోస్తు సతుర్ద్విజోస్తు గురురిత్యేషా మనీషా మమ:—అని ఆదిశంకర భగవత్పాదుల అమర వాక్కులలో.

జ్ఞాన సాక్షాత్కారాన్నందుకొన్న తథాగతుని ఆశ్రయించారు 'బుద్ధం శరణం గచ్ఛామి'—అని. ఆయన బోధలతో తెలివి తెచ్చుకుని స్వార్థాన్ని జయించి సామాజిక దృష్టి నలవరచుకొన్నది 'సంఘం శరణం గచ్ఛామి'—అని. స్వార్థరహిత సంఘసేవతో తరించి, ధర్మమే రక్ష అని గ్రహించారు 'ధర్మం శరణం గచ్ఛామి'— అని. 'మానవసేవే మాధవసేవ' యని చాటిన మహోన్నత మానవతా వాదం మనది. విశ్వజనీనమైన, విస్తారిత మైన, విశాల సమతా భావపూరితమైన నిండుమనసు మనది. కనుకనే 'త్రైలోక్యం మంగళం కురు' అంటూ భక్తి భావనలో భగవంతుని ఆమంత్రించారు మనవారు.

'చిట్టి నాబొజ్జకు శ్రీరామరక్ష' అన్న సంకుచిత దృష్టితో సరిపెట్టు కోక సర్వమానవ సంక్షేమాన్ని ఆకాంక్షించారు. ఏ మతమైనా, ఏ కులమైనా పురోగమించాల్సింది ఆ సమతావాదంవైపే, ఆ మమతావాదం వైపే.

మన సమతావాదం మిధ్యా నినాదంగా మిగిలిపోలేదు. ఇంటింటా, వూరూరా కుటీర పరిశ్రమలతో, హస్త కళాకారుల నైపుణ్య దీప్తులతో వెలుగులు చిమ్మింది. అగ్గిపెట్టెలో చీరను అమర్చి విరోపాకు ఎగుమతి చేసిన అలనాటి అపూర్వ కళాకౌశలం మనది. ఖండ ఖండాలలో అఖండ వాణిజ్య సంబంధాలను నెలకొల్పిన ఐశ్వర్య విలసితమైన శోభా నిలయం మనది.

అదంతా గత చరిత్ర.

మరువలేని, మరపురాని తీయనిగాథ.

ఆ మహోజ్వల వైభవాన్ని మరల చూడగలుగుతున్నాం—మీ అందరి విజయ సాధనలో.

సస్యశ్యామలంగా, సర్వాంగ సుందరంగా, సమతా సంక్షేమ సమాజంగా మన రాష్ట్రాన్ని తీర్చిదిద్దుకోవాలి అన్న ఉత్సాహం ఉరకలెత్తుతోంది ఆరుకోట్ల తెలుగు ప్రజానీకం ఈనాడు ఒక్కటై కదిలింది కడలి తరంగంలా. తిరుపతి వెంకన్న ఘంటారవంతో సుప్రభాతం పాడింది. శ్రీశైలం మల్లన్న శంఖారావంతో చైతన్యం రగిలించింది. భద్రాద్రి రామన్న అభయ ముద్రలో పరవళ్ళు తొక్కింది. ఉవ్వెత్తుగా, ఉత్తుంగ తరంగంలా నింగి కెగసింది యువత. హారతులద్ది, తిలకాలు దిద్ది ఆహ్వానించారు నూతన వ్యవస్థను తెలుగింటి ఆడపడుచులు. సై సై నాదాలతో, జై జై నినాదాలతో స్వాగతం పలికారు బాలబాలికలు కేరింతలతో. ఆ ఆదర్శం తోనే ప్రపంచ చరిత్రలోనే మరువలేని మధురఘట్టంగా, సువర్ణాక్ష రాలతో లిఖించదగిన మహోజ్వల సంఘటనగా అత్యధికమెజారిటీతో అధికార బాధ్యతలు అప్పగించారు—ఆంధ్రప్రదేశ్ ప్రజానీకం తెలుగుదేశానికి, యీ అన్నపై ఆదరంతో, అభిమానంతో, ఆప్యాయతతో. సన్ను తమ కలలు పండించే ప్రతినిధిగా, తమ ఊహలకు వాస్తవ రూపకల్పన చేసే సాధకునిగా ప్రజలు భావించారు. రామరాజ్య ప్రదాతగా ఊహించారు.

అయితే—

నేను ఒక సామాన్య మానవుణ్ణి. మీ అందరిలో ఒకడిని. నా జీవితాన్ని ప్రజాసేవకు ధారపోసి తరించాలని ఊహిస్తున్న ఒక మామూలు మనిషిని.

తెలుగునేల నాలుగు చెరగులా సిరులు పొంగి పొరలాలని, తెలుగు ప్రజల బ్రతుకు బాటలలో వెలుగువానలు కురవాలని, అన్ని రంగాలలో ఆంధ్ర ప్రదేశ్‌ను ఆదర్శంగా తీర్చిదిద్దుకోవాలని ఆదినుంచి తెలుగుదేశం ప్రభుత్వం కృషి చేస్తోంది— చిత్తశుద్ధితో, కర్తవ్య దీక్షతో. పని చేస్తోంది— విరామ మెరుగని ఆచరణతో, వెనుకడుగులేని నిరంతర పురోగమనతో.

ప్రజాభ్యుదయ దిశగా ఎన్నెన్నో సరికొత్త పథకాలు. సంక్షేమ దిశగా మరెన్నో నూతన కార్యక్రమాలు....... అమలు పరుస్తున్నాం— అవిశ్రాంతంగా.

అయితే—

ప్రజల భాగస్వామ్యంలేని ఏ కృషీ పూర్తిగా విజయవంతం కాదు. ప్రజల తోడ్పాటులేని ఏ కార్యక్రమం ఆశించిన ఫలితాలను ఎప్పుడూ అందివ్వలేదు. ఖండఖండాంతరాలలో ఉన్న మీరందరూ అండదండ లిస్తారని, తెలుగుసీమను అభివృద్ధి పథకాలతో ఆదరిస్తారని ఎదురు చూస్తోంది తెలుగుదేశం ప్రభుత్వం.

విదేశాలలో మాతృదేశ కీర్తి పతాకాన్ని గగనసీమలో సమున్నతంగా నిలుపుతున్న మేధావులు మీరు. పరాయి సీమలో తెలుగు కీర్తిచంద్రికలను దశదిశలా విస్తరింపజేస్తున్న విజ్ఞానజ్యోతులు మీరు. మీ మీ రంగాలలో, మీ మీ వృత్తులలో నిష్ణాతులై మీకూ, మీ మాతృభూమికీ, కీర్తి ప్రతిష్ఠలు సముపార్జించి పెడుతున్న విజ్ఞులు మీరు. మీరు, మీవెంట తీసుకొని వెళ్ళినది మీ విజ్ఞానం, సామర్థ్యం, ప్రతిభావ్యుత్పత్తులు మాత్రమే కాదు— అశేష తెలుగుభాషా, సంస్కృతీ, సంప్రదాయాలను; మన జాతి ఔన్నత్యాన్ని; అమూల్య చారిత్రిక వారసత్వాన్ని మీ వెంట తీసుకొని వెళ్ళారు. మీరు మన సంస్కృతికి నిజమైన రాయబారులు. మీ ఆనందాలకు, మీ విజయాలకు మా హృదయాల్లో ఆనందోత్సాహాలు పెల్లుబుకుతున్నాయి. మేము మిమ్మల్ని తలచుకొని గర్విస్తున్నాం.

ఈనాడు ఆంధ్రప్రదేశ్‌లో ఒక సరికొత్త చైతన్య సాహసయాత్ర ప్రారంభమయింది. రాష్ట్రాన్ని ఫ్యాక్టరీల శంఖారావాలతో, యంత్రచక్రాల నిరంతర పరిభ్రమణంతో చైతన్యమయం చేయడానికి పెద్దయెత్తున కృషి సాగించేటందుకు అంకురార్పణ జరిగింది.

రాష్ట్ర పారిశ్రామికీకరణ దిశగా ప్రస్థానం ప్రారంభమయింది. ఈ మహాయజ్ఞంలో మీరు భాగస్వాములు కావాలి. ఈ కృషిలో సహాయ సహకారాలను అందించడానికి మీరందరూ ముందుకు రావాలి.

పారిశ్రామికీకరణ ద్వారానే లక్షలాది నిరుద్యోగ యువకులకు ఉపాధి కల్పించగలం. పారిశ్రామికీకరణ ద్వారానే మన శక్తి సామర్థ్యాలను ప్రయోజనకరమైన మార్గంలోకి మళ్లించగలం. పారిశ్రామికీకరణ ద్వారానే ప్రకృతి ప్రసాదించిన అపారవనరులను వినియోగించుకొని అష్టైశ్వర్యాలను

సృష్టించుకోగలం. శాంతి పూరితమైన, అభ్యుదయకరమైన, సౌభాగ్య విలసితమైన జాతిని, పటిష్టమైన దేశాన్ని నిర్మించుకోగలం.

మీలో కొంతమంది ఎన్నో ఏళ్ళక్రితం స్వరాష్ట్రాన్ని, స్వదేశాన్ని వదలి వచ్చి వుండవచ్చు. ఇక్కడ ఆంధ్రప్రదేశ్‌లో ఏమి జరుగుతున్నదో ఏమిటో మీకు అంతగా తెలిసి ఉండకపోవచ్చు. అలాంటి వారికోసమే యీ పరిచయం.

సంప్రదాయానికి, ఆధునికతకు మేలి కలయికగా, సుసంపన్నమైన సాంస్కృతిక విలువలకు, అభ్యుదయకరమైన దృక్పథాలకు చక్కని సమ్మేళనంగా అవతరిస్తోంది నేడు ఆంధ్రప్రదేశ్. దక్షిణాది ధాన్యాగారంగా, ఆసేతు హిమాచలానికి అన్నపూర్ణగా అందుకున్నది అందరి మన్ననలను అత్యుత్తమ స్థాయిలో. ఎరువులు, రసాయనిక కర్మాగారాలు అవతరిస్తున్నాయి పెద్ద ఎత్తున యిక్కడ. ఎలక్ట్రానిక్ కర్మాగారాల సముదాయాలు తలెత్తుతున్నాయి—కొత్త రూపంలో, కొంగ్రొత్త రీతుల్లో. పెద్దఎత్తున సిమెంటు ఫ్యాక్టరీలు, బ్రహ్మాండమైన థర్మల్, జల విద్యుత్ ఉత్పాదక కేంద్రాలు రూపొందుతున్నాయి యీ గడ్డమీద. అత్యాధునికమైన భారీ ఉక్కు కర్మాగారం, అవతరిస్తోంది విశాఖలో.

—ఇలాంటివి ఎన్నో....ఎన్నెన్నో....ఇంకెన్నో.... మరెన్నో—రాష్ట్రం నలుచెరగులా నవ్యరీతుల్లో రూపాలు దిద్దుకొంటున్నాయి. ఇవన్నీ మన రాష్ట్రం సాధించిన సాంకేతిక విజ్ఞానవ్యాప్తికి సంకేతాలు. ప్రగతికి చిహ్నాలు. మన ఆధునిక దేవాలయాలు. భవిష్యత్ ఆశాసౌధాలు.

పారిశ్రామికంగా ఆంధ్రప్రదేశ్ సాధించినది ఎంతో ఉన్నా, యింకా సాధించవలసినది మరెంతో వుంది. విదేశాల్లో వుంటున్న మీరు మీ విజ్ఞాన వెల్లువను, ప్రతిభాసామర్థ్యాలను, మీ వనరులను యిక్కడ మేము చేస్తోన్న మా యీ కృషివైపుకు మళ్ళించగలరు— మీరు తలచుకొంటే, అనుకుంటే. ప్రపంచంలోని ఉత్తమ సాంకేతిక ప్రతిభను యిక్కడకు తీసుకొనివచ్చి, ప్రగతి పరిధులను విస్తరించి ఆంధ్రప్రదేశ్‌ను ఒక పటిష్టమైన, అగ్రగణ్యమైన పారిశ్రామికశక్తిగా రూపొందించే కృషిలో తోడ్పడవలసిందిగా మిమ్మల్ని హృదయపూర్వకంగా కోరుతున్నాను. ఆహ్వానిస్తున్నాను.

రాష్ట్ర సమగ్రాభివృద్ధికి మీ సంపూర్ణ సహాయ సహకారాలు లభించగలవని ఆశిస్తున్నాను. అత్యాధునిక పారిశ్రామిక ప్రగతికి ఆహ్వానిస్తున్నాను మిమ్మందరినీ. చిరకాలంగా మనం కంటున్న కలలకు సమీప భవిష్యత్తులో సుస్థిర రూపకల్పన చేసేటందుకై మనమంతా ఒక్కటై చేయి చేయి కలిపి పరిశ్రమిద్దాం, పరిశ్రమిద్దాం.

అవిగో! వినిపిస్తున్నాయి
—అలనాటి విజయధ్వానాలు
అవి కావాలి నేటి వైతాళిక గానాలు
అదిగో—ఆశ్వాసిస్తోంది—
అమరకవి గురజాడ కంఠం

'దేశమనియెడి దొడ్డ వృక్షం
ప్రేమలను పూలెత్తవలెనోయ్
నరుల చెమటను తడిసి మూలం
ధనం పంటలు పండవలెనోయ్!'

ఆరుకోట్ల తెలుగు ప్రజల ఆశీస్సులతో, మీ అందరి అండదండలతో తెలుగునాడును వెలుగునాడుగా తీర్చిదిద్దుకోవాలన్నది నా తీయని కల. ఆ సురుచిర, సుమధుర స్వప్నాన్ని తొందరలోనే నిజం చేసుకోగలమన్న దృఢ విశ్వాసం, ఆశాభావం నాకున్నాయి.

అదిగో— క్రాంతి కల్పవల్లి, తెలుగుతల్లి నా కన్నులముందు కదలాడుతోంది— మిరుమిట్లు గొలిపే కాంతులు వెదజల్లుతూ.

పంటకాలువలతో, పచ్చని పైరులతో, పసిడి పంటలతో పాలు తేనెలు పారే భాగ్యసీమగా పరిమళిస్తోంది. పారిశ్రామిక ప్రగతి పతాకలతో పరిఢవిల్లుతోంది. సంతృప్తి వెల్లివిరుస్తున్న శ్రామిక, కార్మిక, కర్షకజనాళి జైజై ధ్వానాలతో పరవశిస్తోంది.

అదుగో! పసుపు కుంకుమలతో పచ్చగా నిండుగా వున్న మన ఆడపడుచులు సుమధుర మందహాసాలతో, మంగళారతులతో స్వాగతం చెబుతున్నారు.

నేడు తన ప్రాభవానికి కారకులైన తన ముద్దుబిడ్డల విజ్ఞానాన్ని, మేధాశక్తిని, దేశభక్తిని చూసి మురిసిపోతోంది తెలుగుతల్లి చిరునవ్వులు చిందగా, చిందగా, సందడిగా.

ఇదే ఇదే నేను ఆకాంక్షించే తెలుగు సీమ
ఇదే నేను మీనుండి కోరే సహకారం
ఇదే నా వాంఛితం
ఇదే ఇదే ఇదే నా ధ్యేయం.
స్వస్తి ప్రజాభ్యః పరిపాలయంతాం
న్యాయేన మార్గేణ మహీం మహీశాం
గోబ్రాహ్మణేభ్యః శుభమస్తు నిత్యం
లోకాస్సమస్తా సుఖినోభవంతు

జై తెలుగునాడు — జై హింద్

ఆంధ్రప్రదేశ ప్రభుత్వ పాఠ్య గ్రంథ ముద్రణాలయమున ముద్రితము,
హైదరాబాదు, ఆంధ్రప్రదేశ్, భారతదేశము.